# భారతి

సాహిత్య మాసపత్రిక

జులై 1988 వెల : 5 రూపాయలు



- వేదసావిత్రి – భారత సావిత్రి – "త్రి"
- మధ్యాంధ్ర యుగంలో భూమి సేద్యము - పన్నులు
  – డా. కొల్లూరు సూర్యనారాయణ
- అగ్నిస్పర్శ – శ్రీ నిఖిలేశ్వర్
- రేనాటి సింహము – శ్రీ గడియారం శేషఫణిశర్మ

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సంపుటము : 65 జులై 1988 సంచిక : 7

విడిపత్రిక వెల ఐదురూపాయలు


## విషయానుక్రమణిక

జులై 1988

# స్వ విష యం

"తి" గారి "వేదసావిత్రి-భారత సావిత్రి" పాఠకుల చర్చలలో పాల్గొనేందుకు అవకాశం ఇవ్వగలదని ఆశిస్తున్నాము...

మధ్యాంధ్రయుగంలో భూమి సేద్యము - పన్నులు వ్యాసం కూడా ఆసక్తికర మయిన విషయాలని అనేకమయినవాటిని తెలుపుతుంది...

ఒరియానుంచి అనువాదం చెయ్యబడిన "అర్థం కాని ఆంతర్యం" (రచయిత్రి శ్రీమతి నందినీ శతపథి, అనువాదకులు శ్రీ బాసంగి శ్రీరాములు) ఈ నెల కథ! తెలుగులోనే రాసిన కథలు భారతికి అంతగా రావటంలేదని అనక తప్పటంలేదు...

శ్రీయుతులు శేషశాస్త్రి, సదానందంగార్ల కవిజనాశ్రయ కర్తృత్వాన్ని గురించి చేసిన పునఃపరిశీలనము ఆలోచనలని రేకెత్తింప చేసేట్టుగా ఉండగలదని ఆశిస్తున్నాము.

జూలై నెల సంచికలో ఆగస్టు నక్షత్ర ఫలితాలు ప్రచురిస్తున్నాము! తమ నక్షత్ర ఫలితాలు చూసుకునేప్పటికి ఆలస్యం అవుతోందని అనుకునేవారికి ఈ మార్పు కొంత సంతృప్తిని కలిగించగలదని కూడా ఆశిస్తున్నాము...

# వృద్ధుడికి ప్రేమలేఖ

## శ్రీ రాణీ శివశంకర శర్మ

నువ్విప్పుడొచ్చి ఏం లాభం?
మండుటెండలో అలసి సొలసినపుడు
దారిపక్క చల్లని తరుచ్ఛాయగానైనా నిలువని నీవు
భయంకరమైన ఒంటరితనంలో, జీవితం అర్థాన్ని కోల్పోయిన విషాద తీక్ష్ణక్షణాల్లో
ఒళ్ళోకి తీసుకొని శిశువులా లాలించని నువ్వు,
విషణ్ణపాంథుడు అర్ధరాత్రి ఒంటరి నదీతీరంలో నిలబడి
అవలి ఒడ్డు అదిరిపోయేలా అరచినపుడు
నేనిక్కడున్నాననైనా బదులు పలకక
అతని పిలుపుని శూన్యాని కప్పగించిన నువ్వు,
ఇప్పుడింత ఆలస్యంగా వచ్చి ఏం లాభం?
అకాల వర్షంలా వృద్ధుడికి ప్రేమలేఖలా.
నీకోసం ఈది ఈది కెరటాల సర్పాలతో పోరి పోరి
తీరా చెంతకు జేరాక ఉసూరుమనిపిస్తూ చెయిజారిపోయిన నువ్వు
ఇప్పుడన్ని శక్తులు ఉడిగి అలసిపోయిన జీవితం
వేదాంతాన్ని విరక్తిని జీర్ణించుకొన్న తర్వాత
కుతూహలాన్ని నిరీక్షణని కోల్పోయిన హార్బర్లో
హఠాత్తుగా సాక్షాత్కరించి ఏం లాభం?

# రేనాటి సింహము

శ్రీ గడియారం శేషఫణి

సీ॥ అక్రమ కుటిల తంత్రక్రియా దక్షులౌ
పాశ్చాత్యులకు వీరభద్రమూర్తి!
అప్రాచ్య కనక కశ్యప మదోద్ధత వైరి
హంవీరులకు నృసింహావతార!
మాత్మం భరోద్యోగమౌ శ్వేతజాతికి
ఆతత ప్రళయ ఝంఝూలనిమ్ము!
అతివేల దీక్షా నిరస్త్రాది తేయమౌ
రాహుదీప్తికి సహస్రారధార!

గీ॥ ఆతడే మాతృదాస్యమ్ము నపనయింప
స్వర్గముఁ జేరగన్న సువర్ణమూర్తి!
ప్రచుర జీవచ్ఛవి దరిద్రాణమైన
భరత జాతి కతండె జైవాతృకుండు!!

మ॥ అమితోద్దండ చమూ సముద్ధత మహాహంకారవోంసా రిరం
సము, ప్రాగల్భ్యవచః ప్రశంసము, నిరస్తంయాత చండాంశురం
హము, నాంగ్లేయ విభుత్వసింహము ననాయాసమ్ముగా, వత్త్వవి
త్తమ విస్ఫూర్తి కలంచి మించిన మహోదారుండతం డెన్నగ౯

గ॥ అతడు హారహార తారనీహార హీర
చారు శారద నీరదోదార కీర్తి
స్థిరత రౌద్రార్యుడపర నృసింహమూర్తి
నారసింహుండు రేనాటి వీరవరుడు!

గీ॥ మొదటి స్వాతంత్ర్య సంగ్రామమువకు మున్నె
తన ధన ప్రాణముల్ దీక్ష ధారవోసె
అమరుడైనట్టి వీరు డుయ్యాలవాడ
రెడ్డివర్యుడు వీరవరీయు డతడు!!

[బ్రిటిష్ ప్రభుత నెదిరించి సిపాయిల తిరుగుబాటుకన్న ముందే 1845 ప్రాంతంలో వీరమరణంపొందిన అమరవీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి వీరస్మృతికిది అక్షరాంజలి]

# వేదసావిత్రి - భారతసావి

భారతి (జూన్, జూలై 1986)లో శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు వ్రాసిన "ఆంధ్ర మహాసావిత్రి - ఒక సమీక్ష" చదివితిని. అరవిందయోగి ఇంగ్లీషు కావ్యం "సావిత్రి"కి తెలుగులో శార్వరి చేసిన అనువాదం "ఆంధ్ర మహా సావిత్రి" పైని శ్రీ శర్మగారి సమీక్షా వ్యాసమది. ఇందులో శ్రీ శర్మగారు తమ విశిష్టశైలిలో, ఆత్మప్రత్యయంతో ఎన్నియో నిగూఢ వేదాంత రహస్యాలూ, పరలోక దర్శనం, యోగం, పాతివ్రత్య మాహాత్మ్యం మొదలగు గంభీర విషయాలు వ్రాసిరి. నేను అరవిందుల ఇంగ్లీషు కావ్యం కానీ, దాని తెలుగు అనువాదం కానీ ఇంతవరకు చదువలేదు. నాకు అరవిందుల యోగసిద్ధి లేదు. ఆయన వేదర్షులైన వామదేవ దీర్ఘ తమసుల కోవలోకి పోయినారు. నాకు శ్రీ శేషేంద్ర శర్మగారి యోగ పరిజ్ఞానం, ప్రతిభా వ్యుత్పత్తులు లేవు. అయినా శ్రీ శర్మగారి సమీక్ష చదివేటప్పుడు నాలో దాగియున్న కొన్ని ఆలోచనా పరంపరలు పైకి వచ్చినాయి. ఈ ఆలోచనలను వేదవిజ్ఞాన జిజ్ఞాసువుల సమక్షాన ఉంచుతున్నాను. నేను వ్రాసినదే సరియైనదని అనను. వేద శబ్దాలను ఎట్లర్థం చేసికొనేది? వేదాలు వేశ్యల వంటివని వేమన అన్నాడు.

"వేద విద్యలెల్ల వేశ్యల వంటివి."

ఈయనే తర్వాతి పాదంలో

"గుప్తవిద్య యొకటి కులకాంత వంటిది"

అన్నాడు. ఆ గుప్తవిద్య (నిజ్యావచ) వేదంలోనే ఉంది. దానిని తెలిసికొనే నిలుకడ ఈ యోగికి లేదు. "గూఢంజ్యోతి" వంటి సంకేత పరిభాష వేదం పెట్టిన భిక్షయే. ఇది తర్వాత చర్చిస్తాను.

వేదాలు సుందరమైన ఉత్తపెట్టెలని ఒక ఆధునిక మేధావి అన్నాడు. వేద మంత్రాలకు అర్థమే లేదని ప్రాచీనులే కొందరు వ్రాసినారు. ఇక చార్వాకులు వేసిన అభాండాలు, చేసిన గేలి (చూ: "సర్వదర్శన సంగ్రహం") సంగతి చెప్పపనే లేదు. ఇటువంటి విమర్శలకేమి? ఏ ప్రాచీన మతగ్రంథంపైనయినా చేయవచ్చును. వేదం మతగ్రంథంగానూ కనబడదు. ఇప్పుడు ప్రపంచం అంతా ఇంధన సంక్షోభం-అంటే ఇంధనాలు తరిగిపోతూ వుండడంచేత కల్గిన సంక్షోభం-ను ఎదుర్కొంటున్నది. విశ్వసాహిత్యంలో మొట్టమొదటిదైన ఋగ్వేదంలో మొదటి మండలంలో మొదటి సూక్తంలో, మొదటి మంత్రంలో మొదటి పదం "అగ్ని"! అంటే శక్తి. ఇది వారి క్రాంత దృష్టి.

"అగ్నిమీళే పురోహితమ్"-ఋగ్వేదం I-1-1 (ఈ వ్యాసంలో ఉదహరించిన ఋగ్వేద మంత్రాల వివరాలివి: మొదటి రోమను అంకె మండలం, రెండవ అంకె సూక్తం, మూడవ అంకె మంత్రాన్ని సూచిస్తుంది. వేదం పేరు లేకుంటే ఋగ్వేదం అనే అర్థం చేసుకొనవలెను.)

శక్తి ప్రాముఖ్యాన్ని ప్రకటించిన ఋగ్వేదంలో సమయౌచిత్యం ఉందని ఒప్పుకొనవలెను. నాది విమత దృక్పథం. కొంతవరకు హేతువాదం వైపుననే మొగ్గుతుంది. దేవుడనే వాడొకడుందే, కనపడక ఉండిపోతాడా అని కూడా అనుకొంటుంటాను. మానవ జీవితమంతా హేతువాద ప్రాతిపదికపై గడపడం సాధ్యం కాదనీ నా విశ్వాసం. హేతువుకు ప్రతిద్వంద్వి అహేతుకత కాక, అజ్ఞాత హేతువులు కావచ్చననీ నా అనుమానం. ఈ అదృష్ట హేతువు మానవాతీతం కానక్కర లేదు కూడ. వేదాంతం మీద వ్రాయరాదు అనేది నా కట్టడి. అయినా శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారి సమీక్ష చదివేటప్పుడు, వారి భావాల పైనా, మహాభారతంలోని సావిత్ర్యుపాఖ్యానం మీదా, గాయత్రీ మంత్రం ఎడలా కొన్ని భావాలు తోచినవి. ఉండబట్టలేక అందరికీ వినబడునట్లు ఏవం విధముగా ఆలోచిస్తున్నాను :

## 1. మృత్యులోక దర్శనం

వర్తమానంలో భవిష్యత్తును తెలిసికొన కోరడం, బ్రతికి ఉన్నప్పుడే చావంటే ఏమో తెలిసికొనకోరడం, క్షుద్ర మనస్తత్వం. దీనికి నిదర్శనాలు నిత్యజీవితంలోనూ సాహిత్యంలోనూ కన్పిస్తాయి. శ్రీ శర్మగారు మృత్యులోక దర్శనం వర్ణించే దృష్టాంతాలిచ్చిరి: ధర్మరాజు స్వర్గారోహణం, ఇలియడ్ కథ, సుమేరియన్ గాథ గిల్గమేష్, డాంటే "దివ్యమోదాంతం" కఠోపనిషత్తులోని నచికేతుని కథ, అరవిందుని "సావిత్రి" నిర్మాణవస్తువుకు కఠోపనిషత్తు పునాదిరాయి అని శ్రీ శర్మగారు దృఢంగా నమ్ముచున్నారు. కఠోపనిషత్తులో నచికేతుడనే బాలుడు మృత్యులోకానికి పోయి యముని జనన మరణ రహస్యం చెప్పమనడమూ, యముడే బాలుని శ్రద్ధాభక్తులకు మెచ్చి బోధించడమూ ఆ ఉపనిషత్తులో ఉంది. ఇట్టి బాలుని విషయం ఋగ్వేదంలోనే వస్తుంది.

పదియవ మండలం, 135వ సూక్తం. దీనికి ఋషి "కుమార" నామధేయుడు. దేవత యముడు. ఈ సూక్తం ఒక డిటెక్టివ్ కథ

వలె ఉంది. ఒక పిల్లవానికి యమలోకంలో ఉండే తన పితరులను చూడవలెననిపిస్తుంది. ఒంటిచక్ర రథం తయారుచేసికొంటాడు. ఈ పిల్లవాని పేరు "కుమార్", ఋషి పేరు కూడా కుమారుడు. పిల్లవానిని "యంకుమార" అని రెండుసార్లు సూక్తంలో పిలుస్తాడు ఋషి. సాయణుడు భాష్యంలో ఈ పిల్లవానిని నచికేతుడనే పిలుస్తాడు. మన కుమార్‌కు యమలోకంలో ఎవరూ మృతురహస్యం, సృష్టి మూలం చెప్పరు. నాసదీయ సూక్తంలో సృష్టిగురించి ప్రశ్నపరంపర లున్నట్లు, ఈ సూక్తంలోనూ అన్నీ ప్రశ్నలే. సూక్తం ఇట్లు ముగుస్తుంది:

"ఇదం యమస్య సదనం దేవమానం యదుచ్యతే
ఇయమస్య ధమ్యతే నాళీర్ అయం గీర్భిః పరిష్కృత"
(10 - 135 - 7)

ఇది యముని ఇల్లు. దేవతల నివాసం. యముని పిల్లనగ్రోవిని ఎవరు వూదుదురో, ఆ దేవుని యెవరు కీర్తింతురో.

వేదర్షి వివృత మనస్కుడు. కావుననే కుమారునకు యమ సదన దర్శనమైంది కానీ సృష్టి రహస్యం తెలియలేదు. మంచి కవిత్వం ముగించబడదు. ఎక్కడో వదలివేయబడుతుంది. వేదర్షులు కవులు. ఉపనిషత్కారులు ఆచార్యులు. వీరికంతా మంగళాదీని, మంగళ మధ్యాని, మంగళాంతాని. కావుననే ఋగ్వేదంలోని ఈ మార్మిక సూక్తం కఠోపనిషత్తులో సాంగోపాంగంగ విస్తరించబడింది.

నాకు మట్టుకు ఋగ్వేదంలోని ఏడు మంత్రాల ఈ సూక్తం, కఠోపనిషత్తుకంటే ఎక్కువ గంభీరంగా, అగాధంగా, రూపకల్పనంగా, ఆలోచనా ప్రేరకంగా కనపడుతుంది.

## 2. గాయత్రీ మంత్రం

రామాయణంలోని ప్రతి వేయవ శ్లోకమూ గాయత్రీ మంత్రాక్షరంతో మొదలుపెడుతుందని అంటారు. సో వాట్? ఋగ్వేదంలోనిదైన సవితృ మంత్రం (సావిత్రి)కు మహాభారతంలోని సావిత్ర్యుపాఖ్యానంకి ఏమయినా సంబంధం కలదా అనే ప్రశ్న రాక మానదు.

మూల గాయత్రీ మంత్రమిది :[1]

"తత్ సవితుర్ వరేణ్యం (వరేణియం అని కూడ)
భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్" (3-62-10)

## 3. గాయత్రీ మంత్ర శబ్దార్థం

ఈ మంత్రానికి, సావిత్రి కథకు ఏమైనా సంబంధం కలదా అనేది చర్చనీయం. సవితృ మంత్రం బింబం అనీ సావిత్రికథ ప్రతిబింబమనీ, మంత్రంలోని శబ్దాలు, కథలోని పాత్రలు ఒకే సంకేతార్థం గల ప్రతీకలని వివరిస్తాను.

మంత్రంలోని శబ్దాలు : సవితుః, వరేణ్య, భర్గోదేవ. ఈ శబ్దాలన్నీ "వెలుతురు" అనే అర్థాన్ని ఇచ్చేవిగా ఉన్నాయి.

సవిత అంటే సూర్యుడు.

వరేణ్యం అంటే ఎన్నుకొనుట, శ్రేష్ఠం అని అర్థం కాదు.

వరేణ్యం = వెలుగుట అని అర్థం.[2]

వర్ = వెలుగు, వర్చస్; వర్ణ ఇత్యాది.

వర్ణ గ్రీకు - వర్
జర్మన్ - ఫయర్ (మంట)
ఇంగ్లీషు - బర్న్ (మండుట)
- పైర్ (చితి)
- ఫయర్ (అగ్ని)

సవితుర్వరేణ్యం = ధగ ధగ మండే సూర్యుడు.

భర్గోదేవ. భర్గ = దీప్తి
వర్, భర్, భ్రా ఇవన్నీ "వెలుతురు" అనే అర్థం గల శబ్దాలు.

భర్గోదేవులు ఎవరంటే అగ్ని, సూర్యుడు, చంద్రుడు అని "సావిత్ర్యుపనిషత్తు" ("అగ్నిరేవభర్గ, ఆదిత్యోవై భర్గ, చంద్రమా వై భర్గ")

మంత్రం నిండా "వెలుతురు" అని అర్థం కల శబ్దాలున్నాయి. ఋగ్వేదంలోకెల్లా ఎక్కువ ప్రశస్తి పొందినట్టి, వర్ణవ్యవస్థకు మూలమైనట్టి, ఆధునిక హిందూ సమాజ అంతర్విచ్ఛిత్తికి దారి తీసినట్టి ఈ మహా మంత్రం అర్థమేమయి వుంటుంది? "వెలుతురును ఉపాసిస్తాను. ఆ వెలుతురు నా మనస్సును ప్రేరేపించి నడిపించుగాక" అని అర్థం.

దేనివైపు? ఎక్కడికి? ఆ వెలుతురు ఏమి?

"వెలుతురు" అంటే ఫిజిక్సులో చెప్పే 4000-8000 ఆంగ్‌స్ట్రోముల తరంగదైర్ఘ్యం కల శక్తి కిరణాలా? లేక ఇంక దేనికైనా ప్రతీకయా? "ఏ వెల్గుల కీ ప్రస్థానం?" అనిన శ్రీశ్రీ గాయత్రీ మంత్రాన్నే చెప్పినాడు. ప్రాచీన గ్రీకులు సూర్యోపాసకులు. సోక్రటీసు ప్రతి ఉదయ సంధ్యలలో సూర్యోపాసన చేసేవాడట. ఇక్బాలు కవి గాయత్రీ మంత్రాన్ని "అఫ్‌తాబ్" అనే శీర్షికతో ఉర్దూలోనికి తర్జుమా చేసినాడు.[3] ఇట్టి సార్వజనీన, సార్వకాలిక, ఔచిత్యం కల గాయత్రీ మంత్ర రహస్యమేమి? అది సావిత్రి కథలో ప్రతిబింబించిందా?

## 4. సవిత ఎవరు? సావిత్రి ఎవరు?

సవిత ఎవరు? సావిత్రి ఎవరు? అనే ప్రశ్నను తనకు తానుగానే వేసికొని "సావిత్ర్యుపనిషత్తు" సృష్టినంతా సవితా సావిత్రుల మిథునంగా (ఈ మాట ఆ ఉపనిషత్తులోదే - "తి") వర్ణించింది. ఆ జంటలను పట్టికలో ఇస్తున్నాను.

| సవిత | సావిత్రి |
|---|---|
| అగ్ని | పృథ్వి |
| వరుణుడు | జలము |
| వాయువు | ఆకాశము |
| యజ్ఞము | ఛందస్సు |
| మేఘము | విద్యుత్తు |
| సూర్యుడు | ద్యులోకము |
| చంద్రుడు | నక్షత్రాలు |
| మనస్సు | వాక్కు |
| పురుషుడు | స్త్రీ |

—(సావిత్ర్యుపనిషత్తు)

"గాయత్రీ ఉపనిషత్తు"లో సవితా - సావిత్రుల క్రొత్త జంటను చూడవచ్చును:

| సవిత | సావిత్రి |
|---|---|
| దినము | రాత్రి |
| అగ్నము | వర్షము |
| ఉష్ణము | శీతము |
| విద్యుత్తు | |
| ప్రాణము | అన్నము |
| వేదము | ఛందస్సు |
| యజ్ఞము | దక్షిణ |

—(గాయత్రీ ఉపనిషత్తు)

(గాయత్రీ రహస్యోపనిషత్తు) కర్మకాండగ, తంత్రశాస్త్రం వలె సంకేత పరిభాషలో ఉంది, మూలమంత్రాన్ని ఫజీతు పట్టించింది. "మహానారాయణోపనిషత్తు" లోని 18 గాయత్రులు, మూలగాయత్రికి "పారడీ"లు వలె వుండగా ఈ ఉపనిషత్తులు మనకున్న 'ధీ'(బుర్ర)ని "అయోమయమార్గ ప్రచోదయాత్"గ చేసేవిగా ఉన్నవి. "బ్రహ్మోపనిషత్తు" నయం. "బ్రహ్మభావ మిదం సూత్రం" అంటుంది. "జ్ఞాన యజ్ఞోపవీతినాం" అంటుంది. "ఆత్మవిద్య తపోమూలం" అని ముగుస్తుంది. విశ్వామిత్రుని సవితృ మంత్రం ఆత్మవిద్య ("సెల్ఫ్ కల్చర్") కోసమే ప్రకటించబడింది.

ఆ ఆత్మవిద్య ఎట్లు వస్తుంది?
సవిత అంటే వెలుతురు అంటే సత్యం.
సావిత్రి అంటే బుద్ధిచింతన.
ప్రచోదయాత్ బుద్ధి చింతనను సత్యంవైపు మళ్ళించడం.

## 5. సావిత్ర్యుపాఖ్యాన పాత్రలు

మహాభారతంలోని సావిత్ర్యుపాఖ్యానంలోని పాత్రలు :

| | | |
|---|---|---|
| సావిత్రి | | కథానాయిక |
| అశ్వపతి | | సావిత్రి తండ్రి |
| ద్యుమత్సేనుడు | - | సావిత్రి మామ, సత్యవానుని తండ్రి |
| యముడు | - | మృత్యుదేవత |
| సత్యవంతుడు | - | సావిత్రి భర్త |

గాయత్రీ మంత్రంలోని పదాలు "వెలుతురు" అనే అర్థం ఇచ్చేవి అని వ్రాసితిని. అలాగుననే పైని పేర్కొన్న పాత్రల పేర్లన్నీ "వెలుతురు" (ముఖ్యంగా "సూర్య" పరంగా) అనే అర్థం కలిగి వుండుటను గమనించండి.

ఋగ్వేదంలోని మంత్రంలో వచ్చే అమూర్త భావజాలాన్ని సజీవ పాత్రలుగా చేసి, ఆ మంత్రార్థమును నాటకీయంగా వ్యాసుడు వ్రాసినాడు. ఇది వేదవ్యాసుని బృహత్ప్రణాళికలో ఒక భాగం మాత్రమే. సావిత్రి కథలోని పాత్రలు, వాటి పేర్లు ప్రతీకలు. ఈ విషయం వివరించేముందు, వేద పరిభాషను ఎట్లా అన్వయించుకొనేది అనే సమస్య తేల్చుకొనవలెను.

## 6. వేదం ఏమి చెప్పుతుంది?

వేదం ఏమి చెప్పుతుంది అనే ప్రశ్నకు చాలా సమాధానాలున్నాయి. అంటే, వేదానికి అర్థం అంటూ ఒకటుందా? ఒకవేళకు వుంటే వేదం ఇతివృత్తమేమి అనేది ప్రశ్న. ఈ ప్రశ్నకు నాకు తెలిసిన, నేను చదివిన సమాధానాలు టూకీగా ఇస్తున్నాను.

- వేదమంత్రాలు గడబిడ శబ్దాలేకాని వాటికర్థాలు లేవు.
- వేదమంత్రాలు సుందరమైన ఉత్తపెట్టెలు. అందే వాటిలో పట్టేటంత ఏ అర్థాన్నయినా పెట్టవచ్చును. (అరుణ శౌరి)
- వేదమంత్రాలు చవటలు. "జర్ఫరీ", "తుర్ఫరీ" వంటి పదాలతో కూర్చినట్టి వాగుడులు. (చార్వాక మతం)
- ప్రకృతి బీభత్సాన్ని చూచి భయాపహులై ఆదిమానవులు ప్రకృతి శక్తులు ఉపశమించేందుకు పాడిన ప్రార్థనలు. (పాశ్చాత్యులు)
- వేదములు బ్రహ్మజ్ఞానము (ఉత్తరమీమాంస)
- వేదములు ధర్మకర్మ విధులు (పూర్వమీమాంస)
- భూమండలం తయారయ్యే ప్రాచీన భూగోళ పరిస్థితిని వర్ణించేవి వేదాలు. (భూగోళ నిర్మాణ సిద్ధాంతం)-(పరమశివ అయ్యరు)
- మానవ శరీర శాస్త్రం వేదం (రేలే)
- వేదాలు భారతీయ విజ్ఞాన భాండారాలు. (దయానంద సరస్వతి)
- వేదాలు మార్మిక తాత్త్విక చింతనలు (అరవిందులు)
- వేదాలు రసాయన శాస్త్రం. (నారాయణ గౌడు)[4]
- వేదాలు మాంసాహార పాకశాస్త్రాలు. (ధూర్తులు)[5]

## 7. వేదం అర్థం చేసికొనేది ఎట్లా?

వేదమంత్రాలను గట్టిగా చదువండి. అరెరె, ఇందులో మనం ఉపయోగించే మాటలున్నాయే అనిపిస్తుంది. కానీ ఏమీ అర్థం కాదు. వేదంలో వచ్చే పదాలు చాలా ఆధునికంగా వుంటాయి. పిల్లలకు పేర్లు పెట్టుకోవడానికి బాగుంటాయి. ఫేషనబుల్‌గా వుంటాయి. ఉదా:— విభావరి, ఋతావరి, సూనృతావరి, గోమతి, అశ్వావతి, భాస్వతి, సునీథ, సుజాత, సుదాస, దివోదాస, ఉష, హరికేశ, మాతరిశ్వ, ఓదతి, వాజిని, సరస్వతి, భారతి, భరత, సీత, దశరథ.

సంప్రదాయకంగా చెప్పవలసివస్తే, వేదవ్యాసుడు వేదాలను నాల్గుగా విభజించేనాటికే - అంటే 5090 ఏండ్ల క్రిందనే, వేదం అర్థమవుతూ ఉండలేదట. వేదార్థాన్ని పామరులకర్థమయ్యేట్లు వేదవ్యాసుడు జయ - భారత - మహాభారతావతరణానికి కారకుడైనాడు. దానికే భారతాన్ని ఐదవ వేదం అన్నారు.[6] వేదాన్ని అర్థం చేసికొనేందుకు ఆధారాలేవి? ఏదైనా ఒక భాషను నేర్చినా మనుకొనండి. ఆ భాషలోని గ్రంథాలను ఒక్కొక్కటి నిదానంగా చదువుతూ పోతే అర్థమవుతుంది. "కఠిన"మైన పదాలకు డిక్షనరీ చూస్తే సరి. కాని ఋగ్వేదాదులు అట్లు కాదు. అందులోని మాటలు పరిచితాలుగా కన్పడతాయి కానీ మంత్రం మాత్రం అర్థంకాదు. అంటే వేదాన్ని ప్రాథమిక సూత్రాలబట్టి (ఫస్ట్ ప్రిన్సుపల్స్) అర్థం చేసుకోలేము. "ఫిన్నిగాన్స్ వేక్" (జేమ్సు జాయిసు వ్రాసిన మార్మిక నవల)నైనా, తిక్కన పద్యాన్నయినా చదివి చదివి అర్థం చేసుకోవచ్చు కానీ, వేదం సంగతి అట్లా కాదు. ఆనందతీర్థ (మధ్వాచార్యులు), దయానంద సరస్వతి, అరవింద యోగులకు, వేదర్షులకుండే క్రాంతదృష్టి ఉండివుంటుంది. సాయణుడు అపార పాండిత్యం కలవాడు. నాలాంటివారు వారినుండీ, వీరినుండీ విషయాలు సేకరించుకోవలెను. క్రాంతదృష్టి విహీనులకు ఆధారాలు రెండు: ఒకటి: యాస్కుని నిరుక్త-నిఘంటువులు. రెండు: జైమినీ కృత (పూర్వ) మీమాంసా సూత్రాలు. యాస్కుని కాలం (క్రీ.పూ. 700 సం॥) నాటికే వేదంలో అర్థంకాని మాటలు కొన్ని నూర్లుండినాయి. జైమిని మీమాంసా సూత్రాలు వైదిక కర్మకాండను విపరిస్తుంది అంటారు సంప్రదాయ పండితులు. వేదంలోని మాటల కర్థం తెలుసుకొనే సాధనం మీమాంసయే అంటాడు తదాని పండితుడు. మీమాంసా సూత్రాలను ఇంగ్లీషులోకి వినూత్న పద్ధతిలో అనువదించినాడు.

మాటల కర్థం తెలియుట ఒకటి. వాక్యంలో ఆ మాట కర్థం తెలియుట రెండవది. ఇది అన్ని భాషల వాక్యాలకున్న సమస్యే అయినా, వేదవాక్యంలో మరీని. ఈ కష్టం రెండువిధాలుగా వుంటుంది. ఈ వాక్యానికి ఇదేనా అర్థం లేక రహస్యార్థం ఇంకొకటి ఉందా ఏమి అనే సందేహం కలుగుట మొదటి కష్టం. ఋగ్వేదంలో ఒకమాట ఏ సందర్భంలో ఉంటే కూడా ఒకే అర్థం కలిగివుంటుంది. "గోవు" అనే పదం తీసికొందం. ఒక జంతువు, భూమి అని అర్థాలున్నాయి. ఇవి నానార్థాలు. "ఋతము" అంటే సత్యం, యజ్ఞం, నీరు అనే అర్థాలు. యాస్కుని నిఘంటువులో "నీరు" అనే మాటకు వేదంలో 101 పేర్లున్నట్లు వ్రాసివుంది. "వాక్కు"కు 57 పర్యాయ పదాలున్నాయి. ఆయా మాటలను పరిశీలిస్తే ఒకదానికొకటి బొత్తిగా సంబంధం లేనివిగ కనబడతాయి. ఈ మాటలకు పైకి కనపడే అర్థమొకటేనా, లేక దానిలో దాగికొని వేరొక అర్థం ఉంటుందా? ఆ మాట దేనికైనా ప్రతీకయా? ఆ ప్రతీక దేనికైనా ప్రతిబింబమా? అనే ప్రశ్నలు వస్తాయి. "గోవు" అనేమాట ఒక జంతువు పేరు. ఆ పదానికి వెలుతురు అని కూడ సంకేతం. ఈ సంకేతం జ్ఞానానికి సింబల్ అనుకోవచ్చు. మీమాంసా దర్శనంలో వైదిక పదాలను అర్థం చేసికొనేందుకు ఒక గొప్ప చిట్కా ఉన్నది. అదేమంటే ఆ మాటను "పగులగొట్టు" అంటుంది ఆ చిట్కా. "అశ్వ" శబ్దాన్ని అ-శ్-వ అని విడగొట్టితే ఆ శబ్దార్థం సులభగోచర మవుతుందట! ఇట్లు చేసేందుకు మీమాంసలో "లింగదర్శనాచ్చ" అని మరీ మరీ వస్తూ వుంటుంది. వేదపరిభావను అర్థం చేసుకోవడానికి నిరుక్తం కంటే మీమాంసయే తిరుగులేని సాధన మంటాడు తదాని పండితుడు. జైమిని మీమాంసా సూత్రాలను "దర్శనానాం దర్శన" (దర్శనంలో దర్శనం) అంటాడు.

వేదపదాలను పగులగొట్టవలసి వస్తే, వేదవాక్యాల సంగతేమి? షేక్సుపియరును, టాల్‌స్టాయ్‌నీ చదువుతుంటే, 'ఓహో' ఈయన ఈ విషయం చెబుతున్నాడు, శ్రద్ధగా అర్థం చేసికొందాము" అని పిస్తుంది. కాఫ్కా వ్రాసిన "విచారణ", హెమింగ్‌వే వ్రాసిన "ముసలివాడు - సముద్రము", రిచర్డ్‌బాక్ వ్రాసిన "జోనాథన్ లివింగ్‌స్టన్ సీగల్", జార్జ్ ఆర్వెల్ వ్రాసిన "పసులదొడ్డి" చదువ మొదలిడగనే వహ్వా తమాషాగా వుందే అనిపిస్తుంది. అట్లే చదువుతూ పోతే మనస్సు కలవరం చెందుతుంది. రచయిత ఇంకా ఏదో చెప్పుతూ పాఠకుడనైన నాకు టోకరా వేస్తున్నాడనిపిస్తుంది. వేద మంత్రాలు చదువుతూ ఉంటే ఇదే భావం కలుగుతుంది. వేదంలో వేరే అర్థం వుంది అనిపిస్తుంది. ఇంగ్లీషుకవి ఆడెన్ కవిత్వం చదువరుల అర్థగ్రహణశక్తి ప్రకారం అర్థమిస్తుందంటాడు. ఇదే వేదం గురించి ప్రాచీనకాలంనుంచీ వస్తున్న విశ్వాసం. వేదానికి మూడర్థాలు (త్రయోరర్థా సర్వవేదేషు) అని పురాణాలు చెప్పుతున్నవి. వేదమంత్రాలకు మూడు విధాలుగ అర్థం చెప్పవచ్చునన్నాడు యాస్కుడు-అవి: అధియాజ్ఞిక, అధిదైవిక, ఆధ్యాత్మిక విధాలు. (యజ్ఞదైవతే పుష్పఫలే దేవతాధ్యాత్మేవా) యాజ్ఞిక దైవికార్థాలు పుష్పాలైతే, ఆధ్యాత్మికార్థం ఫలం అవుతుంది అని యాస్కుని చమత్కారం. ఇట్లు వేదార్థం సోపానప్రాయంగా ఉంటుంది. వైదికశబ్దాలు సాంకేతికాలనీ, వాటి

అర్థం ప్రతిబింబప్రాయమని ఇంతకుముందు అన్నాను. వేదంలో సింబాలిజంలో సింబాలిజం ఉంటుంది. దీనిని "టెలిస్కోపిక్ సింబాలిజం" అంటాను నేను. పంచతంత్రంలో కథలో కథ వుంటుంది. చిత్రకవిత్వంలో ఒకవిధమైన పద్యంలో ఇంకొకవిధమైన పద్యం ఉండినట్లు.

వేదంలో రహస్యార్థాలున్నాయని బయటివారంటే సరి పోతుందా? అట్టి విశ్వాసానికి వేదంలోనే అంతస్సాక్ష్యం ఆధారంగా వుందా అని అడుగవచ్చును. వేదంలోనే ఆ సాక్ష్యాలు ఇమిడివున్నాయి.

1. వామదేవుడు అగ్నికి చెప్పిన ఋక్కు :

ఏతా విశ్వా విదుషే తుభ్యం వేధో
నీథాన్యగ్నే నిణ్యా వచాంసి (4-3-16)

అగ్నీ! రహస్య వచనాలతో కూడిన ప్రార్థన గైకొనుము.

2. వసిష్ఠుడు మిత్రావరుణులతో అంటాడు.

నవాం నిణ్యాన్యచితే అభూవన్ (7-61-5)

మీకు మా రహస్య స్తోత్రాలు తెలియనివి కావు.

"నిణ్యాని రహస్యాని అపి స్తోత్రాణి" అని సాయనుడు "నిణ్య" అంటే రహస్యం - అంటే వేదంలో రహస్యార్థాలున్నవని సూచితం.

3. దీర్ఘతమసుడు అంటాడు.

న విజానామి యది వేదం అస్మి
నిణ్యః స నద్ధో మనసా చరామి 1-164-37)

నేనెవరినో నాకే తెలియదు. మనస్సులో రహస్యంగా తిరుగుతుంటాను. అని అర్థం. ఇచట "నిణ్య" పదం మనస్సుపరంగా వాడబడింది.

4. ఇదే దీర్ఘతమసుడు "అస్యవామస్య" సూక్తం అని ప్రసిద్ధి పొందిన ఒక సూక్తం చెప్పినాడు. ఈ సూక్తం ఋగ్వేదంలో కెల్లా కష్టమైంది. ఇందులో ఒక మంత్రం ఇలాగుంది:

చత్వారి వాక్ పరిమితా పదాని
తాని విదుర్ బ్రాహ్మణాని మనీషిణః।
గుహా త్రీణి నిహితా నేంగయంతి
తురీయం వాచో మనుష్యా వదంతి॥ (1-164-45)

వాక్కు నాలుగు విధాలుగా విభక్తమై వుంది. మేధావులైన వేదవిదులు వీని నెరుంగుదురు. ఇందులో మూడు గుహలో దాగికొని ఉన్నవి. నాల్గవ వాక్కే అజ్ఞాన మానవులు పల్కెదరు.

అంటే ఏమిటి? వేదవాక్కు ముప్పావుభాగం రహస్యంగా దాగి వుందనీ, వేదరహస్యం మనీషులకే తెలియుననీ, ఉత్త మనుషులకు కేవలం వేదపదాలు తెలుసుననీ అర్థం. కావుననే కాబోలు, వేదవిదులు, వేదార్థవిదులు అని రెండు రకాలుగా ఉన్నట్లు చెబుతారు. వేదవిదులు అంటే వేదమంత్రాలను గడగడా వప్పజెప్పేవారు. మంత్రాలను చెప్పడంలో చాలా పద్ధతులున్నాయి. స్పష్ట ఉచ్చారణ, స్వరం ముఖ్యం. వేద మంత్రాల పఠనం విని ఎవరైనా గుమ్మయిపోవలసిందే. అందుకే మంత్రాలకు అర్థాలే లేవు. వాని శబ్ద వైబ్రేషనులే మాహాత్మ్యం చూపిస్తాయి అని బాగా చదువుకొన్నవారు కూడా నమ్ముతారు. ఉచ్చారణ, స్వరమూ ముఖ్యమే. కురాను పఠనంలోనూ ఈ నియమాలున్నాయి. కురాను సూక్తులను "సురా" అంటారు. "సురా" స్వరను బోలుతుంది. కురాను సురాపఠనం చిత్రమైన రాగంలో దీర్ఘంలో సామగానం మాదిరే ఉంటుంది. కేతలిక్కుల "గ్రిగారిక్ చాంట్"లు (గ్రిగరీయ ఛందములు) గీతాలాపనలు. వీని పాడుటకు తరిబీదు అవసరం. ప్రాచీనులు కూడా వేద శబ్దాలమీద మూఢమనదగిన నమ్మకమున్నవారే అనుటకు "ఇంద్ర శత్రు" అనే మంత్రభాగం ఎడల కథయే.[7] కేవల వేదశబ్దాల లోలుపత చాలదు అంటాడు యాస్కాచార్యుడు. వేదాన్ని అర్థం చేసుకో అంటుంది నిరుక్తం. వేదం చదివీ అర్థం తెలియనివాడు ఎండు కట్టెల మోపు మోయువానితో సమానుడు. శబ్దాలు వల్లించి అర్థం తెలియనివాడు మండని కట్టెవంటివాడు అని నిర్దాక్షిణ్యంగా అన్నాడు.[8] సావిత్ర్యుపాఖ్యానంలో వచ్చే పాత్రలపేర్లు "వెలుతురు" అనే అర్థాన్ని కల్గి ఉన్నాయి అని చెప్పినాను. ఇప్పుడు ఒక్కొక్క పేరునే తీసికొని వేదపరంగా ఆ పేరు వెలుతురు అనే అర్థం ఎలాగు కలిగివుందో, మహాభారతకర్త ఆదేపనిగా ఒక వ్యూహంగా ఆ పేర్లు ఎందుకు పెట్టినాడో చర్చిస్తాను.

## 7. సావిత్రీ కథ పాత్రల పేర్లు - ప్రతీకలు

### అశ్వపతి - సావిత్రి తండ్రి

అశ్వశబ్ద చర్చ :

అశ్వం కేవలం ఒక జంతువు కాదు. అశ్వశబ్దం శక్తికి ప్రతీక. నేటికీ మోటారు యంత్రశక్తి అశ్వశక్తి (హార్సుపవర్)లో కొలుస్తారు. వేదంలో దీనికి "అశ్వరాధసాః" అని వుంది (5-10-4)

అశ్వపదం వేడిమికి, విద్యుత్తుకు, ఆకర్షణశక్తికీ అన్వయిస్తుంది. గతిశక్తికి (కైనెటిక్ ఎనర్జి) అన్వయిస్తుంది.

"అశ్వం నత్యావార వసుం విదధా అగ్నిం" (1-27-1)

"ఆత్మేవ వాతః శ్వః"

"అశ్వబుధ్నః" (10-8-3) అశ్వశక్తికి బునాది అని అర్థం దేవ వైద్యులు అశ్వినీ దేవతలు వడివడిగ గుర్రాలమీద పోతారు. గ్రీకు పురాణాల్లోని కాస్టరు-పోలక్సులను పోలుతారు. అశ్వినులు సూర్య సఖులు. హిరణ్య వర్తనులు, రుద్రవర్తనులు.

సూర్యునికి ఏడు గుర్రాలు. ఈ ఇమేజరీ చూడండి:

1. "ఏకో అశ్వో వహతి సప్తనామా" (1-164-2)

గుర్రం ఒకే ఒకటి - పేర్లు ఏడు. అంటే సూర్యుని కాంతి ఒకటే. దానికి ఏడురంగులు. ఇది "విబ్‌గ్యార్" అనే సప్తవర్ణ సముదాయం.

"మిహిర వాజితతి మఘవథ నుర్ద్యుతి".

సూర్యుని ఏడు అశ్వాలు, ఏడు ఛందస్సులుగ - గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతిగ రూపించబడినవి.

(విష్ణు ధర్మోత్తరం)

ఇదే ప్రతిబింబం ఇంకా చూడండి:

ఇమం రథమధి యే సప్త తస్థుః
సప్తచక్రం సప్తవహంతి అశ్వాః॥ (1-164-3)

"అశ్వం" ఉషస్సుతో సంబంధం కల్గి ఉంది ఉషస్సు అంటే ఉదయసూర్య తేజస్సు. వేదంలోని ఉషస్సుపైని గల కవిత్వం ముందట షెల్లీ కీట్సుల కవిత్వం చతికిలపడుతుంది. మొరటుగ కన్పిస్తుంది. అని పాశ్చాత్య పండితులే వ్రాసినారు.

బృహదారణ్యకోపనిషత్తు - "ఉషావా అశ్వస్య మేధ్యస్య శిరః" అని మొదలుపెట్టుతుంది. ఉషస్సు గుర్రమునకు శిరము లేదా గుర్రానికి ఉషస్సు శిరము అని అర్థం. మున్ముందు వస్తున్న సూర్యుని కిరణాలకిది రూపకల్పన.

మెటఫరు(రూపకాలంకారం)ను మార్చి వేదర్షిశ్వేతం నయతి సుదృశీక మశ్వం (7-77-3) అంటే ఉషస్సు మంచి దృష్టి కల తెల్లని గుర్రంమీద వస్తుంది.

నిరుక్తంలో ఉషస్సుకిచ్చిన పర్యాయపదాలలో "వాజిని", "వాజినీవతి" అనేవి ఉన్నాయి. ఉషస్సుకు "గోమతి" (కాంతి కలది), "వీరవతి" (పరాక్రమం), "అశ్వావతి" అనే విశేష్యాలూ వేదంలో కనబడతాయి. ఇవన్నీ అశ్వానికి, తేజశ్శక్తికీ కల సింబాలిక్ సంబంధాన్ని తెల్పుతాయి.

సత్యశ్రవ ఆత్రేయుని ఉషస్సూక్తం [5-79]లో ప్రతి మంత్రం [మొత్తం 10 మంత్రాలు] "వాయ్యేసుజాతే అశ్వసూనృతే" అనే పల్లవితో ముగుస్తుంది. మంచి సత్యం నీ [ఉషస్సు అంటే ఉదయసూర్యుడు] అశ్వాల మార్గంలో ఉంది అని అర్థం.

అశ్వమేధం అంటే మేధాశక్తి.

అశ్వమేధుడు ఒక ఋషి [5-27-4, 5, 6] గ్రీకులు ఎద్దులను నిజంగా బలి ఇస్తూవుండిరి. పురాణేతిహాసాల భ్రష్టత్వానికేమి కాని, వేదంలో అశ్వమేధం అంటే మనశ్శక్తి సాధన. అట్టివే నరమేధ, గోమేధాలు.

సంస్కృతభాష ఎటువంటిదంటే, ప్రతి అచ్చుకూ, హల్లుకూ కూడా నిర్దిష్టార్థాలున్నాయి. అవన్నీ ఇచ్చట చెప్పుటకు వీలులేదు కాని, పూర్వ మీమాంసానుసారం, పదాలను విరుగగొట్టి, 'అశ్వ' శబ్దార్థాన్ని కనుగొందాము.

మీమాంస ఇట్లంటుంది:

సర్వవికారో వా క్రత్వర్థే పశూనాం ప్రతిషేధాత్
-[మీమాంస 10-3-6

మంత్రాలను అన్వయించేటప్పుడు పశువుల ప్రమేయం లేదని తోస్తే పశువుల పేర్ల స్వరూపాన్ని మార్చవలెను, అని అర్థం.

"అశ్వ" శబ్దం అ-శ-వ అని విరుగుతుంది.

శ అంటే జ్ఞానం లేక మనస్సు.

వ అంటే ప్రకృతి.

అ అంటే వలె.

[పూర్వ] మీమాంసలోని ఈ దిగువ రెండు సూత్రాలను అన్వయించుకోవలెను:

1. అపితు అవయ వార్థత్వాత్ విభక్త ప్రకృతిత్వాత్
2. గుణేత్ అంతే వికారః స్యాత్ ధేనువచ్చ అశ్వదక్షిణా
-[మీమాంస 10-3-64, 65]

మనస్సులో జ్ఞానం ఇమిడి ఉంది. ప్రకృతిలో క్రియ, కర్మ, ఆక్షన్. వర్కులు ఇమిడివున్నాయి. కనుక "అశ్వ" శబ్దం క్రియాభావ ప్రతీకగా వేదంలో అర్థం చేసుకోవలెనంటుంది, మీమాంసా దర్శనం. దీని ప్రకారం "అశ్వ" అంటే క్రియాశక్తి అని స్పష్టమైంది. ఋగ్వేదం [1వ మండలం, 163వ సూక్తం] లో దీర్ఘతమసుడు "అశ్వం"పై చెప్పిన 13 మంత్రాలలో అశ్వశక్తిని మన కన్నులకు కట్టినట్లు చిత్రిస్తాడు. "ఎడతెగని చీకటి ఋషి" అదే మండలం 162వ సూక్తంలో "అశ్వం"పై 22 మంత్రాలున్నాయి. వీనిలో "అశ్వం" అంటే "వెలుతురు" అనే అర్థం ఉంది. ఈ మంత్రాలలో అశ్వానికి వాడిన లోకోత్తర విశేషణాలు, ప్రచండ వర్ణనలు, గాడిద కంటే పెద్ద సైజులో వుండే ఒక జంతు విశేషానికి [గుర్రం] అన్వయిస్తాయనుకోవడానికి వీలులేదు.

వైదికాశ్వం భారతీయ తేజస్సుకు ప్రతీక, ఓజస్సుకు ప్రతిబింబం, చైతన్యానికి కేతువు. అట్టి "అశ్వపతి" సావిత్రి తండ్రి.

ద్యుమత్సేనుడు - సత్యవానుని తండ్రి.

ద్యుమత్ శబ్ద చర్చ:

ద్యుమత్ అంటే "వెలుతురు కల్గిన" అని అర్థం. "ద్యుమత్" శబ్దం ఋగ్వేదంలో చాలాచోట్ల వస్తుంది.

1. తముద్యుమః పుర్వణీక [6-10-2]
2. ఉదగ్నే భారత ద్యుమద జస్రేణ [6-16-45]
3. ద్యుమత్ విభాతి భరతేభ్యః [6-11-1]

4. ఆ శ్విత్రే యస్యజంతవోద్యుమత్ వర్ధంత [6-19-8]
5. ద్యుమత్ అగ్నేమహిశ్రవో [5-18-5]
6. ద్యుమత్తమం రయిం దాః [5-24-1]
7. తవ ద్యుమంతో అర్చయో [5-25-8]
8. భారతాగ్నే ద్యుమంత మా భరే [2-7-1]
9. అగ్న ఇ ధీమహి ద్యుమంతం [5-6-4]
10. ద్యుమాం అమిత్ర దంభనః [4-15-4]
11. వైశ్వానర ద్యుమతీం జాతవేదః [7-5-8]
12. సువీరాసః శోశు చంచ ద్యుమంతః [6-1-4]
13. ద్యుమత్సు [10-69-7]

ద్యుమత్ విశేషణాలన్నీ అగ్నిపరంగా ఉన్నాయి. వేదంలో అగ్ని రాత్రి వెలిగే సూర్యుడు అని వుంది. అగ్ని భూసూర్యుడు. ఆకాశంలో వుండే అతడు ద్యోసూర్యుడు. అంటే అగ్ని కూడా సూర్య స్వరూప భేదమే. ద్యుమత్సేనుడు స్వయం కాంతిమంతుడే కాని కాంతిని చూడలేని ఊకు. ఈ ఇమేజరీ వేదంలో వస్తూవుంటుంది. ఉదాహరణ: దీర్ఘతమసుని పేరు సావిత్రి ద్యుమత్సేనునికి జ్యోతిర్దర్శనం చేయించింది.

యముడు - మృత్యుదేవత

యమ శబ్ద చర్చ :

"యమింతు భూతముల నెల్ల యట్లగుట తగున్" [మహా భా.] అని సావిత్రి యమశబ్ద నిర్వచనం చేస్తుంది.

సినిమాలలో అపహాస్యభాజనుడుగ చిత్రించబడిన యముడు సూర్యుని కొడుకు.

సూర్యుడు వివస్వతుడు. యముడు వైవస్వతుడు. ఇప్పుడు మనమున్నది వైవస్వత మన్వంతరం.

సావిత్రి యముని "వివస్వత స్త్వం తనయః ప్రతాపవాం" అని యముని వివస్వంతుని తనయుడు అటుంది.

పార్శీమత గ్రంథమైన "జెండావెస్తా"లో కూడ యము డున్నాడు. అచట ఈయనను "ఇమ" అని పిలుస్తారు. "ఇమ", "వివన్‌హంత్" (వివస్వంత) కొడుకు అని ఉంది. యముడు సూర్యుని సమానంగా తేజస్సు కలవాడు. ఆదిత్య సమ తేజసం అని మహా భారతంలో వర్ణించబడింది. యముడు సూర్యుని కొడుకు అనే భావన తర్వాత వచ్చినట్టిది. వేదంలో యముడంటే సూర్యుడే. "ఈశావాస్యోప నిషత్తు"లో కూడా సూర్యుని ఈలాగు పొగడినాడు ఋషి.

"పూషన్నేకర్షే, యమ, సూర్య, ప్రాజాపత్య వ్యూహరశ్మీన్ సమూహ తేజో యత్తే రూపం కళ్యాణతమం తత్తేపశ్యామి"

—(ఈశావాస్యోపనిషత్తు)

పూషుడు, ఏకఋషి, యముడు, సూర్యుడు, ప్రజాపతి, అందరూ ఒకటిగా చెప్పబడినారు. ఇచ్చట యముడు భయంకరాకారుడు కాడు. తేజోరూపుడు, కల్యాణతమరూపుడు, మహాభారతంలో సావిత్రి భక్తికి మెచ్చిన యముడు ఈలాగుననే కనబడినా డామెకు.

సావిత్రి యముని వెన్నాడుతుందంటే మంత్రం దేవతను వెన్నాడుతున్నదని రూపకల్పన. అది మంత్రప్రచోదిత ధీ యేకాని వేరుకాదు. (మెంటల్ మిసైల్) ఇంతవరకు అశ్వపతి, ద్యుమత్సేనుడు, యముడు అనే పాత్రలు ఎట్లు సూర్యునికి ప్రతిబింబాలో చూచితిమి. ఇప్పుడు అతిముఖ్యమైన సత్యవంతుని పాత్ర గురించి చర్చిస్తాను. సత్యవంతుని పాత్ర పనికిరానిది వీడు శాలీనుడు. హీరో లక్షణాలు లేవు. పల్లెటూళ్ళలో "సతీసావిత్రి" నాటకం వేస్తే, సత్యవంతుని పాత్ర ధరించేందుకు ఎవరూ ముందుకు వస్తూ ఉండేవారు కారనేది స్వానుభవం. (ఎందుకంటే ఆ నాటక పాత్రధారులే డ్రామా ఖర్చు భరించవలసి వుండేది. అటువంటప్పుడు "చచ్చుపాత్ర" అగు సత్య వంతుని వేషం ఎవరు ఒప్పుకొంటారు?) దీనికితోడు సత్యవంతుడు పెట్రకుక్కడు పెనిమిటి అనే అపప్రథ కూడా లేకపోలేదు. ఇటువంటి—

8. సత్యవంతుడు ఎవరు?

—అనే విషయం తెలుసుకొనవలెను.

మహాభారతంలోని సత్యవంతు, వేదంలోని సూర్యుడు ఒకరే అన్న సత్యాన్ని చూపిస్తాను. దీనికి రెండు గ్రంథాలనుండీ సాక్ష్యాలు లభిస్తాయి. సత్యవంతుడు సూర్యుడని నేరుగనూ వయా ఋతంగనూ చూపిస్తాను.

సత్యవంతుడు → ఋతవానుడు → సూర్యుడు.

సావిత్రి సత్యవంతునే ఎంపిక చేసికొన్నది. మహాభారతంలో సత్యవంతుడికి వాడిన విశేషణాలు :

1. తేజస్వి - వివస్వానివ తేజస్వీ (సూర్యునివంటి తేజస్వి)
2. బుద్ధిమాన్ - బృహస్పతి సమో మతి (బృహస్పతివంటి మతి కలవాడు)
3. క్షమవాన్ - వసుధేవ సమన్విత (భూమి అంతటి ఓర్పు కలవాడు)
4. సత్యవాన్ - సత్యవాదీవ శిబిరాశీన రోయధ (శిబి ఔశీనరుల వలె సత్యవాది)
5. ప్రియదర్శనుడు - సోమవత్ప్రియ దర్శనః (చంద్రునివలె బాగా కన్పించువాడు)
6. రూపవంతుడు - రూపేణాన్యతమో శ్విభ్యాం (అశ్వినీ దేవతల వంటి రూపం కలవాడు)

7. సత్యంతో కూడినవాడు - ససత్యః (అశ్వినీ దేవతలకు నాసత్యులు (న + అసత్యులు) అనే పేరు వుంది)

8. మైత్రం కలవాడు - సమైత్రః మిత్రుడు అంటే సూర్యునివంటి వాడని ధ్వని.

9. కాంతివంతుడు - ద్యుతిమాంశ్చసః (తండ్రి ద్యుమత్సేనుని దీప్తి కలవాడు)

సత్యవంతుని విశేషణాలు వెలుతురులు.

సత్యవంతునికి "చిత్రాశ్వుడు" అనే అడ్డపేరుంది. వీనికి చిన్నప్పటినుండీ అశ్వాలంటే ప్రియం. మట్టితో అశ్వాల బొమ్మలు చేసేవాడు. అశ్వాల బొమ్మలు గీచేవాడు. (చిత్రేపి విలిఖతి అశ్వాం శ్చిత్రాశ్వ ఇతి చోచ్యతే)

"చిత్రాశ్వ" పద చర్చ :

సత్యవంతునికి "చిత్రాశ్వ" అని పూరకనే పేరు పెట్టలేదు కవి. ఇది సూర్యుని పేరు సూచించును. సూర్యునికి ఏడు గుర్రాలున్నాయి. అవి చిత్రవర్ణ కిమ్మీరములు - చిత్రాశ్వాలవి. అవి కల సూర్యుడూ చిత్రాశ్వుడే అనవచ్చును.

ఈ చిత్రయొక్క చిత్రాలను చూతము.

చిత్ర :

1. రయిర్న చిత్రా సూరో (1-66-1)
చిత్రమైన సూర్యుడు

2. చిత్రోయదభ్రాట్ (1-66-3)
చిత్రకాంతుల వెలుగువాడు.

3. స్వర్ణభాను నా చిత్రో విభాతి (2-8-4)
బంగారువన్నె కల చిత్రమైన సూర్యునివలె (అగ్నికి)

4. ఆ సూర్యోన భానుమత్...చిత్రోనయత్ (6-4-6)
సూర్యునివలె చిత్రకాంతులు కల (అగ్నికి)

5. శుష్మశ్చిత్రో న సూరః (7-3-6)
సూర్యునివలె చిత్రకాంతులు కల (అగ్నికి)

చిత్రక్షత్ర :

6. సచిత్ర చిత్రం.........చిత్రక్షత్ర చిత్ర తమం (6-6-7)
(అగ్నికి)

చిత్రధ్రజతి :

7. చిత్రధ్రజతి రరతిర్యో (6-3-5)
సూర్యునివలె చిత్రకాంతులు.

చిత్రభాను :

8. సవితా చిత్రభాను (1-35-4)
వివిధ రశ్మియుక్తుడగు సూర్యుడు.

9. అగ్నిశ్చిత్ర భానుః (2-10-2)
చిత్రమైన రంగులు కల అగ్ని

10. చిత్రభాను రుషసాం (7-9-3)
చిత్రమైన వెల్గులుకల ఉషస్సు వంటి

11. చిత్ర భానుం రోదసీ (7-12-1)
ఆకాశంలో చిత్రభానుడు.

12. చిత్రభానుం విభావసుం (8-44-6)
చిత్రకాంతితో వెలుగువాడు.

13. చిత్రభానో సర్వృశం (5-26-2)
(అగ్ని)

చిత్రరథ :

14. సూర్యమాథత్థో దివి చిత్ర్యం రథం (5-63-7)
చిత్రరథుడైన సూర్యుడు. (10-1-5)

చిత్రామఘ :

15. చిత్రామఘా విశ్వమను ప్రభూతా (7-77-3)
చిత్రకాంతులు కల్గిన ఉషస్సు. ఉషస్సుకు చిత్రామఘా అనే పదం నిరుక్తంలో ఇచ్చి ఉంది.

చిత్ర బర్హిష :

16. అఘ్రూషన్! చిత్రబర్హిష

17. పూషా!...చిత్రబర్హిషం
సూర్యుడు (పూషుడు) చిత్రమైన కాంతులు కలవాడు.

18. సూర్యునికి చెప్పిన సూక్తంలో
భద్రా అశ్వాః హరితః సూర్యస్యచిత్రా (1-115-3)
అంటూ సూర్యుని అశ్వాలు భద్రములు, పచ్చవి, చిత్రమైనవని స్పష్టంగా వర్ణించబడింది.

సూర్యుడు చిత్రభానుడు, చిత్రరథుడు, చిత్రబర్హిషుడు, చిత్రాశ్వుడు, ఆ చిత్రాశ్వ నామధేయమే సత్యవంతునికి ఫాస్టిపుల్‌గా అతుకుకొనిపోయింది.

సత్యవంతుడు సత్యం చెప్పుతాడు కావున సత్యవంతుడు అయినాడు. వేదంలోని సూర్యునికీ సత్యానికీ ఏమైనా సంబంధం ఉన్నదా అనే ప్రశ్న.

మహాభారతంలో యక్షుడు ధర్మరాజును ఈ విధంగా ప్రశ్నిస్తాడు :

కిం స్విత్ ఆదిత్యం ఉన్నయతి
కే చే తస్యాభి తశ్చరాః
కశ్చై నమస్తం నయతి
కస్మింశ్చ ప్రతి తిష్ఠతి

దినకరు నెయ్యది నడపును
దినకరు నెవ్వారు గొల్చి తిరుగుదురు అద్దే
పుని య స్తమించు టేమిట
ననఘ తదాధార భూతమది యెయ్యదియో.

—(అరణ్య ప. ఆ 7, ప 422)

దీనికి ధర్మరాజు సమాధానం

బ్రహ్మాదాదిత్య మున్నయతి
దేవా స్త స్యాభితశ్చరాః
ధర్మశ్చా స్తం నయతి చ
సత్యే చ ప్రతి తిష్ఠతి

అనిన ధర్మజుడిట్లను నబ్జహితుని
నడపు బ్రహ్మంబు సురకోటి నడచుకొలిచి
ధర్మ చే న స్తమితుడగు దపనుడమ్మ
హాత్మునకు సత్యమాధార మండ్రు బుధులు.

—(అరణ్య ప, ఆ 7, ప 423)

ఇచ్చట సత్య-ప్రతి తిష్ఠతి అనే పదాలు ముఖ్యం.

సూర్యుడు సత్యంచేత ప్రతిష్ఠింపబడినాడని అర్థం.

అథర్వణ వేదంలో ఇట్లుండి :

"ఋతే నాదిత్యా స్తిష్ఠంతి"

—(అథర్వ వే, కాం 14, అనువాక 1, మంత్ర 1)

మహాభారతమూ, అథర్వవేదము ఒకటే చెప్పుతున్నాయి.

"ఋతం" అనే పదం తారసిల్లింది. దీని అర్థం తెలుసుకోవడం అంటే వేదరహస్యం తెలుసుకోవడమే.

## 9. "ఋతం" అంటే ఏమి?

ఒక్కసారి విశ్వాన్ని కలయజూస్తే, చిత్రంగా ఉంటుంది. సూర్య చంద్ర, నక్షత్రాలు గతితప్పక నడుస్తున్నాయి. రాత్రింబవళ్ళు, ఋతువులు క్రమం తప్పక వస్తాయి. పోతాయి. జీవ రాసులు పుట్టుట, పెరుగుట, మడియుట నిరంతరంగా సాగిపోతు న్నది. ఈ క్రమానికి, ఈ నియతికి ఈ గతితప్పని కర్మలకు కారణ మేమయియుండును అనే యోచన మనిషికి అనాదికాలంనుండే కలుగుతూ వస్తూవుంది. దేవుడు దీనికి కారకుడనడం ఒక సమాధానం. ఇది ఆస్తికుల మతం. లేదు, నీటిలో చల్లదనం ఉండడానికీ, అగ్నిలో వేడిమి ఉండడానికీ వారి సహజగుణమే కారణం అని చార్వాకులు (చూ: సర్వదర్శన సంగ్రహం) ప్రకృతిలో జరిగే అద్భుతాలని ఏకరువు పెట్టుతూ దీన్నంతా ఎవరు చేస్తారో తెలుసా అని దట్టించి అడుగుతాడు దేవుడు. "జాబ్"ను (చూ: బైబిల్ పురాతన ప్రకరణం) ఈ విశ్వగతికి కారకుడు కాకుండిన ఎడల, అది అంతఃస్వచోదిత చైతన్య నియతి కావలసి వస్తుంది. దేవుడు కారకుడయినా ఆయన ఒకసారి చేతనా నియమావళిని నిర్ణయించి పరమవ్యోమంలో చూపరి-ఓవర్‌సీయరు-(అధ్యక్షుడు - చూ: నాసదీయ సూక్తం)గా మాత్రమే ఉంటాడు. అప్పుడు కూడా విశ్వగతి సూత్రాల స్వరూప స్వభావా లెట్టివి అనే ప్రశ్న మిగులుతుంది.

ఈ విశ్వగతి సూత్రాల గురించి ప్రాచీన కాలంలోనే తాత్వికులు ఆలోచించినారు.

గ్రీకులు, క్రైస్తవులు, జోరాస్టరు, చైనీయులు, వేదర్షుల ప్రతిపాదనలు క్లుప్తంగా చెప్పుతాను.

| | |
|---|---|
| గ్రీకుల, క్రైస్తవుల | "లోగోస్" |
| చైనీయుల | "టావో" |
| జోరాస్టరు | "అష" |
| వేదర్షుల | "ఋతం" |

ప్రాచీన గ్రీకు తాత్వికులు ("స్టోయిక్కు"లు) ప్రకారం "లోగోస్" విశ్వంలో దాగియుండే క్రియాశక్తి.

క్రైస్తవాచార్యుల (సైంట్‌జాను) ప్రకారం "లోగోస్" అంటే వాక్కు. ఈ వాక్కు భగవంతునిలో ఉండేది. భగవంతుని కన్న ముందుండినది.

భగవంతునికి, మనిషికి మధ్య కల వారధి "లోగోస్".

చీనా తాత్వికుడు లావోట్జు (క్రీ.పూ. 600 సం॥) "టావో" సిద్ధాంతం చేసినాడు. "టావో" అంటే చీనా భాషలో "మార్గము", "బాట", అని యర్థం. ఇది "సత్యమార్గం", "దైవమార్గం", మనిషే కాక సృష్టి అంతా "టావో"ను అనుసరించును. ఇది సరియైన మార్గం, విశ్వక్రమం.

గ్రీకు పురాణాలలోని దేవలోక రాణి "ఐసిస్" భూమిని, ఆకాశాన్ని వేరు చేసింది. సూర్యచంద్ర నక్షత్రాలకు మార్గం చూపింది. ఈజిప్టు స్త్రీ దేవత "మాట్" సత్యస్వరూపిణి. వేదం లోని "ఉషస్సు"కు సూనృతావరి, సూనృతాపతి, అంటే సత్యస్వరూపిణి అని అర్థం. "మాట్", "ర", లేక "రి" అనే సృష్టి కర్త, విశ్వనియతి ప్రదాత కూతురు. "ర" లేక "రి" అంటే ఈజిప్టు భాషలో సూర్యుడని అర్థం. ర, రి - మాట్‌ల సంబంధం సూర్య-ఉషస్సుల సంబంధం. జర్మన్ శాస్త్రవేత్త లీబ్నిజ్ (క్రీ.శ. 18వ శతా) ప్రకారం ప్రకృతిలో "హార్మొనియా ప్రా ఎస్టాబిలిటా" అంటే ప్రాస్థాపిత సమరసత కలదు.

వేదంలో వచ్చే "ఋతం" ప్రాచీన పారశీక ఋషియైన జర థుష్ట్ర (జరఠోష్ట్ర అంటే ముసలి ఒంటెమీది వాడు) చెప్పిన "జెంద వెస్తా"లో (ఛందో ఒవస్థా) ప్రతిపాదిత "అష" గురించి ఎక్కువ తెలిసికొందాము. ఈ రెండు శబ్దాలు సజాతీయ, ఏకమూలకాలు, సమానార్థకాలు కూడ.

ఋతం అనే పదం "ఋ"నుండి పుట్టింది. (పూర్వ) మీమాంస ప్రకారం "ఋ" అంటే కదలుట, చేరుట, ఇచ్చుట. పిల్లవాడు వేగంగా పోవుటను ధ్వన్యనుకరణం చేయుటకు "ర్ర్ర్ర్ర్ర్ర్ర్ర్ర్" అని పోతాను అంటాడు. ఈ "ర్" ధ్వనియే ఋత శబ్దానికి మూలం. ఋతం అంటే కదిలేది, కదిలించేది, నడచేది, నడిపించేది, ఇచ్చేది, ఇప్పించేది. అందుకే సాయనుడు ఋత శబ్దానికి నీరు, సత్యం, యజ్ఞం అని మూడు విధాలుగా వ్యాఖ్యానం ఇచ్చినాడు.

సచరాచర విశ్వాన్ని క్రమం తప్పకుండా నడిపించే సూత్రం, డిజైను ఋతం. కదిలితే ఋతం. ఊరకుంటే సత్యం. సృష్టిగతి ఋతంమీదా, సృష్టిస్థితి సత్యంమీదా ఆధారపడి వున్నాయి. ఋతం గతిశక్తి, సత్యం స్థితిశక్తి. ఋతంలోనే సత్యం ఇమిడివుంది, కాబట్టి ఋతాన్ని, నియతి + సత్యం అనవచ్చును.

ఋతంను అంతఃప్రచోదిత విశ్వచేతనా ధర్మం అని నిర్వచించవచ్చును.

లేదా విశ్వవ్యాప్త సత్యానుశాసనం అని చెప్పవచ్చు (యూనివర్సల్ ట్రూత్ అండ్ ఆర్డర్)

సాధారణంగా ఋత సత్యశబ్దాలు పర్యాయపదాలుగా ఉన్నాయి.

1. సత్యం బృహత్ ఋతం (అథర్వవేదం కాం 12, సూ.1 మం 1)
2. సత్యమేవ జయతే నానృతం (ముండకోపనిషత్తు)
3. ఋతం వోచా (4-5-11)
4. అనృతా, అసత్యా (4-5-5)
5. ఋత జాత సత్యా (4-51-7)
6. ఋతం చ సత్యం చాభిదా త్తపసో అధ్యజాయద (10-190-1)
7. సత్యం త్వా ర్తేన, ఋత్వంతా సత్యేన పరిషించామి (సంప్రదాయం)
8. ప్రజాపతిః ప్రథమజా ఋతస్య (తైత్తిరీయారణ్యకం 1-23-9)

## 10. ఋతవాన్ - అషవాన్

జనన మరణాలు, రాత్రింబవళ్ళు, సూర్యచంద్ర నక్షత్రాల గమనం, ఋతువుల క్రమం తప్పక అనంతంగా సాగిపోతూ ఉండడానికి ఏదో చోదకశక్తి ఉంటుంది. ఆ శక్తియే "అష" అని ప్రవచించినాడు జరథుష్ట్రుడు. జగద్రక్షకుడగు అహురామజదాకు జగత్పాలనకు తోడ్పడే ఆరుగురు దేవతలున్నారు. వారి పేర్లు, విధులు, జెండ్-సంస్కృత భాషలలో ఇస్తున్నాను.

| జెండ్ భాష | సంస్కృత భాష | పార్శీదేవతల విధులు[10] |
|---|---|---|
| 1. అష | ఋత | సత్యధర్మరక్షణ |
| 2. ఖషత్ర | క్షత్ర | అధికారం |
| 3. వోహుమనో | వసుమనస్ | స్వచ్ఛమనస్సు |
| 4. అమెరితాత్ | అమృతత | అమర్త్యత్వం |
| 5. అరమైతి | అరమతి | మంచిమతి |
| 6. హౌర్వతత్ | సర్వతాతి | పూర్ణత్వం |

అషను కల్గినవాడు అషను రక్షించేవాడు "అషవాన్" అయినాడు. అవెస్తాలో "అషవాన్" సత్యధర్మాధి దేవత.

జెండావెస్తాలోని "అషవాన్" వేదంలో "ఋతవాన్" లేక "ఋతావాన్".

మనకు కావలసినదేమంటే "ఋత" శబ్దం "అష" ఎట్లాయింది? అనేది. దానిని భాషాశాస్త్ర, మీమాంసారీత్యా వివరిస్తాను.

"ఋ" శబ్దం "అర" శబ్దానికి కుదింపు. "ఋ"ను వేరుగా పల్కడం కష్టమే. ఏబదేండ్ల క్రిందవరకూ పల్లెటూరి వీధిబడులలో ఓనమాలు పల్కడం నేర్పేటప్పుడు "ఋ"ను "అర"గా పల్కించే వారయ్యావారలు. తమిళభాషలో "ర"తో ప్రారంభమయ్యే పదాల ముందు "అ" చేర్చి పల్కుతారు. "రంగం"ను "అరంగం" అని పల్కుతారు. అటులనే వైదికభాషలో "ఋత" అనేది "అర్త" అవుతుంది. ఈ సామ్యమే అరవభాష వైదిక ప్రాకృతభవం అనే అర్. స్వామినాథ అయ్యరు, డా॥ చిలుకూరి నారాయణరావు సిద్ధాంతానికి బలం కూర్చుతుంది. మీమాంసలోని ఈ సూత్రం చూడండి:

"బ్రాహ్మణానాం వేతరయో ఆర్త్విజ్యా భావాత్"

—మీమాంస 6-6-18

"ఋత్విజుని" విధి "ఆర్త్విజ్యము" అని అర్థం. "ఋత్", "అర్త్" అయినది. అంటే "ఋ", "అర్" అయింది.

ఇప్పుడు "ఋతావాన్" పదం "అర్తావాన్" అగుటకు భాషాశాస్త్రరీత్యా అవకాశం కలదు. సంస్కృతంలోని "ర్త" శబ్దం, జెండ్‌లో "ష"గా మారుతుంది. కొన్ని ఉదాహరణలు:

| సంస్కృతం | |
|---|---|
| మర్త్య | మష్య |
| మృత | మెష |
| భ్రాతర | భాషర్ |
| ప్రీతన | పేషన |
| ఋత-అర్త | అష |

"ఋషి" శబ్దానికి విశేషణం 'ఆర్ష' అని వస్తుంది. "ఆర్ష", "అష" కావడం సాధ్యం. 'ర' "అర" కావడానికి ఆర్ష అష కావడానికి ఇది నిదర్శనం.

"అవెస్తా"లో "అహుర కు "అషాహేఖావో" అని ఉంది. దీనికి వేదంలో "ఖాం ఋతస్య" అని ఉంది. (2-28-5). రెండూ శబ్దార్థరీత్యా ఒక్కటే. మిత్రావరుణుల మీది ఇంకొక మంత్రంలో "అసురస్యమాయయా" (5-63-7) అనే సమాసం వస్తుంది. "అసురమాయ", "అహురమజదా" వలెనే ఉండుట చూడండి. వేదంలో "అసుర" శబ్దం దేవత అనే అర్థం ఇస్తుంది.[11] వేద "అసుర", అవెస్తా "అహుర" అయినది. తర్వాతికాలంలో "అసుర"

శబ్దం "అ-సుర" అంటే సురలు కానివారు అనే అర్థం తెచ్చుకొంది. ఇప్పటి "అసుర"డు రాక్షసుడు, అప్పటి అసురుడు దేవుడు. కావుననే రాక్షసులను పూర్వదేవతలు అంటారు. జెండవెస్తాలో "దేవ" అంటే "దయ్యం" అని అర్థం. జెండవెస్తాలో, కొన్ని మినహా యింపులతో – వేదంలో ఉండే దేవతలందరూ రాక్షసులుగా చిత్రించ బడినారు. టిట్ ఫర్ టాట్ అంటే ఇదే ఏమో!

అషవాన్ అంటే ఋతవాన్ అనేది తేలింది. ఋతం అంటే సత్యం అని ఇంతకుముందే తెలుసుకొంటిమి.

కావున—

ఋతావాన్ అంటే సత్యవాన్ అని పిల్చుటకు ఏమీ అభ్యంతరం ఉండరాదు.

మహాభారతంలోనివానికి "సత్యవాన్' అని పేరు. "సత్యవాన్" "ఋతవాన్" అని తీర్మానించుదాం.

ఋతావాన్ అంటే సూర్యుడు అని సాక్ష్యం ఎక్కడుంది? వేదంలో ఉంది. చూడండి:

ఋతావాన మాదిత్యం చర్షణీ ధృతం (4-1-2)

ఆదిత్యుడంటే సూర్యుడు, ఋతావనుడు అని అర్థం. ఋతం అన్నిదేవతలకీ వర్తిస్తుంది కనుక వేదంలో ఋతవిలాసంను దర్శించుదాము.

మిత్రావరుణులు

ఋతావానాయజసే పూత దక్షసా (8-25-1)

ఋతావానావృత (8-25-4)

ఋతావానం ఋతాయవో యజ్ఞస్య [8-23-9]

మిత్రం న జనే సుధితం ఋతావని [8-23-8]

ఋతావాన్ అనే మాటకివి ఉదాహరణాలు.

సూర్యునికీ సత్యానికీ గల సంబంధం.

అధర్వవేదము, ధర్మరాజు సూర్యుణ్ణి సత్యం ప్రతిష్ఠిస్తుంది అనడం చూచినాము. సావిత్రి యమునితో "సంతోహి సత్యేన నయంతి సూర్యం" (సంతులు సూర్యుని సత్యంచేత నడిపిస్తారు) అంటుంది.

ఋత ప్రచోదితమైన సూర్యుని మార్గం ఉంది.

1. ఋతేన దేవః సవితా సమాయత
ఋతస్య శృంగ ముర్వియా విపప్రధే [8-86-15]

సవిత [సూర్యుడు] ఋతమార్గాన పోతాడు. ఋతామార్గం గొప్పది.

2. అనోదధిక్రాః పథ్యా మనక్త్వృతస్య పంథా [7-44-4]

అశ్వినీ దేవతలారా, మీ రశ్వయుక్త సూర్యమార్గము నిచ్చుంటి శోభదేలి...

3. అపర్మగాతు దురవే వరీయసి పంథా ఋతస్య సమయంస్త
రశ్మిభిర్ చక్షుర్ భగస్య రశ్మిభిః [1-136-2]

సూర్యుడు ఉదయించినప్పుడు ఋతపంథ రశ్మిచే ఆవరింపబడును.

4. అభూత పారమేతమే పంథాఋతస్య సాధుయా అదర్శి
విస్రుతిర్దివః [1-4-11]

ముదమున భాస్కర దేవుం డుదయాద్రికి బోవుదారి యుపయుక్త మగున్.

5. యేతే పంథాః సవితః......
తేభిర్నో అద్య పథిభిః సుగేభిః [1-35-11]

ఇచట "పంథా సవితః", "అద్య పథిభిః" పదాలు సూర్యుని మార్గాన్ని చెప్పుతాయి.

6. వరుణుడు సూర్యునికి మార్గం చూపిస్తాడు. ఈ వరుణు డెవ్వరు? ఉషస్సు, సూర్యుడుగ, మిత్రునిగ, పూషునిగ మారుతుంది. అస్తమించిన సూర్యుడే వరుణుడని సాయణ భాష్యం. (అస్తం గచ్ఛన్ సూర్య ఏవ వరుణ ఇత్యుచ్యతే) అట్టి వరుణుడు "రదత్ పథో వరుణః సూర్యాయ" [7-87-1] ఇట్టిదే ఇంకొక ఉదాహరణ:

ఉరుం హిరాజా వరుణశ్చకార
సూర్యాయ పంథా మన్వేత వాఉ [1-24-8]

పంథా ఋతస్య, ఋతస్య పంథా, సవితా పంథా, సూర్య పంథ, పథిభి సుగేభి, ఇవన్నీ సూర్యుని మార్గాన్ని తెల్పు పదాలు. ఈ సూర్యుడు (సూర్య సవితృడు) సత్య స్వరూపుడు. "సత్యసవం సవితారం" [5-82-7] భగసవితృడు సత్యధనుడు "భగప్రణేతః భగసత్యరాధో" [7-41-3]

ఇవన్నీ ఎందుకిచ్చినానంటే, సావిత్ర్యుపాఖ్యానంలో అశ్వపతి కూతురు సావిత్రి కిట్లు చెప్పుతాడు: "అప్రమాదశ్చ కర్తవ్యః పుత్రి! సత్యవతః పథి" అని, "సత్యవతుని పథంలో ప్రమాదం లేకుండా పోవుట నీ కర్తవ్యం బిడ్డా!" అని అర్థం. "సత్యవతః పథి" అనే ఈ మహనీయ సమాసం వేదప్రతిధ్వని అని చెప్పుటకే సూర్యపంథలో, ఋతపథంలో, ఇంతగా నేను పయనించవలసి వచ్చె.

తన మార్గాన్ని తానే తప్పలేదు సూర్యుడు :

"దిశః సూర్యో నమినాతి ప్రదిషా దివే దివే హర్యశ్వ
ప్రసూతాః [3-30-12]

ఋతస్య యోషా నమినాతి ధామా [1-123-9]

ఋతస్య పంథా మన్వేతి సాధు [1-124-3]

ప్రాచీన గ్రీకు తాత్వికుడు హీరాక్లిటసు (క్రీ.పూ. 400 సం॥ సూర్యుడు కూడా హద్దుమీరి నడువజాలడు అన్నాడు. ఇది పైన చెప్పినట్లు వేదంలోనిదే. గ్రీకులకు పైథాగరస్ ద్వారా భారతీయ తత్వమబ్బినది.

ఋతం సృష్టికంతా వర్తిస్తుంది : కొన్ని ఉదాహరణలు :

నదులు – ఋతం

1. ఋతం సింధవో వరుణస్యయంతి [2-28-4]

2. ఋత మర్షంతి సింధవః సత్యంతాతాన [1-105-12]

ఉషస్సు – ఋతం

1. ఋతావరీ దివో అర్కై ర్బోధ్యా [3-61-6]

2. ఋతస్య బుధ్న ఉషసామిషణ్యన్ [3-6-7]

3. సుజాతే అశ్వసూనృతే [5-79-1, 10]

నిరుక్తంలో ఉషస్సుకు విభావరి, సూనరి, భాస్వతి, సుమ్నావరి, సూనృత, సూనృతాపతి, సూనృతావరి, అనే పేర్లున్నాయి. ఉషస్సుకు గోమతి, ఋతావరి, అశ్వావతి, వీరవతి అనే పేర్లూ కలవు. విశ్వమాత అదితికీ ఋతావరి అనే పేరు కలదు. [8-25-3]

సరమ – ఋతం

సరమ దేవశౌని

1. ఋతం యతీ సరమా అవిందద్ విశ్వాని సత్యాం [5-45-7]

2. ఋతస్య పథా సరమా నిదద్గాః [5-45-8]

మిత్రావరుణులు – ఋతం

1. ఋతస్య మిత్రావరుణా పథా [7-65-3]

ఇదే మంత్రంలో మిత్రావరుణులు "అనృతస్య సేతు"వులు (అసత్యాన్ని దాటుటకు వంతెనలనీ), నావా దురితా తరేషు" (పాపములను తరించే ఓడలనీ) ఉంది.

2. విశ్వఋతేన మిత్రావరుణా సచేథే [1-151-1]

3. ఋతేన మిత్రావరుణా వృతా వృధా వృత స్పృశా క్రతుం బృహంతం [1-2-8]

సరస్వతి – ఋతం

1. చోదయిత్రీ సూనృతానాం చేతంతి సుమతీనాం యజ్ఞంధథే సరస్వతీ [1-3-11]

ఇంద్రుడు – ఋతం

స్వర్ణరా దవసే నో మరుత్వాన్
పరావతో వాసదనాద్ ఋతస్య [4-21-3]

వామదేవుడు సూర్యునికి చెప్పిన సూక్తం ఇస్తాను, ఇందు ఋతం సర్వాంతర్యామి, విశ్వవ్యాపి, సచరాచర సృష్టిమూలం అనే భావం కలదు.

హంసః శుచిషద్ వసురంతరిక్షి సద్ధోతా
వేదిషదతి థిర్దు రోణసత్
నృషద్ వరసద్ ఋతసద్ వ్యోమసద్
అబ్జా ఋతజా అద్రిజా ఋతం [4-40-5]

వేదమంతా ఋతంభరమైనట్లు సృష్టి అంతా ఋతం భరం. ఋతం బైబిలులోని "ఛారిటీ" (1 కొరింథియనులు 13) అనే తత్వంవంటిది. వామదేవుడే "ఋతం"పైని చెప్పిన ఈ ఋక్కుతో ఋతచర్చ ముగిస్తాను.

ఋతస్య హి శురుధః సంతి పూర్వీ
ర్మృతస్య ధీతి ర్వృజినాని హంతి
ఋతస్య శ్లోకోబధిరా తతర్దకర్ణా
బుధానః శుచమాన ఆయోః

ఋతస్య దృళ్హా ధరుణాని సంతి పురూణి చంద్రా వపుషే వపూంషి
ఋతేన దీర్ఘమిషనంత పక్షఋతేనగావ ఋతమా వివేశుః
ఋతం యేమాన ఋతమిద్ వనోతి ఋతస్య శుష్మ స్తురయా ఉగవ్యుః
ఋతాయ పృథ్వీ బహులే గభీరే ఋతాయధేనూ పరమే దుహాతే
[4-23-8, 9, 10]

ఋతం అనే పదం వేదంలో చిత్రవిచిత్ర విశేషణాలతో కన్పిస్తుంది.

వేదంలో ఏది చెప్పినా తుదకు ఋతమే పరమావధిగ కినబడుతుంది. ఏ దేవతను పొగడినా, వాడు ఋతాపానుడో, ఋతమార్గానుగామియో, ఋత రక్షకుడో [అగ్నిగోపాం ఋతస్య అట 1-1-8] అయివుంటాడు. చరాచర సృష్టి అంతా ఋతసూత్ర బంధితం.

ఋత రూపాలు

ఋతస్యధామా / సదనం ఋతస్య – ఋతం యొక్క గృహం
ఋతస్య ధారా – సత్యప్రవాహం
ఋతస్య ప్రేష – సత్యము వలని ప్రేరణ
ఋత స్పర్శ – సత్యముతో తాకిడి
ఋతం వృధా – సత్యము వృద్ధి
ఋతస్య బుధ్నా – సత్యమనెడి బునాది
ఋతస్య ధీతిః – సత్యకాంతి (బుద్ధి)
ఋతం జ్యోతి – సత్యమనే దీపం
ఋతస్యపంథా / పంథా ఋతస్య – సత్యమార్గం
ఋత జాతసత్య – ఋతంనుండి పుట్టిన సత్యం
ఋతస్య రథ్య – ఋతమనే రథం
ఋతం బృహత్ – పెద్ద సత్యం
ఋత చిత్ – సత్యమనస్సు [సూర్యకాంతి అనిగూఢ]

సత్యవంతుడు చనిపోయినాడు. ఈ సంఘటనలోని ప్రతిబింబానికి వేదమూలం ఇది:

సత్యం తదింద్రో దశభిః దశగ్వైః
సూర్యం వివేద తమసి క్షియంతం (3-39-5)

దేశగువ్వలతో కూడి ఇంద్రుడు సత్యసూర్యుడు చీకటిలో దాగికొని ఉండుటను చూచెను.

సత్యసూర్యుడు చీకటిలో దాగికొనినట్లు సత్యవానుడు దీర్ఘాంధకారంలో మునిగి(చని)పోయెను. సత్యవంతుడు తిరిగి బ్రతికిన తర్వాత సావిత్రితో చెప్తాడు: నాకేదో గొప్ప చీకటి కన్పడెను (తతోపశ్యం తమోఘోరం). సత్యవంతుని తాత్కాలిక మరణంలోని ప్రతీక ఇది. మహాభారతంలో యముడు వచ్చి, పడి పోయిన సత్యవంతుని ప్రక్కన నిలబడెనని కలదు, (స్థితంస త్యవతః పార్శ్వే).సవితృని ప్రక్కన యముడు! ఈ ఇమేజరీకి వేదం మూలం

తిస్రోద్యావః సవితర్ద్వా ఉపస్థా ఏకా
యమస్య భువనే విరాషాట్ (1-35-6)

సవితృని మూడు ద్యావాలోకాలూ యముని ఏకైక భువనమూ ఒకే చోట ఉన్నట్లు వర్ణించబడినాయి.

ఈశోపనిషత్తులో యమ, సూర్య పదాలు ఒకదాని ప్రక్కన ఒకటి ఉన్నాయి (చూ. ఈశోపనిషత్తు, మంత్రం 16). ఈ మంత్రం ఈ వ్యాసంలో ఇంతకుముందే ఇచ్చినాను. ఈ భావాన్నే సావిత్రి కథలో పాత్రల మూలకంగా ఉంది.

వేదర్షులు ఋతం, అమృతం అనే రెండు ప్రాతిపదికలమీద తమ ఋక్కులు చెప్పినారు. అమృతస్య పుత్ర, అమృతస్య నాభి, అమృతత్వాయ అనే పదాలు వేదంలో మళ్ళీ మళ్ళీ వస్తుంటాయి. "అమృత" శబ్దాన్ని "ఋతం" నుండి రాబట్టవచ్చును.

అం + ఋతం = అమృతం

ఋతానికి అమృతానికీ గల దగ్గర సంబంధం ఈ మంత్రంలో కలదు:

ఋతేన దేవీ అమృతా అమృక్తా (4-3-12)

సావిత్రి సత్యవంతుని బ్రతికించింది (అమృతత్వం)ఋతం వలననే, గాయత్రీ మంత్రంలో వెలుగును ఉపాసించడమూ, ఆ వెలుగు ధీశక్తిని ఒక నిర్దిష్ట మార్గంలో ప్రచోదించడమూ కలదు.

సరస్వతీ మంత్రంలో కూడా ఇదే పరిభాష కలదు:
చోదయిత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనాం
యజ్ఞదధే సరస్వతీ
మహో అర్ణః సరస్వతీ చేతయంతి కేతునా
ధియో విశ్వా విరాజయతి (1-3-10, 11, 12)

ఇచటా "చోద", "ధియో" శబ్దాలున్నాయి. ఇదీ గాయత్రిపలె (సవితృ మంత్రం సావిత్రి) ధీ ప్రచోదక మంత్రం.

వెలుతురు, సత్యము, అనేవి సర్వదేశాలలోని తాత్వికులకు ఇష్టాలు :

"నీవే నీ దీపము కమ్ము" అని సిద్ధార్థుని బోధ. ఏసుక్రీస్తు "స్పిరిట్ ఆఫ్ ట్రూత్" (జాన్ 16-13) అంటాడు. మహమ్మదు ప్రవక్తకు దివ్య సందేశం లభించింది. "జబల్-అన్-నూర్" అనే కొండలోని "హీరా" అనే గుహలోన, "జబల్-అన్-నూర్" అంటే కాంతిపర్వతం అని అర్థం. "హీరా" అంటే అన్వేషణ అని అర్థం. ఇందలి సింబాలిజం స్పష్టం.

మరణశయ్యమీద గేటే "వెలుతురు, ఇంకా వెలుతురు" అన్నాడట.

న్యూమను "కరుణాళుకాంతీ దారి చూపుము" అన్నాడు.

"నీ వాక్కు నా పదములకు దీపము", నా పథమునకు కాంతి" అని బైబిలు సామం (119-105)

ఈ జ్యోతి ఎట్టిది? ఇది గూఢంజ్యోతి, ఋతం జ్యోతి.

వామదేవుడు అగ్నితో నేను చెప్పేవన్నీ రహస్యాలు (నిణ్యా వచాంసి 4-3-16) అంటాడు. దీర్ఘతమసుడు "నిణ్య సంనద్ధో మనసా చరామి" (1-164-37), అంతా రహస్యం అంటాడు. ఎందుకి రహస్యం? ఏసుక్రీస్తు పిట్టకథలలో (పారబుల్) తన బోధనలు జన సామాన్యులకు చెప్పినాడనేది అందరికీ తెలిసిందే. తన బోధనల రహస్యాన్ని పరిరక్షించేందుకే అట్లు చెప్పినాడని బైబిల్ విదులంటారు. తన బోధనల రహస్యాన్ని 12గురు శిష్యులకే ఆవిష్కరించినాడందురు. వేదర్షులు, అగ్ని, ఆవు, గుర్రం, గాలి, నీరు, మేఘం, సూర్యుడు మొదలైన సులభ సంకేతాలను వాడుకొని సత్యాన్వేషణ పద్ధతులను ప్రతిపాదించినారు. ఇంగ్లీషు భాషలో జార్జి హెర్బర్టు అనే తాత్విక కవి (క్రీ.శ. 16-17 శతా) ఈ సంవిధానాన్ననుసరించినాడు. నేడు మనం రిసెర్చికి ఉపయోగించే "గవేషణ" పదం వేదర్షులకే చెల్లు.

గవేషణ = గోవులను వెదకుట = కాంతిని కోరుట = జ్ఞానార్జన ఆస :

ఇప్పటి శాస్త్రజ్ఞులు హంబోల్డ్ట్, ఐన్‌స్టీను, వైట్‌హెడ్, జాక్వె మొనాడ్ వేదర్షులకు దగ్గరగా వస్తారు. నేటి శాస్త్రజ్ఞులవలెనే వేదర్షులు తెరచిన మనస్సు కలవారు. ధీ, మనస్సు, ధిషణా, మనీష అనే పదాలు వేదంలో మళ్ళీ మళ్ళీ వస్తుంటాయి. సూర్యుణ్ణి గురించి అంత చెప్పి తుదకు "కే ఇదానీం సూర్యః కశ్చికేత కత మాం ద్యాం రశ్మి రస్యతతాన" అంటాడు వేదర్షి. సూర్యుడెక్కడ ఉన్నాడు? ఎవరికి తెలుసు మాకు చూపించడానికి? ఏ లోకాలని రశ్ములతో వెలిగించి నాడు? (1-35-7) అని ప్రశ్నిస్తాడు. వేదర్షులకు ప్రశ్నలు వేయడం బాగా వచ్చును. ఆ ప్రశ్నలలోనే ఉత్తరాలను సూచించే విధం కూడా వారికి తెలుసును. సత్యాన్వేషణ మార్గాన్ని చూపిస్తారు. సత్యమంటే మాత్రం ఏమో చెప్పరు. అది మనమే కనుగొనవలసినదే. రిసెర్చ్ మెథడాలజీ అంటే ఇదే కదా? ఋగ్వేదంలోని సృష్టి సూక్తం (నాసదీయ సూక్తం ఎల్ 10-129)లో వేదర్షి సృష్టి అంటే టూకీగా చెప్పి తర్వాత తానే ప్రశ్నపరంపరను కురిపిస్తాడు.

ఎవరికి తెలుసు ఈ రహస్యం?
ఈ విసృష్టి ఎట్లు వచ్చిందని?
దేవతలే తర్వాత వచ్చిరి కదా?
ఎక్కడో ఆకాశమూలంలో ఉండే ఆ
అధ్యక్షునికి తెలియునేమో!
లేక ఆయనకి తెలియదేమో!

భారతీయ తత్వ బీజాలన్నీ ఈ ఋక్కులో ఉన్నాయంటారు ఆధునిక వేదార్థవిదులు.

సావిత్రీ మంత్రంలో ఉండే ప్రతీక, బింబాలను, సావిత్ర్యు పాఖ్యానంలో పాత్రీకరణ ప్రతిబింబాలుగా చూడవచ్చును.

## 11. ఏకం సత్

"దేవుడు" అనేది ఒక నిగమనం. ఒక భావన. ఒక ప్రతిపాదన. ఒక అనుభవం. కానీ సత్యమా? ఏ దేవుడైనా కనబడినాడా? మనకు కనబడేది ఒకడే. భౌతికంగా వాడు సూర్యుడు. ప్రత్యక్ష బ్రహ్మ. రామాయణంలో క్లిష్ట పరిస్థితిలో ఉండే శ్రీరామునికి "ఆదిత్య హృదయం" ధ్యేయమైంది. శ్రీరాము డుపాసించిన ఆదిత్య హృదయంలో సూర్యుడికి భువనేశ్వర, ఆదిత్య, సవిత, భగ, ఖగ, పూష, గభస్తి, స్వర్ణరేత, సహస్రార్చి, జయభద్ర, సర్వభక్ష, విశ్వకర్మ, లోకసాక్షి, విఘ్నఘ్న, తమోఘ్న, జగత్పతి అనే పేర్లున్నాయి. "ఏకం స ద్విప్రాః బహుధా వదంతి" అంటుంది వేదం. "ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః, మహేంద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాంపతిః" అంటుంది రామాయణం లోని ఆదిత్య హృదయం. ఇదీ వేద ప్రతిధ్వనే. దేవలోకంనుంచి విసరివేయబడి నరకంలో ఉండే సేటనుకు జాజ్వల్యమానంగా వెలిగే సూర్యుడు కనిపిస్తాడు. దానికి సేటను మండిపడి సూర్యుని చెడా మడా తిట్టుతాడు. మిల్టను "స్వర్గచ్యుతి" నుండి తెలుగనువాదం ఇస్తున్నాను.

"కీర్తికిరీటుడవై నీ ద్యులోకంనుండి చూస్తున్నావా ఓ సూర్యా, నీ కిరణాలను ద్వేషిస్తాను. ఎందుకంటే ఇవి నా పూర్వపు ఔన్నత్యాన్నీ, నీకంటే ఎక్కువ పదవిని జ్ఞప్తికి తెస్తున్నాయి." ఇది వ్యాజనిందయో, స్తుతియో చెప్పలేము. సూర్యుని కిరణాలు దర్శించగనే సేటను మనస్సులో ఉన్నతభావాలు చెలరేగినాయి. "భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్" అంటే ఇదే. అందుకే వేదర్షి గట్టిగా ప్రకటిస్తాడు. "వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్య వర్ణం" మహాపురుషుని తెలిసికొంటిని. ఆయన ఆదిత్యవర్ణుడు అని. విముక్తికి "నాన్యః పంథా విద్యతే" వేరే మార్గం తెలియదు, ఈ నాన్యః పంథాయే సూర్యపంథ, వేదంలోని పంథా ఋతస్య. సావిత్రీ కథలో సత్యవతః పథ.

## 12. వేదసావిత్రి - భారత సావిత్రి

"యద్గాయత్రే అధి గాయత్ర మాహితం" (1-164-23)

గాయత్రీ మంత్రం సత్యమంత్రం. తత్ సత్యమంత్రం (7-76-4). వేదసావిత్రి మంత్రమయితే, భారతసావిత్రి శ్లోకం(లు). వేదసావిత్రి "వాక్" అయితే భారత సావిత్రి వాక్యగత కావ్యం. వేద సావిత్రి సూత్రమయితే భారత సావిత్రి భాష్యం. వేదసావిత్రి సమీకరణమైతే భారత సావిత్రి ప్రయోగం. వేదసావిత్రి చిత్రపటమైతే భారతసావిత్రి రూపకం. వేదసావిత్రి ద్యులోకంలో ఋతావనుని పంథాలో పయనిస్తే భారత సావిత్రి భూలోకంలో సత్యవతుని పథంలో నడుస్తుంది.

వేదర్షి అయినా, శ్రీరాముడైనా, సేటను అయినా, సోక్రటీసు అయినా, శ్రీశ్రీ అయినా, "తి" అయినా, ఈ వ్యాసాన్ని ఓపికతో చదివిన పాఠకోత్తములయినా, అందరికీ "ధియో యోనః ప్రచోదయాత్" అనే సంకల్పమే ఆశయంగా ఉండగలదు.

అ

ఈ మంత్రానికి గాయత్రి అని పేరు. గాయత్రీ ఛందస్సులో వుంది. విశ్వామిత్రఋషి పేరుతో ఉంది. ఈ మంత్రం ఋగ్వేదంలోనూ, సామవేదంలోనూ, వాజసనేయ సంహిత (కాణ్వ, మాధ్యందిన శాఖలు), తైత్తిరీయ సంహితలోనూ, మైత్రాయణి సంహితలోనూ ఉంది. రామాయణంలో విశ్వామిత్రుడు రాముని లేపుతూ - "కౌసల్యా సుప్రజారామ పూర్వాసంధ్యా ప్రవర్తతే। ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం॥" అని సుప్రభాత శ్లోకం చెప్పగా తర్వాత సుప్రభాతాలు అన్నిదేవుళ్ళకు చెప్పబడినట్లు, ఋగ్వేదంలో విశ్వామిత్రుడు సవితునికి చెప్పిన గాయత్రీ మంత్రాలలాటివే పెక్కు దేవతల పేర్లలో వున్నాయి. మహానారాయణోపనిషత్తులో 18మంది దేవతల పేరిట గాయత్రీ మంత్రాలున్నాయి. ఆ దేవతల పేర్లేవన:

రుద్ర, మహాదేవ, దంతి, నంది, షణ్ముఖ, గరుడ, బ్రహ్మా, విష్ణు, నరసింహ, ఆదిత్య, అగ్ని, దుర్గి, భాను, వైశ్వానర, భగవతి, గౌరి, సర్వ (బ్రహ్మకు రెండు మంత్రాలున్నవి)

ఆగమాలలోనూ, తంత్రాలలోనూ గాయత్రీ మంత్రాలున్నాయి. అవి లక్ష్మి, రామ (రెండు), సాంబ, అఘోర, ఒక నకిలీ (న్యూనతా వాచకంగా కాదని మనవి. "తి") గాయత్రి ఇస్తాను.

"కాత్యాయనాయ విద్మహే కన్యాకుమారి ధీమహి
తన్నో దుర్గిః ప్రచోదయాత్" (మహానారాయణోపనిషత్తు)

వాటిని సుప్రభాతాలు అన్నట్లు వీటిని ప్రచోదయాత్తులు అనవచ్చును.

2. ఇట్టి ప్రయోగమే ఇంకొకటి
తద్ రాధో అద్య సవితుర్ వరేణ్యం (1-159-5)

3. ఇక్బాలు పూర్వీకులు కాశ్మీర దేశపు బ్రాహ్మణులట (పండితులు)

4. శ్రీ పాణ్యం నారాయణగౌడు (పి. యన్. గౌడు) నేను అనంతపురం ప్రభుత్వ కళాశాలలో చదివేకాలంలో (1946-50) కాలేజీ ప్రిన్సుపాల్‌గాను, రసాయన శాస్త్రాధ్యాపకునిగానూ వుండే వారు. వీరు "వైదిక రసాయనశాస్త్రం" (వేదిక్ కెమిస్ట్రీ) అనే ఉద్గ్రంథాన్ని రచించిరి. దానిని నేను నా విద్యార్థి దశలో చదివిఉంటిని. ఇప్పుడది దొరకడంలేదు. దొరికితే ఎంత బాగుండును - "తి"

5. యజ్ఞాలలో జంతుబలి ఉందని ధూర్తులు, అవివేకులు, నంజిరి మరిగినవారు చేసిన అఘాయిత్యం, శాంతిపర్వం ఇట్లంటుంది.

సురా మత్స్యాః పశోర్మాంస ద్విజాతీనాం బలిస్తథా।
ధూర్తైః ప్రవర్తితా యజ్ఞే నైతత్ వేదేషు కథ్యతే॥

మద్యం, చేపలు, పశుమాంసం, బలులు ధూర్తులవల్ల యజ్ఞాల్లోకి వచ్చినాయి. వేదంలో అటువంటిదేమీ చెప్పలేదు. వేదంలోని పదాల కర్థం తెలియకపోవడంవల్ల కూడ ఈ విపరీతక్రియలు వచ్చినవి. ఉదాహరణకు "అజ" అంటే పాతబియ్యం. దీనికి మేక అని అర్థం చేసికొని మేకను యజ్ఞంలో వ్రేలుస్తారు. అటులనే "అశ్వమేధ", "గోమేధ", "నరమేధ" అనేవాటికి అర్థాలు వేరు. జైమిని మీమాంస కూడ "మాంసపాక ప్రతిషేధశ్చ తద్వత్" (12-2-2) అంటే యజ్ఞంలో మాంసపాకం నిషేధం అని శాసించింది.

6. శ్రీ నానక్ రాం వసన్ మల్ తచాని పండితుడు ఇంగ్లీషులో "ద మిస్టరీ ఆఫ్ మహాభారత" (మహాభారత రహస్యము) అనే ఐదు వాల్యూములు గ్రంథాన్ని వేదార్థపరంగా వ్రాసినాడు. (1934 ప్రాంతంలో)

7. శుక్రాచార్యుడు వృత్రాసురుని కొరకు ఇంద్రనాశానికి యాగం చేస్తున్నాడు. "ఇంద్ర శత్రుర్వర్ధస్వ స్వాహా" అన్నాడు. వృత్రాసురుడు టపీమని చచ్చినాడు. ఇదేమాశ్చర్యం అని చూస్తే తేలినదిది: అతని అభిప్రాయం ఇంద్రశత్రువైన (వృత్రా) వృద్ధి పొందుము అని. ఈ ఇంద్రశత్రు సమాసంలో మలిపదం ఉదాత్తమైతే, ఇంద్రునియొక్క శత్రువయిన వృత్రుడు అనే తత్పురుష సమాసం అయి ఇంద్రుడు చస్తాడు. అప్పటికి సురాపానం వీడలేదేమో, శుక్రాచార్యుడు మతిభ్రమతో పూర్వపద(ఇంద్ర)ము మీద స్వరం వేసినాడు. అప్పుడు బహువ్రీహి సమాసమై "శత్రువైన ఇంద్రుడు వృద్ధి పొందుగాక" అని అర్థం వచ్చింది. వృత్రుడు చచ్చినాడు. ఇది వేద మంత్రద్రష్ట, శుక్రాచార్యుని ప్రతిద్వంద్వి, ఇంద్రుని గురువు బృహస్పతి చేసిన ట్రిక్కుట. సంస్కృతంలో బహువ్రీహి - తత్పురుష సమాసాల గొడవ ఎప్పుడూ ఉన్నదే. "తటాకోత్తర భూమి" అనే సమాసంమీద కథ ఉంది. ఆంధ్రదేశాన్ని పాలించిన రాజవంశాలలో "ఆంధ్రభృత్యులు"న్నారు. ఇది బహువ్రీహియా, తత్పురుషయా అనే విషయం నేను 'భారతి'లో చర్చించినాను. స్వరమూ కాకువుల ప్రభావం దైనందిన జీవితంలోనూ ఉంటుంది. "దేవుని ఎదుట ప్రమాణం చేసి నిజమే చెప్పుతాను" అనే వాక్యాన్ని "చెప్పుతానూ?" అనేటప్పుడు కొంచెం దీర్ఘం తీస్తే వ్యతిరేకార్థం వస్తుంది. "ఆ రాజు దయవల్ల ఇట్లున్నారము" అనే వాక్యంలో "ఇట్లు" దగ్గర స్వరం వేస్తే విపరీతార్థం వస్తుంది. తిక్కన కవిత్వం ఇట్టి సంవిధానాలతో కూడి వుంటుంది. అది అందుకే అర్థం కావడం కష్టమంటారు విమర్శకులు.

8. స్థాణు రయం భారహారః కిలా భూ దధీత్య
వేదం న విజానాతి యోర్థం
యోర్థజ్ఞ ఇత్సకలం భద్ర మశ్నుతే
నాకమేతి జ్ఞాన విధూత పాప్మా
యద్ గృహీత మవిజ్ఞాతం
నిగదే నైవ శబ్ద్యతే
అనగ్నా మివ శుష్కైధో
నతజ్జ్వలతి కర్హిచిత్ (—నిరుక్తం 1-6-17)

9. అహురమజ్దా జెండావెస్తాలో ప్రతిపాదితుడైన పరబ్రహ్మ. ఈయన పైని స్తోత్రాన్ని మూల "అవెస్తా"నుంచి పాఠకుల ఆసక్తి చోదనానికై ఇస్తున్నాను.

స్వంతేమ అతథ్యా మజ్దామే గహీ అహురా
హ్యాతమా వోహం ప ఇరి
జసత మనేగహా యశత్ ఉష్యాతుష్మామ ఇతిశ
వహిస్తా నా ఇత్‌నాం హో ఉరుశద్రేగపతోస్యాత్ చిష్మస్షో
అతతో వీ స్వోగ అంగ్రేగ అవోఉ న అదరే

ఇచట అంగ్రే అంటే వేదాలలోని అంగీరస ఋషులు. అంగీరస ఋషులంటే జరథుష్ట్రనికి చాలా గౌరవమట.

—అవెస్తాలోని ఒక గాథా

10. ఋతస్య గోపావధి తిష్ఠతో రథం సత్యధర్మాణా పరమే వ్యోమాని (5-63-1)

అని మిత్రావరుణులమీది మంత్రం. ఇచట ఋతస్య గోపావధి, సత్యధర్మ పదాలు గమనించవలెను. ఋతానికీ, సత్యధర్మాలకు అవినాభావ సంబంధం కలదు.

11. పితా యజ్ఞానాం అసురో (3-3-4)
అసుర ప్రజావాన్ (4-2-5)
అసురః సుశేవో (5-15-1)
అసురో మఘోనః (5-27-1)
త్వే అసుర్య మారుహత్ (5-10-2)
ఈ శేన్యంవో అసురం (7-2-3)
అసుర ఇవ నిర్ణిజం (8-19-27)

ఇవన్నీ అగ్నిపరంగా చెప్పిన మంత్రాలు.

# "సాగరిక"

ఘనసారంలాగా పటీరంలాగా
కడిమి పువ్వులాగా వెన్నపూసలాగా
వెన్నెలలాగా
శుద్ధమయిన, సుమహితమయిన
సురభిళమయిన సుకుమారమయిన
సుభగమయిననీ సమాశ్లేషం కోసం
వేగిరపడుతూ
అదరుతున్న రాధికయో!....

సద్గుణంలాగా పుణ్యంలాగా
ధర్మంలాగా సత్యంలాగా
కీర్తిలాగా
స్వచ్ఛమయిన, శాశ్వతమయిన
స్థిరమయిన, దృఢమయిన
చిరంజీవమయిన నీ సయ్యోధ్ధకోసం
ఘోరతపమాచరిస్తూ
అలగుతున్న "నగకన్యకయో"!....

( సముద్రతీరంలోని ద్వారక, సోమనాథ్ దేవాలయాలను చూచిన పిమ్మట కలిగిన భావాలు )

# 'ఉంగరపు వేలు!'

కాళిదాస కవీంద్రుని
ఉన్నతత్వం వలన
'ఉంగరపు వేలు'
'అనామికగానే' మిగిలిపోయింది
ఆనాటినుంచి ఈనాటివరకూ
అనంత సాహిత్యేతిహాసంలో!
తాతగారి బామ్మగారి
భావాలకు దాసులయిన
యువకులు
కైకొంటున్న
'ఉంగరపు వేలు'
అత్యాశల కట్నాల వలన
కాలి, మాడి, మసయి
'అనామికగానే' మిగిలిపోతున్నది
ఆనాటినుంచి ఈనాటివరకూ
అధర్మ సమాజ చారిత్రంలో!

# పాటలగంధీ! నీ చిరునవ్వు.

హరువైన సింహాసనంపై
ఠీవిగా కొలువై
కప్పురపు పలుకులు ఎగజిమ్మినట్లు
కుంకుమ పొళ్ళు గుప్పినట్లు
పువ్వుల పొట్లాలు విప్పినట్లు
కవితల్ని వక్కాణిస్తున్న
రఘునాథ రాణ్మౌళి మోహనాకారంలా
బింబాధర పీఠికపై
హేలగా వాసిస్తూ
పాటల గంధీ! నీ చిరునవ్వు
మనసుల్ని దోస్తున్నది!
రసపుష్టియై
జాతివార్తా చమత్కృతుల్ని
అర్థగౌరవాల్ని వివరిస్తున్నది!
సరసమైందే కాదు
బెళుకైంది
ముగ్ధమైందే కాదు
భాగ్యకరమైందీ కూడా అది!

శ్రీ, కె. ... ఋ: శ్రీ కె. అశోకుబాబు

# ర్గం కాని అంతర్గం

మూలం :
**శ్రీమతి నందినీ శతపధి**

తెనుగు సేత :
**శ్రీ బాసంగి శ్రీరాములు**

నిలువుటద్దం ముందు నిలబడి తన ప్రతిబింబాన్ని వింతగా చూడసాగింది సంఘమిత్ర. ఆనాటి సంఘటన ఆమె ఊహించిన దానికంటె ఎక్కువగా ఆమె ముఖకవళికలలో మార్పు తెచ్చినట్లు కనబడుతోంది. అద్దంలో కనబడిన ఆమె ముఖం, ఆశ్చర్యాన్ని నాలుగు రెట్లు పెంచింది.

నల్లని ఆమె తల వెంట్రుకలు అక్కడక్కడ నెరవటం ప్రారంభించాయి. ఆమె కళ్ళలో విచారం తొంగిచూస్తోంది. నుదురు నల్లగా మాడి ముడుతలు పడింది. ఆమె ముఖంలోని ఆకర్షణ, అందం ఎవరో తీసేసుకున్నట్లనిపించింది. తన జీవితంలో నెమ్మదిగా నలభై వసంతాలు రెండు నెలల క్రిందటే గడిచినట్లు ఆమెకు అకస్మాత్తుగ గుర్తుకు వచ్చింది.

అనుకోకుండానే, సంఘమిత్ర కళ్ళు ఆమె చీరవైపు మళ్ళినాయి. జీవితంలో కనిపించిన కష్టాలకు, దుఃఖాలకు ప్రతీకగా నిలిచినట్లనిపించిందా చీర, ఆమెకు. ఆ చీరకు మరకలు - నల్లనివీ, పచ్చనివీ, అక్కడక్కడ కనబడుతున్నాయి. కూతురు తునికి బాగా జలుబు చేసినట్లు మిత్రా చీరకున్న గుర్తులే చెప్తున్నాయి. పెద్ద కొడుకు కూడ చాల అల్లరి నేర్చాడు. 'ఫుట్‌బాల్' ఆడుకొని యింటికి వచ్చి కాళ్ళు చేతులు కడుక్కొన్న వెంటనే తల్లి చీరవైపే చూసేవాడు. తువ్వాలు వాడకపోవడానికి వింత కారణాలు చెప్పేవాడు. తుని ముక్కు తుడుచుకోడానికి అమ్మ చీరెందుకు వాడుతోంది అని అడిగేవాడు? మిత్రా మరేం మాటాడలేకపోయేది. వీటికితోడు ప్రతి రాత్రి పడుకొనేటప్పుడు చిన్న కూతురు పక్క తడిపేసే అలవాటువల్ల చీర తడుస్తూనే వుంటుంది.

ప్రభుత్వ కార్యాలయంలో ఉప కార్యదర్శిగా పనిచేస్తున్న భర్త ప్రశాంత మిశ్రాకు కూడ మూడుపూటలా భోజనం తర్వాత ఈ మురికిచీరే కావలసి వస్తుంది.

దీంతో మిత్రాకు చాలా చికాకు కలిగేది. కొన్నిసార్లు హాస్యం కూడా పట్టించేది అతన్ని. అయినా ప్రశాంత్ యథాప్రకారం ఒకే మాట చెప్పేవాడు. 'ఊగుతూన్న నీ చీర కొంగంటే నాకెంతో ఆనందం, మిత్రా' అనేవాడు. ఆమె దానికి మరింకేమీ చెప్పలేకపోయేది.

* * *

మిత్రా ఆలోచల పరంపర తెగిపోయింది. ఆనాటి ఉదయం జరిగిన సంఘటనవైపే ఆలోచన మళ్ళింది. అనుకోకుండా వినయ్ కలిశాడామెను. ఆ పేరుతో ఆమె జ్ఞాపకాలెన్నో ముడిపడివున్నాయి. అద్దంవైపు చూసినపుడు మిత్రా తనలో తానే రెండు మూడుసార్లు 'వినయ్' పేరును తలచుకొని బిగ్గరగా నవ్వేది. ఒకక్షణం అద్దంలోని ప్రతిబింబం, పెళ్ళయి, నలుగురు పిల్లలకు తల్లైన, నలభై సంవత్సరాల మిత్రాగా అనిపించలేదామెకు. యవ్వనంలో అడుగుపెడుతున్న మిత్రా ప్రతిబింబంలా కనబడిందామెకు. ఈ రోజుల్లో ఆమెనెవరూ సంఘమిత్రా అని పిలవడంలేదు. మిత్రాగానే చాలామందికి ఆమె తెలుసు. కొన్నిసార్లు 'అమ్మా' అని పిలువబడుతుంది. ఇంతేకాకుండా బయటి ప్రపంచానికి ఆమె శ్రీమతి మిశ్రాగానే తెలుసు. ఉత్తరాలలో కూడ శ్రీమతి ప్రశాంతమిశ్రాగానే సంబోధించబడుతుంది. సంఘమిత్రా ఉనికి శ్రీమతి మిశ్రాగా ఎప్పుడో మారిపోయింది.

దీనివలనే అకస్మాత్తుగ వినయ్ ఆమెను సంఘమిత్రాగా సంబోధించగానే ఆమె మనస్సు సంచలనానికి గురయింది. వినయ్ సంబోధన కొంత ప్రత్యేకతుంది. బహుశ ఎవరికీ దీనిని వివరించడం సాధ్యంకాదు. ఇలాంటి సంబోధనతో పిలవడం వినయ్‌కొక్కడికే పరిమితం. ఇరవై ఆయిదేళ్ళ క్రితం వినయ్ మిత్రాను అలా సంబోధించేవాడు. ఆ సంబోధనకే మారు పలికేదామె. అద్దం ముందున్న మెత్తని ఆసనంమీద కూర్చున్న ఆమె తల తిరుగుతున్నట్లనిపించింది. ఇంతకాలం గడిచిన తర్వాత అనవసరమైన సంఘటనలన్నీ ఎందుకు గుర్తొస్తున్నాయి? నిజంగా తెలివితక్కువతనం కాకపోతే వినయ్‌ని పిలవడం దేనికి? దీనివలనే ఈ చికాకులన్నీ వచ్చాయి. వినయ్‌ను తాను పిలిచిన దెందుకు?

ఈ ఇరవైయైదు సంవత్సరాలలోను వినయ్‌ను తాను కలవక పోలేదు. వినయ్, ప్రశాంత్ స్నేహితుడే. అప్పుడప్పుడు తమ యింటికి వచ్చి, టీ త్రాగి, తమతో మాట్లాడి వెళ్తుండేవాడు. వినయ్ గురించి గొప్పగా ప్రశాంత్ మాట్లాడుతుంటే, చాలా ఆశ్చర్యంతో వినయ్‌వైపు చూస్తూ వుండిపోయేది మిత్రా. ప్రశాంత్ సన్నిధిలో వందరెట్లు గౌరవం, నెమ్మది కనపరిచేవాడు వినయ్. కాని వినయ్ సన్నిధిలో ఆమె తన పద్ధతులను మాత్రం మార్చుకోలేదు. తన దైనందిక ప్రవర్తన కూడ మార్చుకోలేదు.

ఈ రోజు వినయ్‌తో ఏమని చెప్తుంది? తనను పిలిచిన కారణ మేమిటని వినయ్ తప్పకుండా ఆమెను అడుగుతాడు. తన మనస్సంత టిలో వెదకసాగిందామె. ఎక్కడో తీరని కోరికేదో మిగిలివుండినట్లని పించిందామెకు. ఈ ఇరవైయైదు సంవత్సరాలలోను తన మనస్సులో ఏదో వెదుకుతూనే వుంది - పనికిరాకుండ మిగిలిపోయినవాటిని బయ టకు నెట్టివేస్తూనే వుంది. తన సంఘం, కుటుంబం, క్రమశిక్షణ, నైతిక ప్రవర్తన మొదలైన విషయాలపై గల భయ గౌరవాల వలన, ఆమె మనస్సులోని శాంత సముద్రాన్ని భంగపరుస్తున్న కెరటాలను కటు వుగా వెనుకకు త్రోసివేస్తూనే వుంది. విషయాలను అర్థం చేసుకోక కాదు. కట్టుబాట్లను వదిలించుకొనేంత స్వార్థం లేదామెలో. ఇతరు లామెను పొగడడమే కాదు—తనను తాను గూడ మెచ్చుకొనేది.

ఒకరోజు మిత్రా స్నేహితులకు మణిమాల అనే ఆమె చర్చనీయాంశమైంది. మణికి పెండ్లయింది. ఒక కొడుకుకు తల్లికూడా. అయినా ఆమె భర్తను, కొడుకును వదిలేయడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమె భర్త మంచివాడు, చక్కనివాడు కూడ. అయితే ఆమెకు 'పవిత్ర'తో వున్న అనుబంధం, భర్తను వదిలేయడానికి తోడ్పడింది. ఇప్పుడామె పవిత్రతో వుంటోంది. ఆమె పిల్లలు కూడ పెద్దవాళ్ళయ్యారు. అన్నింటినీ వాళ్ళు గమనిస్తున్నారు, తెలుసు కుంటున్నారు. వాళ్ళ తల్లి గురించి వాళ్ళేమనుకుంటుంటారు? ఈ చర్చ జరుగుతున్నప్పుడు మిత్రాకూడా అక్కడే వుంది. ఈ విషయాలు విన్నప్పుడామె శరీరంలో వణుకు పుట్టింది. మణిమాల ప్రవర్తనను తీవ్రంగా ఖండించింది మిత్రా. స్నేహితురాళ్ళందరిలో మిత్రా ఎక్కువగ చదువుకున్నది గనుక వాళ్ళు భయం, సిగ్గు వలన మారు మాటాడలేకపోయారు.

శంకర్ మాత్రమే శ్రీమతి మిత్రా అభిప్రాయాన్ని వ్యతి రేకిస్తూ అన్నాడు: 'నిగూఢమైన కోరిక మీ మనసులో వున్నపుడు, దానిని దాచుకొని మిమ్ములను మోసగించుకోవడం గొప్ప విషయంగా భావిస్తారా?'

మిత్రా నిర్ఘాంతపోయింది. కాని అలా ఒక క్షణం మాత్రమే ఉంది. మరుక్షణంలో శక్తిని కూడదీసుకొని యిలా అంది: దాస్‌గారూ, ఒకరి మనస్సులోని కోరికను దాని యిష్టమైనరీతిలో కొనసాగనివ్వడం మనిషికి సాధ్యంకాని విషయం. మనుషుల భావావేశాల ప్రవాహంలో ప్రపంచం ముందుకు పోవడంలేదు - క్రమశిక్షణ అనే కక్ష్యలో అది తిరుగుతోంది. అందుచేతనే, తన స్వంత నిబంధనల ప్రకారం మనిషి జీవించాలనుకొని సంఘంలోని క్రమశిక్షణను పాటించడం మానేసిన రోజున, తిరిగి అతడు అనాగరిక రాతియుగానికి పోవలసిందే. అప్పు డిక కుటుంబం, సంఘం, మానవత్వం ఉండనే ఉండవు.

అప్పుడు తన వాదనను అభినందిస్తూ ప్రశాంత్ ఏమన్నాడు? అతని మాటలు గుర్తుకురాగానే, ఝల్లుమన్నదామె శరీరమంతా. 'మిత్రా! నీవు చాలా అద్భుతమైనదానివి. నిన్ను, నా జీవిత భాగ స్వామినిగా పొంది నేనొక గొప్ప కార్యాన్ని సాధించినట్లు భావిస్తు న్నాను' అన్నాడు ప్రశాంత్.

ఈ పొగడ్తకు మిత్రా సిగ్గుపడి ప్రశాంత్ భుజాలమీద తన తలను వినయంగా వుంచింది.

కాని ఈ రోజు తన మనోస్థితి ఎందుకిలా వుంది? వినయ్ గురించి ప్రశాంత్ అంతా నిజే వుంటాడు; అయినా ఈ పదిహేను సంవత్సరాలలోను మిత్రాను ఒక ప్రశ్న కూడా వెయ్యలేదు. తన దైనందిన కార్యక్రమాలను అనవసర జోక్యం లేనిరీతిలో నెమ్మదిగా కొనసాగించుకు పోయేవాడు. దేనిగురించీ కూడ అసాధారణమైన ఆత్రుతగాని, మనసులో శంకగాని కనపరిచేవాడు కాదు. దానికి భిన్నంగా ప్రవర్తించడం అతని ప్రకృతికే విరుద్ధం. నిజానికి అతని అసాధారణ శాంతస్వభావం మిత్రాకు అసహనం కలిగించేది. దైనందిన సాంసారిక చికాకులమధ్య సానుభూతి మాటలకై వేచి వున్న మిత్రాతో ప్రశాంత్ ఏవో పనికిరాని మాటలు కొన్ని చెప్పి, తన పనిలో తిరిగి లీనమైపోయేవాడు. జీవితంలో విశ్రాంతిగాని, ఆనందంగాని కోరుకునేవాడు కాదు ప్రశాంత్ - ఇవి అతనికి పనికి రావని ఎవరైనా చెప్పారేమో అన్నట్లుగా.

రోజులు గడుస్తున్నకొద్దీ మిత్రా అసహనం పెరగసాగింది. ఆమె భావాలను బయటపెట్టాలని ఆశించేది కాని ఇదేమీ ప్రశాంత్‌కి అర్థమయ్యేది కాదు. కొన్ని సందర్భాలలో అతని పనులకు అడ్డు చెప్తూ, అతని ఎడల అనాసక్తత కనపరుస్తూ మిత్రా వ్యవహరించేది. కాని ఈ ఎత్తుగడలేవీ ఫలించలేదు. కాని ఆమె ఆశ్చర్యానికి తగ్గట్టుగా ప్రశాంత్ హృదయం లేనివాడిగా ప్రవర్తించేవాడు. అతనిలో చిన్న పొరపాటేదైనా కనబడితే, తను వ్యతిరేకించినదానికి సార్థకత వుంటుందనుకొంది, కాని ప్రయోజనం శూన్యం!

మిత్రా దృష్టి అద్దంమీద వుంది. కాని ఆమె కళ్ళే ఆమె హృదయంలో అంతర్లీనంగా వున్న భాగాలు. సుఖశాంతులతో వున్న తన జీవితంలోనికి వినయ్‌ను ఎందుకు పిలవాలనుకుంటోంది? ఎన్నో రకాలుగా ఆ ప్రశ్నను మళ్ళీ మళ్ళీ వేసుకుంది. కాని యింతవరకూ ఆమెకు తృప్తికరమైన సమాధానమేదీ దొరకలేదు. అయితే ఇంత జాగ్రత్తలోనూ పరిశుద్ధి చేసిన తన హృదయంలో ఎక్కడో తనకు వినయ్‌పై కోరిక స్వల్పంగా దాగి వుందా? మిత్రా నెమ్మదిగా మూల్గింది: కాదు, ఇది అసాధ్యం. తన జీవితంలో-ఇంటా, బయటా కూడ-వినయ్ సహకారం తనకక్కరలేదు. ఇలాంటి సహకారం లభించినా, దానిని ఆమె తిరస్కరించడానికే యిష్టపడుతుంది.

తర్వాత ...? శీతాకాల సాయంత్రపు లేచీకటి దట్టమౌతోంది. తన ముఖాన్ని అద్దంలో చూడలేకపోతోంది మిత్రా. గదిలోని వస్తువులు కూడ కనబడడంలేదు. అప్పటివరకు గదిలోనికెవ్వరూ రాలేదు. ఎవరైనా వచ్చివుంటే మిత్రా అద్దంముందు కూర్చున్న విషయాన్ని చూసి ఆశ్చర్యపోయేవారే.

పిల్లలు మాష్టారుచుట్టూ చేరి, వాళ్ళ పాఠాలు ప్రారంభించారు. ప్రక్కనుండి ఏదో గొంతు వినబడింది. తెరలోనుంచి ప్రశాంత్ ఆఫీసు గదిలోని దీపపు వెలుగు కనబడుతోంది. బల్లమీద ఫైళ్ళు దొంతరగా పడివుంటాయి. ప్రశాంత్ టేబులు దగ్గర కూర్చొని ఒక చేతిమీద ముఖాన్ని ఆనించుకొని రెండో చేతితో కలం పట్టుకొని వుంటాడు. గడియారం పది కొట్టేసరికి, పిల్లలు భోజనాలు చేసి పడుకొని వుంటారు. తర్వాత ప్రశాంత్ ఆఫీసుగది విడిచిపెడ్తాడు. ఫేంటు, షర్టు మార్చుకొని, లుంగీ కట్టుకొన్న తర్వాత, మిత్రాకు వెనుకగా వచ్చి నిలబడతాడు. అప్పుడు చిన్నపిల్లాడిలా 'మిత్రా, ఈవేళ తినడానికేమైనా పెడతావా?' అంటాడు. మిత్రా రెండు ప్లేట్లలో భోజనం తెచ్చి నేలమీద పెడ్తుంది; ఇద్దరూ కూర్చొని భోంచేస్తారు. ప్రశాంత్ ఒకటి రెండు మాటలేవో చెప్పిన తర్వాత, ఏదో నిగూఢమైన ఆలోచనలో మునిగిపోతాడు.' భరించరాని నిశ్శబ్దం రాజ్యమేలుతుంటే, మిత్రా తన భోజనాన్ని ముగించి లేస్తుంది. ఇది ప్రతిరోజు జరుగుతున్న విషయమే. అకస్మాత్తుగ మిత్రాకొక ఆలోచన వచ్చింది. అలాంటప్పుడు తాను పరిగెత్తి ప్రశాంత్ భుజాలను పట్టుకొని 'ప్రశాంత్, ఈ దినమింత మౌనంగా వున్నారేమి? మీ పేరులో దాగిన గుణాన్ని తెలియజేయడానికేనా?' అంటుంది. తర్వాత అతనిని ఆశ్చర్యంలో ముంచెత్తేలా యిలా అంటుంది: 'భరించలేని మీ మౌనాన్ని తప్పించుకోదలచి, నేను వినయ్‌ను ఆహ్వానించాను. దానికి మీరేమంటారు?'

వినయ్‌ను ఆహ్వానించడానికి గల నిజమైన కారణాన్ని సంఘ మిత్ర గుర్తించగలిగింది. వినయ్ హెచ్చుగా మాట్లాడతాడు. 'వాగుడుకాయ' అతనికి సార్థక నామమని ఎవరైనా అంటే అది పూర్తి సత్యమే అవుతుంది. అతడామెలో దాగివున్న శక్తిని బహిర్గతం చేయడానికి ప్రోత్సాహం యివ్వగలడు. కాని వినయ్ దీనిని అర్థం చేసుకోగలడా? దీనితో అతను తృప్తి పడగలడా? అతడేమనుకుంటాడు? ఈ విధంగా ఆలోచించి ఏమి నిర్ణయానికి వస్తాడంటే - ప్రస్తుత జీవితాన్ని మిత్రా అసంతృప్తితో గడుపుతోందని. ఆమె వినయ్‌ను

మిత్రా యింతకంటె ఆలోచించలేకపోయింది. ఆమె తల బరువుగా అనిపించసాగింది తననుతానే నిందించుకోసాగింది. తానిలా ఎందుకు ప్రవర్తిస్తోంది - భావన మాత్రంగానేనా? ఆమెను ప్రశాంత్ అపార్థం చేసుకున్నాడా? తనను అపార్థం చేసుకోడానికి ప్రశాంత్‌కు హక్కేమి వుందని? ఏనాడైనా ఆమెను అర్థం చేసుకోడానికి ప్రయత్నించాడా? తిండి, బట్ట, యిల్లు-మనిషి బ్రతకటానికి సరేనా యివి? తన సమస్యలన్నిటినీ పరిష్కరించుకోడానికే, ఈ దినం తాను ముందడుగు వెయ్యబోతోంది.

మిత్రా నిలబడి లైట్లను వెలిగించింది. కొట్టొచ్చినట్టుగా కన బడ్డాయి రంగు ఫొటోలు రెండు-ఒకటి తనది, రెండోది ప్రశాంత్‌ది. ఇరవై ఐదు సంవత్సరాల క్రితం ప్రశాంత్ యౌవనంతో తొణికిసలాడుతున్నప్పటి ఫోటో అది. కాంతివంతమైన ఆ కళ్ళు చూస్తున్నాయి మృదువుగా. ఎంతో అందంగా కనబడుతున్నాడు. ఆ ఫొటోవైపు నిశితంగా చూసిందామె. ఒక క్షణంక్రింద ఆమె చేసుకున్న నిర్ణయం నీరసపడసాగింది. కాని ఆమె తన శక్తినంతా కూడదీసుకొంది. బట్టలు మార్చుకొని, ముఖం కడుక్కొని, ప్రశాంత్ ఆఫీసు గదిలోకి అడుగు పెట్టింది.

గదిలో ప్రశాంత్ ఒక్కడే వున్నాడు. ఫైళ్ళ పని బహుశః పూర్తయినట్లుంది. ఒక పెద్ద యింగ్లీషు పుస్తకంతో విశ్రాంతిగా వున్నాడు. ఆమె రాకను గమనించనేలేదతడు. అకస్మాత్తుగ అతని చేతినెవరో తట్టినట్టు అనిపించింది. తన విశ్రాంతిని భంగపరిచిన వ్యక్తిని పంపించెయ్యాలని, చికాకుగా వెనుతిరిగాడు-మిత్రా కనిపించేసరికి అతని ముఖం వెలుగు నింపుకుంది. ఒక క్షణమామెను వెనుదిరిగి చూసి, అప్పుడు తట్టుకోలేక, ఆమెను తన దగ్గరగా లాగుకున్నాడు. అకస్మాత్తుగ మిత్రా ఒళ్ళంతా పులకరించింది. కొద్దిసేపటి తర్వాత ప్రశాంత్ అడిగాడామెను - 'ఈ రోజిక్కడికెలా వచ్చావు? నీ దారి తప్పిపోలేదు కదా?'

ఆశ్చర్యంగా చూసింది మిత్రా. చక్కగా తాను తయారుచేసుకున్న ఉపన్యాసం, తన చికాకులను పూర్తిగా మరచిపోయి 'ఏమిటి, మీరనేది' అని మాత్రమే అనగలిగింది.

ఆ అంశంమీద చెప్పగలిగిందేమీ లేదనిపించేసరికి, ప్రశాంత్ లేస్తూ యిలా అన్నాడు 'దీనికి సమాధానమెంతో తేలిక. నీ కాలమంతా పిల్లలతోను స్నేహితులతోను గడుపుతూ, దురదృష్టవంతుడైన యీ నీ భర్తవైపు చూడాలనైనా వీవనుకోలేదు. అటువంటిది రోజు నన్ను నీ రాకతో అనుగ్రహించడం కొంచెం ఆశ్చర్యంగానే వుంది.' ప్రశాంత్ గొంతు బొంగురుపోసాగింది. ఆమె చేతులు పట్టుకొని 'మితూ, నిజంగా ప్రతిరోజు ఈ ఫైళ్ళు చూస్తూ, అకస్మాత్తుగా నీవు నా గదిలోనికి వచ్చి నీ అందమైన ముఖం నా భుజమ్మీద అనించి అడుగుతావని అనుకుంటుంటాను...ఏమని అడుగుతావు? తర్వాత అతని గొంతు మూగబోయినా, అతని కళ్ళు మాత్రం మూగభాషను తెల్పుతూనే వున్నాయి. ఆనందమనే మంత్రదండాన్ని మాంత్రికుడొకడు తనపై ప్రయోగించాడేమో ననిపించింది మిత్రాకు. ఏమిటిది? ప్రశాంత్‌లో ఈ కాంక్షను గత ఇరవై ఐదు సంవత్సరాలలోను తాను గమనించనేలేదు. అయితే తన జీవిత గమనం నిర్దేశించబడేందుకు మిత్రా కోసం, ప్రశాంత్ వేచి చూస్తున్నాడా? కొన్ని క్షణాలలా గడిచాయి. కొద్దిసేపటి తర్వాత, దోషిలా క్రిందికి చూస్తూ మిత్రా అంది - 'ఈ సాయంత్రం మనింటికి వినయ్‌ను ఆహ్వానించాను.'

ప్రశాంత్ సంతోషముతో నవ్వాడు. తన చేతులలో ఆమె ముఖాన్ని యిముడ్చుకొంటూ 'ఈ రోజు నిజంగా పండగ జరిపించుకోవలసిందే గనుక - మంచి విందు చేసుకుందాం' అన్నాడు.

ఇంతలో అకస్మాత్తుగా ఎవరో, ఆఫీసు గదికి వున్న అందమైన కర్టనును ప్రక్కకు తొలగించారు.

# శ్రీనాథుడు

## (సానెట్)

శ్రీనాథ! సుకవితా శ్రీనాథ! కవినాథ!
(నేను నిను పొగడుటకు సీసపద్యము కాక
సానెట్టు వాడెదను! - నను క్షమింతువు గాక!)
నీ నిరుపమాన కవితాప్రతిభ, నీ మేథ
కలదెవ్వరికి చెప్పు? - తొలి ముగ్గురికి తప్ప!
ఎటువంటి రాగివై, ఎటువంటి భోగివై,
ఎటువంటి శివభక్త రసతత్త్వయోగివై,
బ్రతికితివి! నేనదెవ్వడ పొగడ నీ గొప్ప!!
నీ మహాకావ్యములు ధారాప్రసిద్ధ రస
శిల్పములు-రసరాజ్య దిగ్జయ స్తంభములు!
నీ చాటు పద్యములు రసహేమకుంభములు!
పండితాఖండలుడవీ, వైన నీకు అస
దృశమైన ప్రీతి సామాన్యులన! పల్నాటి
వీరచరితము వ్రాసితివి: మెచ్చ జనకోటి!!

శ్రీ శంకరగంటి రంగాచార్యులు

ప్రొఫెసర్ బి. ఆర్. కె. రావు

# భారతదేశ అల్ప ఆర్థికాభివృద్ధి

## వివరాలు : కారణాలు : పరిష్కారాలు

(గతసంచిక తరువాయి)

సగటు భారతీయుని అల్ప జీవనస్థాయి :

సగటు భారతీయుని ఆహారంలో మాంసకృత్తులు, కేలరీలు కావలసిన ప్రమాణంకంటె తక్కువ. అందువలన అతని ఆహారం సంతులితం కాదు. (చూడుము. గతసంచికలోని పట్టిక-8). అభివృద్ధి చెందిన దేశాల్లో సగటు పౌరుని ఆహారంలో 3000 కాలరీలుండగా, సగటు భారతీయుని ఆహారంలో 1990 కేలరీలు మాత్రమే వున్నవి. కేవలం బొందిలో ప్రాణముండి బ్రదకడానికి కావలసిన 1800 కేలరీల కంటె 190 కేలరీలు మాత్రమే ఎక్కువ. భారతీయ ఆహారంలో తృణ ధాన్య పదార్థం ఎక్కువ. అభివృద్ధి చెందిన దేశాల ఆహారంలో పండ్లు, చేపలు, వెన్న, చక్కెర, మాంసమువుండి మాంసకృత్తులు, విటమినులు, ఖనిజ లోహాలు, శక్తి బాగా లభ్యమై ఆ ఆహారం సంతులితంగా వుంటుంది. అభివృద్ధి చెందిన దేశాలలో లభ్యమయ్యే ఆహారంలోని మాంసకృత్తులలో సగంకంటె, భారతదేశంలో సగటు మానవునికి లభ్యమయ్యే ఆహారంలో మాంసకృత్తులు తక్కువ. భారతీయుల్లో 20 నుండి 40 శాతం ప్రజలవరకు అనుచిత ఆహారం కల్గించే లోపం వల్ల బాధపడుతున్నారు. సగటు భారతీయుని దినసరి ఆహారంలో లభ్యమయ్యే మాంసకృత్తులు రోజువారీ 49 గ్రాములుకాగా, కొన్ని అభివృద్ధి చెందిన దేశాల్లో సగటు మానవుని ఆహారంలో అంతకు రెట్టింపుకంటె అధికంగా వుంటున్నవి. (చూడుము పట్టిక-8) సగటు భారతీయుని ఆహారంలో 1960లో పాలు 48 కేజీలుకాగా అది ఈనాడు 40 కేజిలకు దిగింది. పాలిచ్చే తల్లులలో నూటికి 60మంది అనుచితాహార బాధితులు. 1975లో 38 శాతం భారత జనాభాకే, సురక్షిత జలం, త్రాగడానికి లభ్యమౌతూ వుంది. ఇందువల్ల భారతీయ సామాన్య జనబాహుళ్యానికి వ్యాధి నిరోధకశక్తి తక్కువగా వున్నది. ఆ పరిస్థితి ఆరోగ్య లోపానికి త్రోవతీసి భారతీయ శ్రామికుని కార్యనిర్వాహణ సమర్థతను తగ్గిస్తోంది.

సామాన్య భారతీయుల గృహవసతి లభ్యతాస్థితి అంత దుర్భరంగా వున్నవి. 1971 జనాభా లెక్కల ప్రకారం 125 మిలియన్ల భారతీయ గృహాల్లో 62 మిలియన్లు - 50.4 శాతము - మట్టితోను, కాల్చని యిటుకలతోను నిర్మించబడినట్టివి. భారతీయ రాజధాని నగరాల్లో నివసించే జనుల్లో దాదాపు 40 శాతం మురికివాడల్లో నివసిస్తున్నారు. భారతీయ గృహాల్లో ప్రతి అయిదింట ఒకటి వాస యోగ్యమే కాకుండా వున్నది.

అల్పాభివృద్ధి దేశంలో జనాభా సంబంధిత లక్షణాలు :

అల్పాభివృద్ధి దేశాల్లో జనాభా సాంద్రత బహు హెచ్చు. చాలమంది పని చేయడానికి పనికిరాని 0-15 సంవత్సరాల వయస్సు సముదాయంలో వున్నారు. జనాభాలో వీరి అనుపాతం చాల హెచ్చు. పనిచేసే వయస్సయిన 15-60 సంవత్సరాల సముదాయంలో బహు తక్కువమంది వున్నారు. జనాభాలో వీరి అనుపాతం చాల తక్కువ. దీనికితోడు సగటు జీవితకాలం తక్కువ. పైగా శిశు మరణరేట్లు పెద్దవి. ఈ విషయాల విపుల పరిశీలన సమస్యాగ్రాహ్యతకు తోడ్పడుతుంది.

1981లో ప్రపంచ సగటు జనసాంద్రత చదరపు కిలో మీటరుకు 29కాగా భారతదేశంలో యీ జనసాంద్రత చదరపు కిలో మీటరుకు 221గా వున్నది. చదరపు కిలోమీటరుకుఅ మెరికా జన సాంద్రత 23, కాగా రష్యాలో 11గాను, కెనడా, ఆస్ట్రేలియాల్లో చదరపు కిలోమీటరుకు 2గాను వున్నది. చైనాలో కూడా జన

సాంద్రత 85 మాత్రమే. హెచ్చు జనసాంద్రత భూమిపైన, ఇతర సహజవనరులపైనా జనపోషణ భారాన్ని అధికం చేస్తోంది.

1971 జనాభా లెక్కల ప్రకారము భారత జనాభాలో 41.4 శాతము 0-14 సంవత్సరాల సముదాయంలోను, 53.4 శాతం ప్రజలు పనిచేసే వయస్సయిన 15-60 సముదాయంలోను, 5.2 శాతం ప్రజలు మాత్రం 60 - పై వయస్సు సముదాయంలోను వున్నారు. అంటే భారతదేశ జనాభాలో పిల్లలు అభివృద్ధి చెందిన దేశాల జనాభాలలోని పిల్లలకంటె ఎక్కువ అనుపాతంలో వున్నారు. ఈ పరిస్థితుల్లో జనుల నిర్భరతాభారము హెచ్చుతుంది. అనుత్పాదక జనం అనుపాతం హెచ్చు కావడమే యిందుకు కారణము. జనాభా వృద్ధిరేటు హెచ్చుగా వున్నప్పుడే యిటువంటి అవాంఛనీయ స్థితి లభిస్తుంది. జనాభా వృద్ధిరేటు వేగం తగ్గుతూ పోతే ఈ నిర్భరతా భారం కూడా తగ్గుతూ పోతుంది. బహు తక్కువ వయస్సులోనివారి సంఖ్య బహు ఎక్కువైనపుడు, ఉత్పాదన వ్యతిరిక్తతా పరిస్థితి సంభవిస్తుంది. అంతేగాక హెచ్చు జీవనస్థాయిలో పోషణ-పిన్నవయస్కుల పెరుగుదలకు అవశ్యం కాబట్టి - కావలసి వస్తుంది. నిర్భరతా భారం హెచ్చుగా వుండటం అల్పాభివృద్ధి సమాజంలో కానవచ్చే ప్రత్యేక లక్షణమని చెప్పవచ్చు.

అల్ప తలసరి ఆదాయం, స్వల్ప ఆహార భోజనము, సంతులితాహారలోపము, నివాసయోగ్యంకాని గృహవసతి, అతితక్కువ జీవన స్థాయి పరిస్థితులు - అన్నీ కలిసి ఆరోగ్యాన్ని తగ్గు స్థితిలో వుంచడం వల్ల, తక్కువ జీవితకాల దృగ్గోచరం, హెచ్చైన శిశుమరణరేట్లు స్థితి మనముందు స్పష్టంగా తిరుగాడుతున్నవి.

అల్ప తలసరి ఆదాయంతో జననకాలంలో, సంభావ్య జీవిత కాలంగా ఎంచబడిన వయస్సుకు, హెచ్చైన శిశుమరణరేట్ల స్థితి మన ముందు స్పష్టంగా తిరుగాడుతున్నవి.

అల్ప తలసరి ఆదాయంతో జననకాలంలో, సంభావ్య జీవిత కాలంగా ఎంచబడిన వయస్సుకు, హెచ్చైన శిశు మరణరేటుకు గల సంబంధిమొక ప్రత్యేక జనాభా సంబంధ లక్షణము. పట్టిక-9లో యిచ్చిన గణాంకాలీ ప్రత్యేక సంబంధాన్ని ప్రస్ఫుటం చేస్తున్నవి. తక్కువ తలసరి ఆదాయంవల్ల కల్గిన బీదరికం, పోషణలోపాన్ని కలుగజేయగా జననకాలంలో సంభావ్యంగా ఎంచిన జీవనకాలము, తక్కువగాను, శిశుమరణాలరేటు హెచ్చుగాను వుంటాయి. సంభావ్య జీవితకాలాన్ని లైఫ్ ఎక్స్‌పెక్టెన్సీ ఎట్ బర్త్ అని ఆంగ్లంలో అంటారు.

పట్టిక - 9

## తలసరి ఆదాయం, సంభావ్య జీవితకాలం, శిశు మరణాలు - ఎంపిక చేసిన దేశాల్లో—

| దేశం | అమెరికా డాలర్లలో తలసరి ఆదాయం (1979) | కాలం జనన సమయం నుండి (1979) | శిశు మరణాలు వెయ్యి జననాలకు (1978) |
|---|---|---|---|
| 1. అమెరికా | 10,630 | 74 | 14 |
| 2. స్విట్జర్లెండ్ | 13,920 | 76 | 10 |
| 3. కెనడా | 9,640 | 74 | 12 |
| 4. డెన్‌మార్క్ | 11,900 | 75 | 9 |
| 5. పశ్చిమజర్మనీ | 11,730 | 73 | 16 |
| 6. ఇంగ్లండు | 6,320 | 73 | 14 |
| 7. ఫ్రాన్సు | 9,950 | 74 | 11 |
| 8. జపాన్ | 8,810 | 76 | 9 |
| 9. ఇండియా | 190 | 52 | 125 |

మూలము : ప్రపంచబ్యాంకు, వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు, 1981 నుండి గ్రహించిన గణాంకాలతో నిర్మించబడినది.

**అల్పాభివృద్ధి సంబంధిత సాంఘిక - ఆర్థిక సంకేతాల లక్షణాలు :**

తలసరి దూది వినియోగం, వెయ్యిమంది జనాభాలో మోటారు కార్లు, టెలిఫోన్లు, రేడియోలు, టెలివిజన్లు, సబ్బు మొదలైనవి లభ్యమయ్యేవారి సంఖ్య, వార్తాపత్రికల సంఖ్య, వాటి ప్రతుల ముద్రణ సంఖ్య, వాటి పఠనము, ఎంతమంది ప్రజలకు ఒకో డాక్టరున్నాడు. మొదలైన సాంఘిక-ఆర్థిక సంకేతాలవల్ల కూడా అల్పాభివృద్ధి స్థితి విదితమౌతుంది. జీవన ప్రమాణానికి సంబంధించిన యీ సాంఘిక-ఆర్థిక సంకేతాల విషయంలో అభివృద్ధి చెందిన దేశాలకంటె భారత దేశం చాలా వెనుకబడి వున్నదని పట్టిక-10 చూపుతున్న గణాంక వివరాలు తెలియజేస్తున్నవి.

పట్టిక - 10

## 1972లో ఎంపిక చేసిన దేశాలలో జీవన ప్రమాణ సంబంధిత సాంఘిక-ఆర్థిక సంకేతాలు

| దేశము | తలసరి దూది వినియోగం కిలోగ్రాములు | వెయ్యిమందికి వార్తాపత్రికల సర్క్యులేషన్ | ఒకో డాక్టరుకు ప్రజల సంఖ్య | వెయ్యిమందికి ఒకో ఉన్నత విద్యాసంస్థలో విద్యార్థులు | వెయ్యిమందికి మోటారు వాహనాల సంఖ్య | వెయ్యిమందికి టెలిఫోన్ల సంఖ్య | వెయ్యి మందికి రేడియోల సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| 1. అమెరికా సం. రా. | 8.1 | 297 | 634 | 52 | 560 | 628 | 1695 |
| 2. ఇంగ్లండు | 2.5 | 528 | 789 | 11 | 262 | 314 | 672 |
| 3. కెనడా | 3.4 | 230 | 662 | 22 | 433 | 499 | 821 |
| 4. ఆస్ట్రేలియా | 2.3 | 321 | 792 | 14 | 409 | 340 | 213 |
| 5. పశ్చిమ జర్మనీ | 3.8 | 319 | 561 | 13 | 271 | 268 | 329 |
| 6. ఫ్రాన్సు | 4.5 | 237 | 721 | 16 | 316 | 199 | 329 |
| 7. సోవియట్ రష్యా | 7.9 | 347 | 421 | 24 | లభ్యం కాలేదు | 53 | 404 |
| 8. జపాన్ | 7.1 | 519 | 781 | 16 | 207 | 315 | 658 |
| 9. ఇండియా | 2.2 | 16 | 479 | 4 | 2 | 3 | 23 |

మూలము : ఇండియా, పాకెట్ బుక్ ఆఫ్ ఎకనామిక్ ఇన్ఫర్మేషన్, 1973, 1974

### బలహీనంగా వున్న ఆర్థిక వ్యవస్థా సంఘటన :

భారతదేశ ఆర్థిక వ్యవస్థా సంఘటన బలహీనత మరొక ముఖ్య లక్షణము. ఆర్థికాభివృద్ధికి అవసరమైన కొన్ని సంస్థలు దాదాపు లేవు. మరికొన్ని తగినంతగా అభివృద్ధి చేయబడలేదు. పొదుపులను-ముఖ్యంగా గ్రామీణ పొదుపులను - సమీకరించడానికి తగినన్ని విత్త సంస్థలు లేవు. చిన్న రైతులు పెద్ద సంఖ్యలో వున్నారు. వారికి పరపతిని అందించే విత్త సంస్థలు చాలినన్ని లేవు. పరపతి, అవశ్యమైన పనులకు, సకాలంలో, తగినంతగా, యిబ్బందులు లేకుండా, లభ్యం కావడంలేదు. లభ్యమౌతున్న పరపతిమీద వడ్డీరేట్లు భరించ లేనివిగా వున్నవి. పరిశ్రమలకు దీర్ఘకాలీన, మాధ్యకాలీన పరపతులు యింకా సవ్యంగా అందడంలేదు. వ్యవసాయం చెయ్యని భూస్వాములు కౌలుదార్లను దోపిడి చేయడం ఆపడానికి తగిన శాసనాలు లేవు. ప్రజల ఉత్పాదక శక్తులు తగినట్లుగా కార్యరంగంలో ప్రవేశించి పని చేయడాని కవసరమైన స్వామ్య సంబంధిత వ్యవస్థా పద్ధతి అనుకూలంగా లేనందున, యీ పరిస్థితిని చక్కదిద్దవలసిన అవశ్యకత హెచ్చుగా వున్నది. ఈ ఆటంకాలను తొలగించడానికి నమ్మదగిన సమర్థవంతమైన పరిపాలనా యంత్రాంగాన్ని - ప్రస్తుత స్థితి అలా లేదు కాబట్టి - నిర్మించడం అత్యవసరము. విశ్వసించదగ్గ పరిపాలన లేకపోవడం బాధాకరమైన విషయం. నేర్పుగల పరిపాలకులు కూడా కొరతగా వున్నారు. ఈ లోపాలను తొలగించడం అత్యవసరం. ముప్పై సంవత్సరాల ప్రణాళికా నిర్వహణ అనంతరం కూడా భారత దేశం అల్పాభివృద్ధి సంకేతాలను దండిగా కలిగి వుండటం విచారకరమైన విషయం.

### భారతదేశ అల్పాభివృద్ధికి కారణాలు :

కొంతమంది ఆర్థికాభివృద్ధి స్థితిని, సహజ వనరుల ఉనికి దృష్టితో అంచనా వేస్తారు. అభివృద్ధి చెందిన దేశాలన్నింటా సహజ వనరులు పుష్కలంగా వున్నట్లు చెబుతారు. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో సహజ వనరులు దండిగానే వున్నవి. అవి తగనరీతిలో ఉపయోగించబడటంవల్ల అభివృద్ధి జరిగిందని మరచిపోకూడదు.

దక్షిణ అమెరికా, ఆఫ్రికా దేశాలలో కూడా సహజవనరులు నిండుగానే వున్నవి. కాని అవి తగినట్లుగా ఉపయోగించబడలేదు. అందువల్ల అవి అల్పాభివృద్ధి దేశాలుగానే మిగిలిపోయి వున్నవి.

కాని అభివృద్ధి చెందిన పశ్చిమ యూరోపు దేశాల్లో సారవంతమైన భూమి పరిమితంగానే వున్నది. వారి ఖనిజలోహ వనరులు స్వల్పము. అయినా వారి ఆర్థిక పురోభివృద్ధి అత్యంత ఉన్నతస్థాయిని చేరుకుంది. ఉన్న వనరులను తగినట్లు ఉపయోగించబడటంతో అభివృద్ధి చేకూరింది.

జపాన్ సహజ వనరులు బహు తక్కువ. అయినప్పటికి జపాన్ అద్భుతమైన ఆర్థిక ప్రగతిని సాధించి, ప్రపంచంలో అత్యున్నత

సాంద్రత 85 మాత్రమే. హెచ్చు జనసాంద్రత భూమిపైన, ఇతర సహజవనరులపైనా జనపోషణ భారాన్ని అధికం చేస్తోంది.

1971 జనాభా లెక్కల ప్రకారము భారత జనాభాలో 41.4 శాతము 0-14 సంవత్సరాల సముదాయంలోను, 53.4 శాతం ప్రజలు పనిచేసే వయస్సయిన 15-60 సముదాయంలోను, 5.2 శాతం ప్రజలు మాత్రం 60-పై వయస్సు సముదాయంలోను వున్నారు. అంటే భారతదేశ జనాభాలో పిల్లలు అభివృద్ధి చెందిన దేశాల జనాభాలలోని పిల్లలకంటె ఎక్కువ అనుపాతంలో వున్నారు. ఈ పరిస్థితుల్లో జనుల నిర్భరతాభారము హెచ్చుతుంది. అనుత్పాదక జనం అనుపాతం హెచ్చు కావడమే యిందుకు కారణము. జనాభా వృద్ధిరేటు హెచ్చుగా వున్నప్పుడే యిటువంటి అవాంఛనీయ స్థితి లభిస్తుంది. జనాభా వృద్ధిరేటు వేగం తగ్గుతూ పోతే ఈ నిర్భరతా భారం కూడా తగ్గుతూ పోతుంది. బహు తక్కువ వయస్సులోనివారి సంఖ్య బహు ఎక్కువైనపుడు, ఉత్పాదన వ్యతిరిక్తతా పరిస్థితి సంభవిస్తుంది. అంతేగాక హెచ్చు జీవనస్థాయిలో పోషణ-పిన్నవయస్కుల పెరుగుదలకు అవశ్యం కాబట్టి - కావలసి వస్తుంది. నిర్భరతా భారం హెచ్చుగా వుండటం అల్పాభివృద్ధి సమాజంలో కానవచ్చే ప్రత్యేక లక్షణమని చెప్పవచ్చు.

అల్ప తలసరి ఆదాయం, స్వల్ప ఆహార భోజనము, సంతులితాహారలోపము, నివాసయోగ్యంకాని గృహవసతి, అతితక్కువ జీవన స్థాయి పరిస్థితులు - అన్నీ కలిసి ఆరోగ్యాన్ని తగ్గు స్థితిలో వుంచడం వల్ల, తక్కువ జీవితకాల దృగ్గోచరం, హెచ్చైన శిశుమరణరేట్లు స్థితి మనముందు స్పష్టంగా తిరుగాడుతున్నవి.

అల్ప తలసరి ఆదాయంతో జననకాలంలో, సంభావ్య జీవిత కాలంగా ఎంచబడిన వయస్సుకు, హెచ్చైన శిశుమరణరేట్ల స్థితి మన ముందు స్పష్టంగా తిరుగాడుతున్నవి.

అల్ప తలసరి ఆదాయంతో జననకాలంలో, సంభావ్య జీవిత కాలంగా ఎంచబడిన వయస్సుకు, హెచ్చైన శిశు మరణరేటుకు గల సంబంధమొక ప్రత్యేక జనాభా సంబంధ లక్షణము. పట్టిక-9లో యిచ్చిన గణాంకాలీ ప్రత్యేక సంబంధాన్ని ప్రస్ఫుటం చేస్తున్నవి. తక్కువ తలసరి ఆదాయంవల్ల కల్గిన బీదరికం, పోషణలోపాన్ని కలుగజేయగా జననకాలంలో సంభావ్యంగా ఎంచిన జీవనకాలము, తక్కువగాను, శిశుమరణాలరేటు హెచ్చుగాను వుంటాయి. సంభావ్య జీవితకాలాన్ని లైఫ్ ఎక్స్‌పెక్టెన్సీ ఎట్ బర్త్ అని ఆంగ్లంలో అంటారు.

పట్టిక - 9

## తలసరి ఆదాయం, సంభావ్య జీవితకాలం, శిశు మరణాలు - ఎంపిక చేసిన దేశాల్లో

| దేశం | అమెరికా డాలర్లలో తలసరి ఆదాయం (1979) | కాలం జనన సమయం నుండి (1979) | శిశు మరణాలు వెయ్యి జననాలకు (1978) |
|---|---|---|---|
| 1. అమెరికా | 10,630 | 74 | 14 |
| 2. స్విట్జర్లెండ్ | 13,920 | 76 | 10 |
| 3. కెనడా | 9,640 | 74 | 12 |
| 4. డెన్‌మార్క్ | 11,900 | 75 | 9 |
| 5. పశ్చిమజర్మనీ | 11,730 | 73 | 16 |
| 6. ఇంగ్లండు | 6,320 | 73 | 14 |
| 7. ఫ్రాన్సు | 9,950 | 74 | 11 |
| 8. జపాన్ | 8,810 | 76 | 9 |
| 9. ఇండియా | 190 | 52 | 125 |

మూలము : ప్రపంచబ్యాంకు, వరల్డ్ డెవలప్‌మెంట్ రిపోర్టు, 1981 నుండి గ్రహించిన గణాంకాలతో నిర్మించబడినది.

అల్పాభివృద్ధి సంబంధిత సాంఘిక - ఆర్థిక సంకేతాల లక్షణాలు :

తలసరి దూది వినియోగం, వెయ్యిమంది జనాభాలో మోటారు కార్లు, టెలిఫోన్లు, రేడియోలు, టెలివిజన్లు, సబ్బు మొదలైనవి లభ్యమయ్యేవారి సంఖ్య, వార్తాపత్రికల సంఖ్య, వాటి ప్రతుల ముద్రణ సంఖ్య, వాటి పఠనము, ఎంతమంది ప్రజలకు ఒకో డాక్టరున్నాడు మొదలైన సాంఘిక-ఆర్థిక సంకేతాలవల్ల కూడా అల్పాభివృద్ధి స్థితి విదితమౌతుంది. జీవన ప్రమాణానికి సంబంధించిన యీ సాంఘిక-ఆర్థిక సంకేతాల విషయంలో అభివృద్ధి చెందిన దేశాలకంటె భారతదేశం చాలా వెనుకబడి వున్నదని పట్టిక-10 చూపుతున్న గణాంక వివరాలు తెలియజేస్తున్నవి.

పట్టిక - 10

## 1972లో ఎంపిక చేసిన దేశాలలో జీవన ప్రమాణ సంబంధిత సాంఘిక-ఆర్థిక సంకేతాలు

| దేశము | తలసరి దూది వినియోగం కిలోగ్రాములు | వెయ్యిమందికి వార్తాపత్రికల సర్క్యులేషన్ | ఒకో డాక్టరుకు ప్రజల సంఖ్య | వెయ్యిమందికి ఒకో ఉన్నత విద్యాసంస్థలో విద్యార్థులు | వెయ్యిమందికి మోటారు వాహనాల సంఖ్య | వెయ్యిమందికి టెలిఫోన్ల సంఖ్య | వెయ్యి మందికి రేడియోల సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| 1. అమెరికా సం. రా. | 8.1 | 297 | 634 | 52 | 560 | 628 | 1695 |
| 2. ఇంగ్లండు | 2.5 | 528 | 789 | 11 | 262 | 314 | 672 |
| 3. కెనడా | 3.4 | 230 | 662 | 22 | 433 | 499 | 821 |
| 4. ఆస్ట్రేలియా | 2.3 | 321 | 792 | 14 | 409 | 340 | 213 |
| 5. పశ్చిమ జర్మనీ | 3.8 | 319 | 561 | 13 | 271 | 268 | 329 |
| 6. ఫ్రాన్సు | 4.5 | 237 | 721 | 16 | 316 | 199 | 329 |
| 7. సోవియట్ రష్యా | 7.9 | 347 | 421 | 24 | లభ్యం కాలేదు | 53 | 404 |
| 8. జపాన్ | 7.1 | 519 | 781 | 16 | 207 | 315 | 658 |
| 9. ఇండియా | 2.2 | 16 | 479 | 4 | 2 | 3 | 23 |

మూలము : ఇండియా, పాకెట్ బుక్ ఆఫ్ ఎకనామిక్ ఇన్ఫర్మేషన్, 1973, 1974

**బలహీనంగా వున్న ఆర్థిక వ్యవస్థా సంఘటన :**

భారతదేశ ఆర్థిక వ్యవస్థా సంఘటన బలహీనత మరొక ముఖ్య లక్షణము. ఆర్థికాభివృద్ధికి అవసరమైన కొన్ని సంస్థలు దాదాపు లేవు. మరికొన్ని తగినంతగా అభివృద్ధి చేయబడలేదు. పొదుపులను-ముఖ్యంగా గ్రామీణ పొదుపులను - సమీకరించడానికి తగినన్ని విత్త సంస్థలు లేవు. చిన్న రైతులు పెద్ద సంఖ్యలో వున్నారు. వారికి పరపతిని అందించే విత్త సంస్థలు చాలినన్ని లేవు. పరపతి, అవశ్యమైన పనులకు, సకాలంలో, తగినంతగా, యిబ్బందులు లేకుండా, లభ్యం కావడంలేదు. లభ్యమౌతున్న పరపతిమీద వడ్డీరేట్లు భరించ లేనివిగా వున్నవి. పరిశ్రమలకు దీర్ఘకాలీన, మాధ్యకాలీన పరపతులు యింకా సవ్యంగా అందడంలేదు. వ్యవసాయం చెయ్యని భూస్వాములు కౌలుదార్లను దోపిడి చేయడం ఆపడానికి తగిన శాసనాలు ప్రజల ఉత్పాదక శక్తులు తగినట్లుగా కార్యరంగంలో ప్రవేశించి పని చేయడాని కవసరమైన స్వామ్య సంబంధిత వ్యవస్థా పద్ధతి అనుకూలంగా లేనందున, యీ పరిస్థితిని చక్కదిద్దవలసిన అవశ్యకత హెచ్చుగా వున్నది. ఈ అటంకాలను తొలగించడానికి సమ్మదగిన సమర్థవంతమైన పరిపాలనా యంత్రాంగాన్ని - ప్రస్తుత స్థితి అలా లేదు కాబట్టి - నిర్మించడం అత్యవసరము. విశ్వసించదగ్గ పరిపాలన లేకపోవడం బాధాకరమైన విషయం. నేర్పుగల పరిపాలకులు కూడా కొరతగా వున్నారు. ఈ లోపాలను తొలగించడం అత్యవసరం. ముప్పై సంవత్సరాల ప్రణాళికా నిర్వహణ అనంతరం కూడా భారత దేశం అల్పాభివృద్ధి సంకేతాలను దండిగా కలిగి వుండటం విచారకరమైన విషయం.

**భారతదేశ అల్పాభివృద్ధికి కారణాలు :**

కొంతమంది ఆర్థికాభివృద్ధి స్థితిని, సహజ వనరుల ఉనికి దృష్టితో అంచనా వేస్తారు. అభివృద్ధి చెందిన దేశాలన్నిటా సహజ వనరులు పుష్కలంగా వున్నట్లు చెబుతారు. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో సహజ వనరులు దండిగానే వున్నవి. అవి తగినరీతిలో ఉపయోగించబడటంవల్ల అభివృద్ధి జరిగిందని మరచిపోకూడదు.

దక్షిణ అమెరికా, ఆఫ్రికా దేశాలలో కూడా సహజవనరులు నిండుగానే వున్నవి. కాని అవి తగినట్లుగా ఉపయోగించబడలేదు. అందువల్ల అవి అల్పాభివృద్ధి దేశాలుగానే మిగిలిపోయి వున్నవి.

కాని అభివృద్ధి చెందిన పశ్చిమ యూరోపా దేశాల్లో సారవంతమైన భూమి పరిమితంగానే వున్నది. వారి ఖనిజలోహ వనరులు స్వల్పము. అయినా వారి ఆర్థిక పురోభివృద్ధి అత్యంత ఉన్నతస్థాయిని చేరుకుంది. ఉన్న వనరులను తగినట్లు ఉపయోగించబడటంతో అభివృద్ధి చేకూరింది.

జపాన్ సహజ వనరులు బహు తక్కువ. అయినప్పటికి జపాన్ అద్భుతమైన ఆర్థిక ప్రగతిని సాధించి, ప్రపంచంలో అత్యున్నత

ఆర్థికాభివృద్ధిని సాధించిన దేశాల పంక్తిలో గౌరవప్రదమైన స్థానాన్ని అలంకరిస్తోంది.

అందువల్ల సహజ వనరులున్నంతనే ఆర్థికాభివృద్ధి ఏర్పడుతుందంటే పొరపాటు. వాటిని తగినంతగా, తగినట్లు ఉపయోగించాలి. అప్పుడే ఆర్థికవృద్ధి అందుతుంది.

భారతదేశంలో అపారమైన సహజ వనరులున్నై. ఇందులో చాలా వనరులు ఉపయోగించబడలేదు. కొన్ని తక్కువగాను, మరి కొన్ని తగనిరీతిలోను ఉపయోగించబడినవి. చాలాకాలంనుండి యీ అవాంఛనీయ స్థితి కొనసాగుతూ వుంది. అందువల్లనే యిప్పటికి కూడా, భారతదేశ ఆర్థిక వ్యవస్థలో అనేక అల్పాభివృద్ధి చిహ్నాలు కన్పిస్తున్నై.

రాజకీయ కారకాలు :

రాజకీయ కార్యకర్తలు, ముఖ్యంగా వామపక్షీయులు— సామ్రాజ్యవాదుల వలస పాలన, ఆర్థికదోపిడి, అల్పాభివృద్ధి దేశాలలోని వెనుకబడినతనానికి కారణమని గట్టిగా చెబుతున్నారు. బ్రిటిషు వారి హయాంలో బలమైన ప్రభుత్వము, స్థిమితం గల పరిపాలన ఏర్పడినవి. శాంతి కూడా ఏర్పడిందనీ ఒకవిధంగా చెప్పవచ్చు. అయితే భారతదేశాన్ని ఆర్థికంగా అభివృద్ధి చేయడానికి బ్రిటిషువారు శ్రద్ధ చూపలేదు. ఈ దిశలో వారి ప్రయత్నాలు బహు అల్పమని చెప్పవచ్చు. ఆర్థిక లాభాలను, అదనపు విలువలను, మిగుళ్ళను, బ్రిటిషువారు భారతదేశంనుండి ఇంగ్లండుకు ప్రవహింపజేసారు. (దీన్నే ఆంగ్లంలో డ్రెయిన్‌థీరీ అని అంటారు. అనగా మన దేశ ఆర్థిక కార్యకలాపాలలో వచ్చిన లాభాలను ఇంగ్లండుకు పంపి భారత దేశాన్ని ఖాళీ చేసారు.)

ఏ దేశమైనా తన లాభాలను, మిగుళ్ళను ఆర్థికాభివృద్ధిని పురోగమింపజేయడానికి నూతన పెట్టుబడిగా వుపయోగిస్తుంది. కాని బ్రిటిషువారీ లాభాలను ఇంగ్లండుకు పంపించివేస్తూ వుండేవారు. బ్రిటిషు ఉద్యోగులకు జీతాలు, పెన్షన్లు చెల్లించడానికి - అనగా ఇండియాలోని బ్రిటిషు పాలనలో ఉద్యోగులుగా పనిచేసినవారికి చెల్లించడానికి - యీ భారత ఆర్థిక కార్యకలాపాల లాభాలు ఉపయోగించబడినవి. ఇండియాలో, తమకు లాభసాటిగా వుండే షరతుల మీద వ్యాపారం చేసి, తత్ఫలితంగా వచ్చిన లాభాలను కూడా ఇంగ్లండుకు మరల్చారు. భారతదేశంలో బ్రిటిషువారు పెట్టిన పెట్టుబడికి పెద్దరేటున వడ్డీలు, లాభాలు అందించి ఇంగ్లండుకు వాటిని పంపారు. ఇంగ్లండులో పనిచేసే పరిశ్రమలకు పోటీ కాగలవని తలంచిన పరిశ్రమలను ఇండియాలో స్థాపించనివ్వలేదు. అందువల్ల వలసరాజ్య విధానము, సామ్రాజ్యవాద బ్రిటిషు పరిపాలన భారతదేశ అల్పాభివృద్ధికి చాలకాలము ప్రధాన కారణాలైనవి. ఈ పారతంత్ర్య దశలో భారతదేశంలో బాధ్యత కల్గి, ఆర్థికాభివృద్ధికి పనిచేసే జాతీయ ప్రభుత్వం — స్వరాజ్యం — భారతదేశానికి లేకపోవడము భారతదేశ ఆర్థికాభివృద్ధిని 1947 వరకు అటకాయించిందని చెప్పవచ్చు.

ఆర్థిక కారకాలు :

శ్రామిక, మూలధన కారకాలను వివేకపూర్వకంగా జతచేసి, సహజ వనరులను ఉపయోగించినట్లయితే తగిన ఆర్థికవృద్ధి లభ్యమౌతుంది. మూలధన లోపం భారతదేశం ఆర్థికంగా వెనుకబడి వుండటానికి చాలవరకు కారణము. మూలధన వస్తువులు పూర్తిగా కనిష్ఠ స్థితిలో వున్నవి. అంటే అవి అత్యవసర వస్తువుల్ని తయారు చేయడానికి కూడా సరిపోవడం లేదు. శ్రామికులచేత పని చేయించడానికి కావలసిన మూలధన వస్తువులు కూడా పూర్తిగా కనిష్ఠ స్థితిలో వున్నయ్యి. ఇందువల్ల ప్రచ్ఛన్న నిరుద్యోగిత (తక్కువకాలం, తక్కువ రోజులు, తక్కువ గంటలు, తక్కువ పనిచేయడం) ఎక్కువగానే వున్నది. నిజానికి ఉపయోగించబడటానికి వీలైన మూలధనం చెప్పేదానికంటె ఎక్కువగానే వున్నది. అయితే ఇందులో చాలా భాగం అనుత్పాదక భూమిమీద ప్రయోగించబడుతున్నది. అంతగ అవసరంగాని భవనాల నిర్మాణంమీద ఉపయోగించబడుతోంది. నగదు, నగల రూపంలో దాచివుంచబడుతోంది. ఆర్థికాభివృద్ధి దృష్టితో చూస్తే ఆ విధంగా అపసవ్య మార్గంలో ఉపయోగించబడిన మూలధనము వ్యర్థీకృతము, నిరుపయోగము అవుతుంది. అందువల్ల మూలధన కొరత కూడా భారతదేశం వెనుకబడి వుండటానికి ఒక ప్రధాన కారణమౌతోంది.

వ్యవసాయ, పారిశ్రామిక, సాంకేతిక రంగాలలో పాత సాంకేతిక జ్ఞానం ఉపయోగించబడటం కూడా భారతదేశపు వెనుకబడినతనానికి మరొక ముఖ్య కారణము. ఉత్పత్తి ఖర్చులు హెచ్చుగా వుండటము, హెచ్చు అనుపాతంలో శ్రామికులు పనిచేయడము, తక్కువ అనుపాతంలో మూలధనం ఉపయోగించబడటము యిక్కడ చెప్పిన రంగాలలో పాత సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించడాన్ని తెలియజేస్తున్నాము. ఈ పాత సాంకేతిక పద్ధతులతో పనిచేస్తున్న శ్రామికులు, మూలధనము సాధారణంగా తక్కువ ఉత్పాదకతనే చూపించుతున్నవి. అయినప్పటికి కూడా, యింకా చాలామంది నైపుణి లేని శ్రామికులు పనిలేకుండా మిగిలిపోయి వున్నారు. అందువల్ల ఆర్థికంగా వెనుకబడినతనం వుండటానికి సాంకేతిక విజ్ఞానపు వెనుకబడినతనం కారణం కాగా ఆర్థిక వెనుకబడినతనం సాంకేతిక విజ్ఞానపు వెనుకబడినతనానికి భారతదేశంలో కారణమయ్యిందని వాదించడానికి వీలు కల్గుతోంది. నష్టాలను భరిస్తూ నూతన ఆర్థిక కార్యకలాపాలను నిర్వహించే ఆర్థిక ఉద్యమదారులు కరువైనందునే స్వాతంత్ర్యపూర్వ భారతదేశంలో ఆర్థికాభివృద్ధి వేగంగా జరగలేదని చాలమంది ఆర్థిక శాస్త్రజ్ఞులన్నారు.

ఉత్పాదకత, వాస్తవ ఆదాయాలు, పెరగడానికి ఉద్యమదారే చాల వరకు బాధ్యుడౌతాడు. 19వ శతాబ్దంలో జరిగిన ఇంగ్లండు ఆర్థికాభివృద్ధికి, 19, 20 శతాబ్దాల్లో జరిగిన అమెరికా సంయుక్త రాష్ట్రాల ఆర్థికాభివృద్ధికి - పెద్దఎత్తున లాభాలు సమకూర్చగల యంత్రాలు మొదలైనవాటిని పరిశ్రమలలో ప్రవేశపెట్టి, కార్యనిర్వహణ చేసిన పారిశ్రామిక నాయకులే కారణము. అయితే స్వాతంత్ర్య పూర్వపు- వెనుకబడిన భారతదేశంలో - షుంపీటర్ చెప్పిన ఉద్యమదారుడు కావలసినచోటనెల్లా లభ్యం కాలేదు. నేటి అభివృద్ధి చెందిన దేశాలలో అభివృద్ధి నిర్మాణానికానాడు సాహసవంతులైన నిర్మాతలను అందించిన బలమైన మధ్యతరగతి-భారతదేశంలో ప్రబలనూ లేదు; రంగప్రవేశమూ చేయలేదు. లభ్యమైన ఉద్యమ మేధావులు జాతీయ, అంతర్జాతీయ వ్యాపారంలోని కొన్ని శాఖల్లో ప్రవేశించారు. వర్తక వ్యాపారాలకు మంచి ఆర్జన నివ్వగల శక్తి వుంది. వాటికి ద్రవ్యత్వాన్నివ్వగల శక్తి కూడా ఉన్నది. అందువల్లనే చాలమంది వర్తక రంగంలోకి దూకారు. పైగా ప్రాథమిక (వ్యవసాయ, ద్వితీయ (పరిశ్రమలు) రంగ ఉత్పత్తుల నిర్వహణ కష్టంతో కూడిన పని. వీటిలో నష్టప్రాప్తి సంభావ్యత కూడా ఉన్నది. అందువల్ల వెనుకబడిన దేశాల వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో తమ కనుకూలమైన శాఖల్లో పెట్టుబడి చేయడానికి విదేశీ ఆర్థిక ఉద్యమదారులు ప్రవేశించారు. ఆర్థిక అభివృద్ధి నిర్వహణ అత్యంత ప్రాథమికదశలో భారతదేశంలో జరిగిన కథ అలా వుందే.

బ్రిటిషు, భారతీయ ఉద్యమదారుల మధ్య జరిగిన నిర్విరామ పోటీలో భారతీయ ఉద్యమదారులు వెనుకబడిపోయి బ్రిటిషువారికి గుత్తాధిపత్యం గల రంగాలలో పెట్టుబడి చేయలేకపోయారు. భారతదేశంలోని బ్రిటిషు పెట్టుబడికి భారతదేశంలోని బ్రిటిషు పాలన చేదోడుగా నిల్చింది. బ్రిటిషు పెట్టుబడివారులు వ్యాపార పోటీలో భారతీయులకంటె తక్కువ ధరలకు అమ్మి భారతీయ ఉద్యమదారుల్ని పారిశ్రామిక రంగంనుండి బయటకు వెళ్ళిపోయేట్లు చేసారు. ఈ విధంగా తమకు లాభసాటిగా వుండే పారిశ్రామిక శాఖలను బ్రిటిషు ఉద్యమదారులు అనుచితంగా ఆక్రమించారు. అందువల్ల బ్రిటిషు పెట్టుబడిదారుల కభిరుచిలేని పారిశ్రామిక శాఖల్లో భారతీయ ఉద్యమదారులు ప్రవేశించారు, అలా కాకపోతే తక్షణం లాభాలు సమకూర్చే వర్తక వ్యాపారాల్లోకి భారతీయ పెట్టుబడిదారులు ప్రవేశించారు.

భారతదేశం ఆర్థికంగా వెనుకబడి వుండటానికి కొన్ని సంస్థాగత లోపాలు కూడా కారణం. గత రెండు శతాబ్దాల్లోను బ్రిటిషు, అమెరికన్ ఆర్థికాభివృద్ధి నిర్వహణలకు ఆయా దేశాల బ్యాంకింగు సంస్థలు ఆర్థిక స్తోమతు నిచ్చినయ్యి. భారతదేశ బ్యాంకింగు వ్యవస్థ యింకా పరిపూర్ణతను సంతరించుకోలేదు. ఐరోపా ఆర్థికాభివృద్ధికి కీలక విత్తసహాయ మందించిన బ్యాంకులంతగా, భారతదేశంలో గ్రామీణ, పారిశ్రామిక బ్యాంకులు అభివృద్ధి చెందలేదు. పైగా ఐరోపాలో అభివృద్ధి చెందినట్లు భారతదేశంలో మూలధన విపణివీధి అభివృద్ధి చెందలేదు. పారిశ్రామిక విత్త కార్పోరేషన్లు, యూనిట్ ట్రస్టులు. ఇన్సూరెన్సు కంపెనీలు భారతదేశంలో చాల తక్కువ. వాటివల్ల తక్కువ మూలధనం సమకూరుతోంది. ద్రవ్య, విత్త వ్యవస్థాపన భారతదేశంలో బలహీనంగా వున్నందువల్ల, మూలధన సమీకరణ, ఉచితరీతి పెట్టుబడి కష్టసాధ్యంగా వున్నవి. బ్యాంకింగు వసతులు, విత్తలభ్యతా వసతులు రవాణా, కమ్యూనికేషన్, విద్యుచ్ఛక్తి లభ్యతా సౌకర్యాలు మొదలైనవి కొరవడిన కారణంగా కూడా భారతీయ ఆర్థికాభివృద్ధి ప్రక్రియ యింకా కూడా వెనుకంజ వేసిన స్థితిలోనే వున్నది.

సాంఘిక కారకాలు :

ఆర్థిక కారకాలను, కొన్ని ఆర్థికేతర కారకాలు ప్రభావితం చేస్తాయి. సాంఘిక కారకాలు కూడా యిలా ప్రభావితం చేస్తాయి. ఉత్పత్తికారకాలు, ఆ కారకాల ప్రయోగతా సామర్థ్యస్థాయి, వివిధ ఆర్థికకార్య రంగాలకు కారకాల కేటాయింపు యిలా ప్రభావితమయ్యే వాటిల్లో వున్నవి. కొన్ని సమయాల్లో యిలా ఆర్థిక కారకాలను ప్రభావితం చేసే సాంఘిక కారకాలు కొన్ని సమయాల్లో ఆర్థికాభివృద్ధికి తోడ్పడుతూ, మరికొన్ని సమయాల్లో ఆర్థికప్రగతికి ఆటంకాలౌతాయి.

రైతు తన భూమికి ముడిపెట్టుకుని బ్రతుకులాడు. అందువల్ల అతడు తగినంతగా భౌగోళిక గమనశీలం గలవాడుగా వుండడు. శరీరశ్రమ చేయడం సాంఘికహోదాకు భిన్నంగా భావించబడుతోంది. అందువల్ల శరీరశ్రమ చేయవలసిన అవసరమున్న వృత్తుల్లోకి, పెద్ద కులాలహోదాను పాడుచేస్తాయని భావించబడే వృత్తుల్లోకి ప్రవేశించడానికి వ్యతిరేకత పనిచేస్తోంది. వైయక్తిక సాంఘిక గౌరవానికి సమాజంలో మంచి విలువ యివ్వబడుతూన్నందువల్ల, ఆదాయం, ఉత్పత్తి, ఖర్చులమీద దాని అప్రత్యక్ష ప్రభావం పనిచేస్తోంది.

పైన వివరించిన విషయాల తాత్పర్యాన్ని సంక్షిప్తంగా చెప్పాలంటే - రాజకీయ, ఆర్థిక, సాంఘిక కారకాల లోపం ప్రభావంవల్ల భారతదేశం ఆర్థికంగా వెనుకబడినతనంలో వున్నది. అయితే జాతీయ ప్రభుత్వ - స్వరాజ్య - స్థాపనవల్ల ఆర్థిక పురోగమన పథంనుండి ఒక పెద్ద అడ్డంకి తొలగిపోయింది. అయినా స్వాతంత్ర్యానంతర భారతదేశ ఆర్థికాభివృద్ధి యింకా సంతృప్తికరంగా సాగడం లేదు. కాని 20వ శతాబ్దంలో బ్రిటిషు పాలనక్రింద లభ్యమైన ఆర్థికాభివృద్ధికంటే అనేకరెట్లు మెరుగుగా వున్నదనే విషయం సత్యం. భారత ప్రభుత్వ కృషే ఇందుకు కారణం. అందుచేత, ఆర్థికవృద్ధిని

ప్రభావితం చేసే కారకాలలో, రాజ్యాంగయంత్రం పాత్ర, యిప్పటి పరిస్థితుల మధ్య, ఏకైక ప్రబలకారకంగా పనిచేస్తోందని చెప్పవలసి ఉంటుంది.

## అభివృద్ధి ప్రక్రియా ప్రవాహంలో ఎదురయ్యే సమస్యలు:

అల్పాభివృద్ధితో వెనుకబడిన భారతదేశం 1947 ఆగష్టు 15వ తేదీన రాజకీయ స్వాతంత్ర్యం పొంది 1951 నుండి పంచవర్ష ఆర్థిక ప్రణాళికలను అమలుజరుపుతూన్నందువల్ల ఫలిస్తున్న ఆర్థికరంగం భారతదేశాన్ని అర్థశాస్త్ర సారస్వతంలో వర్ధమాన దేశంగా చేసింది. ఇంకాకూడా చాలమంది ప్రజలు దారిద్ర్య రేఖక్రింద వున్నారు. పి. డి. ఓఝా అంచనా ప్రకారం 1960-61లో గ్రామీణ రంగంలో 184 మిలియన్ల ప్రజలు (51.8 శాతం), పట్టణరంగంలో, 6 మిలియన్ల ప్రజలూ (7.6 శాతం); మొత్తం దేశంలో 190 మిలియన్ల ప్రజలూ (44 శాతం) బీదవారుగా వున్నారు. 1967-68లో పి. డి. ఓఝా అంచనా ప్రకారం గ్రామీణ రంగంలో 289 మిలియన్ల ప్రజలు (70 శాతం) దారిద్ర్యరేఖ క్రింద వున్నారు. అంటే గ్రామీణ దారిద్ర్యం పెరిగినట్లు చెప్పారు.

ఇ. పి. డబ్ల్యు. డాకోస్టా 1963-64లోని నేషనల్ సాంపుల్ సర్వే గణాంకాల ననుసరించి చేసిన అంచనా ప్రకారం 162 మిలియన్ల ప్రజలు దారిద్ర్యాన్ని 104 మిలియన్ల ప్రజలు అతి పేదరికాన్ని (దిక్కుమాలినతనము); 62 మిలియన్ల ప్రజలు అతి తీవ్ర పేదరికాన్ని (ఏమాత్రం కూడా దిక్కులేనితనము) అనుభవిస్తున్నారు.

వి. యమ్. డండేకర్, నీలకంఠరాత్‌లు, 1968 - 69లో గ్రామీణరంగం ప్రజల్లో 166 మిలియన్లు (40 శాతం); పట్టణరంగం ప్రజల్లో 49 మిలియన్లు (50 శాతానికి కొంచెం ఎక్కువ) దారిద్ర్యరేఖక్రింద వున్నట్లు వ్రాసారు. మొత్తం బీదప్రజలు 177 మిలియన్ల (1960-61) నుండి 215.5 మిలియన్ల (1968-69)కు పెరిగారు. అయితే గ్రామీణ, పట్టణ పేదల అనుపాతంలో మాత్రం మార్పు రాలేదు. 1960-61; 1968-69లో కూడా మొత్తం 41 శాతం మంది ప్రజలు బీదవారుగా వున్నారు.

పి. కె. బర్థన్ అంచనాల కనుసారంగా 1960 - 61లో 181.1 మిలియన్ల (38 శాతం) గ్రామీణ ప్రజలు, 1967-68లో 220.5 మిలియన్ల (53.0) గ్రామీణ ప్రజలు దారిద్ర్యంలో వున్నారు.

బి. యస్. మిన్హాస్ అంచనాల ప్రకారం గ్రామీణ రంగంలోని ప్రజల్లో 215 మిలియన్లు (65 శాతం), 1963-64లో 221 మిలియన్లు (57.8 శాతం); 1969-70లో 210 మిలియన్లు (50.6శాతం) దారిద్ర్యంలో వున్నారు. దారిద్ర్యం ఈ అంచనా ప్రకారం తగ్గుముఖం పట్టింది.

ఏడవ ఫైనాన్స్ కమిషన్ అంచనాల ప్రకారం 1970-71లో గ్రామీణ రంగంలోని ప్రజల్లో 225 మిలియన్లు (53 శాతం), పట్టణ రంగంలోని ప్రజల్లో 52 మిలియన్లు (51 శాతం), మొత్తం దేశ ప్రజల్లో 277 మిలియన్లు (52 శాతం) పేదరికంలో వున్నారు.

ఆరవ పంచవర్ష ప్రణాళిక (1978-83) అంచనాల ప్రకారం 1977-78లో గ్రామీణ ప్రజల్లో 238.6 మిలియన్లు (47.9 శాతం), పట్టణ ప్రజల్లో 55.2 మిలియన్లు (40.7 శాతము), మొత్తం దేశ ప్రజల్లో 293.6 మిలియన్లు (46.3 శాతం) పేదరికంలో వున్నారు.

పునఃరచించబడిన ఆరవ ప్రణాళిక (1980-85) ప్రకారం 1980-85లో గ్రామీణ ప్రజల్లో 259.6 (50.7 శాతం) మిలియన్లు, పట్టణ ప్రజల్లో 57.2 (40 శాతం) మిలియన్లు, మొత్తం దేశప్రజల్లో 316.8 (48.4 శాతం) మిలియన్లు పేదరికంలో వున్నారు. కాబట్టి దేశ ప్రజల్లో యింకా సగంమంది దారిద్ర్యంలో వున్నారు. కొన్ని అంచనాల ప్రకారం గ్రామాల్లోను, పట్టణాల్లోను పేదరికం ఒకే తీవ్రతలో వుండగా, మరికొన్ని అంచనాల ప్రకారం పట్టణాల్లోకంటె గ్రామాల్లో దారిద్ర్యం హెచ్చు తీవ్రంగా వున్నది. భారతదేశ పేదరికం తరుణ వ్యాధే కాదు. దీర్ఘవ్యాధి కూడా. దేశంలో ఉపయోగించబడని సహజ వనరులు దండిగా వున్నయ్యి. దేశ ఆర్థిక వ్యవస్థలో దారిద్ర్య విష వలయము, పవిత్ర భాగ్యవలయము ప్రక్కప్రక్కనే పనిచేస్తున్నవి. ఇందువల్ల దైన్యస్థితి స్థిరపడుతుంది. దారిద్ర్యాన్ని తొలగించడానికి చేపటిన ప్రయత్నాలు విఫలమౌతాయి? అందువల్ల అభివృద్ధి నిర్వహణలో ఎదురయ్యే సమస్యల్ని అర్థం చేసుకోవటం అవసరం. భారతదేశ ఆర్థికాభివృద్ధికి ఎదురౌతున్న సమస్యల నిచట పొందుపరుద్దాము :

## అల్ప తలసరి ఆదాయం : అల్ప ఆర్థికవృద్ధి రేటు :

కొన్ని దేశాల పరిస్థితులను మినహాయించితే, ప్రపంచ దేశాల తలసరి ఆదాయంలో భారతదేశ తలసరి ఆదాయం అట్టడుగున వున్నది. 1960లో భారతదేశ తలసరి ఆదాయానికి అమెరికా తలసరి ఆదాయం 36 రెట్లు, కెనడా తలసరి ఆదాయం 31 రెట్లు వున్నది. తరువాత 20 సంవత్సరాల్లో అభివృద్ధి చెందిన దేశాలు తమ తలసరి ఆదాయాన్ని చాలా వేగంగా పెంచుకున్నాయి. భారతదేశం మాత్రం నత్తనడకతో సాగుతోంది. తత్కారణంగా తలసరి ఆదాయాల్లో అభివృద్ధి చెందిన దేశాలకు, ఇండియాకు మధ్య వున్న వ్యత్యాసం ఇంకా బాగా విశాలమయ్యింది. ఇప్పుడు ఇండియా తీవ్రకృషితో అభివృద్ధి చెందిన దేశాల స్థితికి రాకపోతే ఎన్నో ప్రమాదాలు సంభవించగలవు.

**దారిద్ర్యరేఖక్రింద పెద్ద అనుపాతంలో ప్రజలు :**

సాధారణ ప్రజాబాహుళ్యాన్నంతటిని బాధపెడుతున్న దారిద్ర్యాన్ని తొలగించడం ఒక ముఖ్య అభివృద్ధి సమస్య. భారతదేశంలో పెద్ద అనుపాతంలో ప్రజలు దారిద్ర్యరేఖక్రింద వున్నారు. డండీవర్, రాత్‌ల కనుసారంగా 40 శాతం గ్రామీణ ప్రజలు, 50 శాతం పట్టణ ప్రజలు దారిద్ర్యరేఖక్రింద వున్నారు. ఇద్దర్ని కలిపితే 215 మిలియన్లు (41 శాతం) ప్రజలు దారిద్ర్యంలో వున్నారు. మొదట తయారుచేసిన ఆరవ పంచవర్ష ప్రణాళిక (1980-85) గ్రామాలలో ప్రతి ఒక్కరికి 2,400 కేలరీలు, పట్టణాలలో ప్రతి ఒకరికి 2,100 కేలరీలు యిచ్చే ఆహారం కావాలని చెప్పింది. ఈ ప్రాతిపదిక ననుసరించి, 1979-80లో 317 మిలియన్ల ప్రజలు, భారతదేశంలో దారిద్ర్యరేఖక్రింద వున్నారు. ఇందులో 260 మిలియన్లు గ్రామీణ బీదలు. 57 మిలియన్లు పట్టణ బీదలు. ఆరవ ప్రణాళిక ప్రకారం మొత్తం భారతీయుల్లో 48 శాతం బీదరికంలో వున్నారు. పట్టణ బీదలు ఇందులో 40 శాతం, గ్రామీణ బీదలు 51 శాతం. అందువల్ల పేదరికాన్ని తొలగించడం ముఖ్యమైన అభివృద్ధి సమస్య.

**అల్పపోషణ, అనుచితపోషణలవల్ల అల్ప ఉత్పాదకత, అల్ప సామర్థ్యము :**

సక్రమ పోషణవల్ల దేశప్రజల తెలివితేటలు, సమర్థత, ఉత్పాదకత మెరుగవుతాయి. ఇందువల్ల ఆర్థికాభివృద్ధి పురోగమిస్తుంది. ఆరోగ్యవంతంగా పనిచేయడానికి, ప్రతిఒక్కరికి, రోజుకు 2700 కేలరీలనిచ్చే ఆహారం లభ్యం కావాలని నేషనల్ సాంపుల్ సర్వే సహేతుకమైన అంచనా వేసింది. ఇటువంటి ఆహారం లభ్యంకాక 56 శాతం పట్టణప్రజలు, 49 శాతం గ్రామీణ ప్రజలు బాధపడుతున్నారు. వివిధ ద్రవ్యఖర్చు సమూహాల ప్రజల్లో పట్టణ ప్రజలు అనుచితాహారంవల్ల ఎక్కువగాను, అంతకంటె కొంచెం తక్కువగా గ్రామీణ ప్రజలు అనుచితాహారంవల్ల బాధపడుతున్నారు. గ్రామాల్లో ఆహారపదార్థాల ధరలు కొంచెం తక్కువగా వున్నందువల్ల, ఆహార పదార్థాలు తేలికగా లభ్యం కావడంవల్ల గ్రామీణ ప్రజల పోషణస్థితి మెరుగుగా వుండివుండవచ్చునని కొందరి భావన.

ఆహారావసరాలను, ఆచరణలో వున్న వినియోగస్థాయిలను జాగ్రత్తగా పరిశీలిస్తే యిచ్చట పొందుపర్చిన విషయాలు తెలియగలవు. (1) భారతీయునికందే కేలరీలలో అధికభాగం తృణధాన్యాల వినియోగంనుండి వస్తోంది. అందువల్ల అల్పజీవనస్థాయి తెలియ వస్తోంది. పెద్దవానికి రోజుకు 400 కేలరీలనిచ్చే ఆహారం కావలసి వుండగా, అతడు రోజుకు 470 కేలరీలనిచ్చే తృణధాన్యాలను వినియోగిస్తున్నాడు. (2) తృణేతర పదార్థాల వినియోగం - కూరగాయలు, పండ్లు, పాలు, పంచదార, పాలతో చేసిన పదార్థాలు, చేపలు, మాంసము, గ్రుడ్లు మొదలైనవాటి వినియోగం — అవసరానికంటె అతి తక్కువగా వున్నది. ఇందువల్ల సగటు భారతీయుని ఆహారం అసంతులితమని తెలుస్తోంది. అందువల్ల ఆహారధాన్యాల ధరలు, ఉత్పాదన, పంపిణీల కొరకు సమీకృత విధానం ఏర్పర్చవలసి వున్నది. అంతేగాక, తృణేతర ఆహారపదార్థాలైన పాలతో చేసిన పదార్థాలను, కోడిమాంసాన్ని, చేపలను, యితర మాంసాన్ని, పప్పుధాన్యాలను, కూరగాయలను, పండ్లను హెచ్చుగా ఉత్పత్తి చెయ్యాలి.

**జనసాంఖ్యక పరిమాణానికి వనరులు, మూలధనంకు మధ్య అసంతులనము :**

జనాభా పెరుగుదల వేగంగా జరగడము ఆర్థికాభివృద్ధికి ఆటంకదాయకము. 1941-50లో జనాభా సాలీనా 1.25 శాతం వృద్ధిరేటుతో పెరిగింది. కాని 1961-71లో యీ జనాభా వృద్ధిరేటు 2.5 శాతానికి పెరిగింది. మృత్యురేటు - వెయ్యికి 49 (1911-20) నుండి వెయ్యికి 15కు (1976) పడిపోయింది. కాని 1911-20లో వెయ్యికి 49గా వున్న జననరేటు 1976 నాటికి వెయ్యికి 3°కు మాత్రమే పడిపోయింది. పెరుగుతున్న జనాభా సమాజానికి పెద్ద ఆర్థికభారము. ఇందువల్ల ఆర్థికవృద్ధిని సాగించడానికి మరింత పెద్ద ప్రయత్నాలు అవసరమౌతాయి. జనాభా పెరుగుతూపోతూ వుంటే భూమి తలసరి లభ్యత, కొరతగా వున్న వనరుల తలసరి లభ్యత తగ్గుతాయి. అందువల్ల లభ్యమౌతున్న భూమిలోని ప్రతి యూనిట్‌నుండి యిదివరకటికంటె హెచ్చుగా ఉత్పత్తిని చేయడానికి మరింత హెచ్చు ప్రయత్నాలు చేయవలసి వస్తుంది. జనాభా పెరుగుతూపోతున్న సందర్భంలో, అప్పటికున్న జీవనప్రమాణం పడిపోకుండా వుండటానికి, ఏర్పాటయిన మూలధన ఏర్పాటునుండి చెప్పదగినంత భాగాన్ని జనపోషణ కుపయోగించవలసి వస్తుంది. అందువల్ల జనాభా పెరుగుదలరేటును అరికట్టడానికి, ఆర్థికాభివృద్ధిని పురోగమింపచేయడానికి సన్నిహిత సంబంధం వున్నది.

**నిరుద్యోగ సమస్య :**

నిరుద్యోగితను తొలగించడము, పనిలేని మిలియన్ల శ్రామికులకు లాభసాటి ఉద్యోగితను లభ్యం చేయడము భారత ఆర్థికాభివృద్ధిలోని పెద్ద సమస్య. 1951లో నిరుద్యోగుల సంఖ్య 3.3 మిలియన్లు కాగా, 1980 నాటికది 20.7 మిలియన్లకు పెరిగింది. అంటే భారత పంచవర్ష ప్రణాళికలు వాటి కాలంలో పెరిగిన శ్రామికులకు కూడా ఉద్యోగాలు కల్పించలేకపోతున్నవి. అంతకుముందు మిగిలిన నిరుద్యోగులకు ఉద్యోగా లివ్వలేకపోయిందని వేరుగా చెప్పనవసరం లేదు. మొత్తంమీద నిరుద్యోగం తగ్గడానికి శ్రద్ధ గల పని జరగలేదని ప్రణాళికా సంఘము విచారం వ్యక్తం చేసింది.

ప్రభావితం చేసే కారకాలలో, రాజ్యాంగయంత్రం పాత్ర, యిప్పటి పరిస్థితుల మధ్య, ఏకైక ప్రబలకారకంగా పనిచేస్తోందని చెప్పవలసి ఉంటుంది.

అభివృద్ధి ప్రక్రియా ప్రవాహంలో ఎదురయ్యే సమస్యలు:

అల్పాభివృద్ధితో వెనుకబడిన భారతదేశం 1947 ఆగష్టు 15వ తేదీన రాజకీయ స్వాతంత్ర్యం పొంది 1951 నుండి పంచవర్ష ఆర్థిక ప్రణాళికలను అమలుజరుపుతూన్నందువల్ల ఫలిస్తున్న ఆర్థికరంగం భారతదేశాన్ని అర్థశాస్త్ర సారస్వతంలో వర్ధమాన దేశంగా చేసింది. ఇంకాకూడా చాలమంది ప్రజలు దారిద్ర్య రేఖక్రింద వున్నారు. పి. డి. ఓఝా అంచనా ప్రకారం 1960-61లో గ్రామీణ రంగంలో 184 మిలియన్ల ప్రజలు (51.8 శాతం), పట్టణరంగంలో, 6 మిలియన్ల ప్రజలూ (7.6 శాతం); మొత్తం దేశంలో 190 మిలియన్ల ప్రజలూ (44 శాతం) బీదవారుగా వున్నారు. 1967-68లో పి. జి. ఓఝా అంచనా ప్రకారం గ్రామీణ రంగంలో 289 మిలియన్ల ప్రజలు (70 శాతం) దారిద్ర్యరేఖ క్రింద వున్నారు. అంటే గ్రామీణ దారిద్ర్యం పెరిగినట్లు చెప్పారు.

ఇ. పి. డబ్ల్యు. డాకోస్టా 1963-64లోని నేషనల్ సాంపుల్ సర్వే గణాంకాల ననుసరించి చేసిన అంచనా ప్రకారం 162 మిలియన్ల ప్రజలు దారిద్ర్యాన్ని 104 మిలియన్ల ప్రజలు అతి పేదరికాన్ని (దిక్కుమాలినతనము); 62 మిలియన్ల ప్రజలు అతి తీవ్ర పేదరికాన్ని (ఏమాత్రం కూడా దిక్కులేనితనము) అనుభవిస్తున్నారు.

వి. యమ్. డండేకర్, నీలకంఠరాత్‌లు, 1968 - 69లో గ్రామీణరంగం ప్రజల్లో 166 మిలియన్లు (40 శాతం); పట్టణరంగం ప్రజల్లో 49 మిలియన్లు (50 శాతానికి కొంచెం ఎక్కువ) దారిద్ర్య రేఖక్రింద వున్నట్లు వ్రాసారు. మొత్తం బీదప్రజలు 177 మిలియన్ల (1960-61) నుండి 215.5 మిలియన్ల (1968-69)కు పెచ్చారు. అయితే గ్రామీణ, పట్టణ పేదల అనుపాతంలో మాత్రం మార్పు రాలేదు. 1960-61; 1968-69లో కూడా మొత్తం 41 శాతం మంది ప్రజలు బీదవారుగా వున్నారు.

పి. కె. బర్ధన్ అంచనాల కనుసారంగా 1960 - 61లో 181.1 మిలియన్ల (38 శాతం) గ్రామీణ ప్రజలు, 1967-68లో 220.5 మిలియన్ల (53.0) గ్రామీణ ప్రజలు దారిద్ర్యంలో వున్నారు.

బి. యస్. మిన్హాస్ అంచనాల ప్రకారం గ్రామీణ రంగంలోని ప్రజల్లో 215 మిలియన్లు (65 శాతం), 1963-64లో 221 మిలియన్లు (57.8 శాతం); 1969-70లో 210 మిలియన్లు (50.6శాతం) దారిద్ర్యంలో వున్నారు. దారిద్ర్యం ఈ అంచనా ప్రకారం తిగ్గుముఖం పటింది.

ఏడవ ఫైనాన్స్ కమిషన్ అంచనాల ప్రకారం 1970-71లో గ్రామీణ రంగంలోని ప్రజల్లో 225 మిలియన్లు (53 శాతం), పట్టణ రంగంలోని ప్రజల్లో 52 మిలియన్లు (51 శాతం), మొత్తం దేశ ప్రజల్లో 277 మిలియన్లు (52 శాతం) పేదరికంలో వున్నారు.

ఆరవ పంచవర్ష ప్రణాళిక (1978-83) అంచనాల ప్రకారం 1977-78లో గ్రామీణ ప్రజల్లో 238.6 మిలియన్లు (47.9 శాతం), పట్టణ ప్రజల్లో 55.2 మిలియన్లు (40.7 శాతము), మొత్తం దేశ ప్రజల్లో 293.6 మిలియన్లు (46.3 శాతం) పేదరికంలో వున్నారు.

పునః రచించబడిన ఆరవ ప్రణాళిక (1980-85) ప్రకారం 1980-85లో గ్రామీణ ప్రజల్లో 259.6 (50.7 శాతం) మిలియన్లు, పట్టణ ప్రజల్లో 57.2 (40 శాతం) మిలియన్లు, మొత్తం దేశ ప్రజల్లో 316.8 (48.4 శాతం) మిలియన్లు పేదరికంలో వున్నారు. కాబట్టి దేశ ప్రజల్లో యింకా సగంమంది దారిద్ర్యంలో వున్నారు. కొన్ని అంచనాల ప్రకారం గ్రామాల్లోను, పట్టణాల్లోను పేదరికం ఒకే తీవ్రతలో వుండగా, మరికొన్ని అంచనాల ప్రకారం పట్టణాల్లోకంటె గ్రామాల్లో దారిద్ర్యం హెచ్చు తీవ్రంగా వున్నది. భారతదేశ పేదరికం తరుణ వ్యాధే కాదు. దీర్ఘవ్యాధి కూడా. దేశంలో ఉపయోగించబడని సహజ వనరులు దండిగా వున్నయ్యి. దేశ ఆర్థిక వ్యవస్థలో దారిద్ర్య విష వలయము, పవిత్ర భాగ్యవలయము ప్రక్కప్రక్కనే పనిచేస్తున్నవి. ఇందువల్ల దైన్యస్థితి స్థిరపడుతుంది. దారిద్ర్యాన్ని తొలగించడానికి చేపట్టిన ప్రయత్నాలు విఫలమౌతాయి? అందువల్ల అభివృద్ధి నిర్వహణలో ఎదురయ్యే సమస్యల్ని అర్థం చేసుకోవటం అవసరం. భారతదేశ ఆర్థికాభివృద్ధికి ఎదురౌతున్న సమస్యల నిచట పొందు పరుద్దాము :

అల్ప తలసరి ఆదాయం : అల్ప ఆర్థికవృద్ధి రేటు :

కొన్ని దేశాల పరిస్థితులను మినహాయించితే, ప్రపంచ దేశాల తలసరి ఆదాయంలో భారతదేశ తలసరి ఆదాయం అట్టడుగున వున్నది. 1960లో భారతదేశ తలసరి ఆదాయానికి అమెరికా తలసరి ఆదాయం 36 రెట్లు, కెనడా తలసరి ఆదాయం 31 రెట్లు వున్నది. తరువాత 20 సంవత్సరాల్లో అభివృద్ధి చెందిన దేశాలు తమ తలసరి ఆదాయాన్ని చాలా వేగంగా పెంచుకున్నాయి. భారతదేశం మాత్రం నత్తనడకతో సాగుతోంది. తత్కారణంగా తలసరి ఆదాయాల్లో-అభివృద్ధి చెందిన దేశాలకు, ఇండియాకు మధ్య వున్న వ్యత్యాసం ఇంకా బాగా విశాలమయ్యింది. ఇప్పుడు ఇండియా తీవ్రకృషితో అభివృద్ధి చెందిన దేశాల స్థితికి రాకపోతే ఎన్నో ప్రమాదాలు సంభవించగలవు.

### దారిద్ర్యరేఖక్రింద పెద్ద అనుపాతంలో ప్రజలు :

సాధారణ ప్రజాబాహుళ్యాన్నంతటిని బాధపెడుతున్న దారిద్ర్యాన్ని తొలగించడం ఒక ముఖ్య అభివృద్ధి సమస్య. భారతదేశంలో పెద్ద అనుపాతంలో ప్రజలు దారిద్ర్యరేఖక్రింద వున్నారు. డండీవర్, రాత్‌ల కనుసారంగా 40 శాతం గ్రామీణ ప్రజలు, 50 శాతం పట్టణ ప్రజలు దారిద్ర్యరేఖక్రింద వున్నారు. ఇద్దర్నీ కలిపితే 215 మిలియన్లు (41 శాతం) ప్రజలు దారిద్ర్యంలో వున్నారు. మొదట తయారుచేసిన ఆరవ పంచవర్ష ప్రణాళిక (1980-85) గ్రామాలలో ప్రతి ఒక్కరికి 2,400 కేలరీలు, పట్టణాలలో ప్రతి ఒకరికి 2,100 కేలరీలు యిచ్చే ఆహారం కావాలని చెప్పింది. ఈ ప్రాతిపదిక ననుసరించి, 1979-80లో 317 మిలియన్ల ప్రజలు, భారతదేశంలో దారిద్ర్యరేఖక్రింద వున్నారు. ఇందులో 260 మిలియన్లు గ్రామీణ బీదలు. 57 మిలియన్లు పట్టణ బీదలు. ఆరవ ప్రణాళిక ప్రకారం మొత్తం భారతీయుల్లో 48 శాతం బీదరికంలో వున్నారు. పట్టణ బీదలు ఇందులో 40 శాతం, గ్రామీణ బీదలు 51 శాతం. అందువల్ల పేదరికాన్ని తొలగించడం ముఖ్యమైన అభివృద్ధి సమస్య.

### అల్పపోషణ, అనుచితపోషణలవల్ల అల్ప ఉత్పాదకత, అల్ప సామర్థ్యము :

సక్రమ పోషణవల్ల దేశప్రజల తెలివితేటలు, సమర్థత, ఉత్పాదకత మెరుగవుతాయి. ఇందువల్ల ఆర్థికాభివృద్ధి పురోగమిస్తుంది. ఆరోగ్యవంతంగా పనిచేయడానికి, ప్రతిఒక్కరికి, రోజుకు 2700 కేలరీలనిచ్చే ఆహారం లభ్యం కావాలని నేషనల్ సాంపుల్ సర్వే సహేతుకమైన అంచనా వేసింది. ఇటువంటి ఆహారం లభ్యంకాక 56 శాతం పట్టణప్రజలు, 49 శాతం గ్రామీణ ప్రజలు బాధపడుతున్నారు. వివిధ ద్రవ్యఖర్చు సమూహాల ప్రజల్లో పట్టణ ప్రజలు అనుచితాహారంవల్ల ఎక్కువగాను, అంతకంటె కొంచెం తక్కువగా గ్రామీణ ప్రజలు అనుచితాహారంవల్ల బాధపడుతున్నారు. గ్రామాల్లో ఆహారపదార్థాల ధరలు కొంచెం తక్కువగా వున్నందువల్ల, ఆహార పదార్థాలు తేలికగా లభ్యం కావడంవల్ల గ్రామీణ ప్రజల పోషణస్థితి మెరుగుగా వుండివుండవచ్చునని కొందరి భావన.

ఆహారావసరాలను, ఆచరణలో వున్న వినియోగస్థాయిలను జాగ్రత్తగా పరిశీలిస్తే యిచ్చట పొందుపర్చిన విషయాలు తెలియగలవు. (1) భారతీయునికందే కేలరీలలో అధికభాగం తృణధాన్యాల వినియోగంనుండి వస్తోంది. అందువల్ల అల్పజీవనస్థాయి తెలియవస్తోంది. పెద్దవానికి రోజుకు 400 కేలరీలనిచ్చే ఆహారం కావలసి వుండగా, అతడు రోజుకు 470 కేలరీలనిచ్చే తృణధాన్యాలను వినియోగిస్తున్నాడు. (2) తృణేతర పదార్థాల వినియోగం - కూరగాయలు, పండ్లు, పాలు, పంచదార, పాలతో చేసిన పదార్థాలు, చేపలు, మాంసము, గ్రుడ్లు మొదలైనవాటి వినియోగం – అవసరానికంటె అతి తక్కువగా వున్నది. ఇందువల్ల సగటు భారతీయుని ఆహారం అసంతులితమని తెలుస్తోంది. అందువల్ల ఆహారధాన్యాల ధరలు, ఉత్పాదన, పంపిణీల కొక సమీకృత విధానం ఏర్పర్చవలసి వున్నది. అంతేగాక, తృణేతర ఆహారపదార్థాలైన పాలతో చేసిన పదార్థాలను, కోడిమాంసాన్ని, చేపలను, యితర మాంసాన్ని, పప్పుధాన్యాలను, కూరగాయలను, పండ్లను హెచ్చుగా ఉత్పత్తి చెయ్యాలి.

### జనసాంఖ్యక పరిమాణానికి వనరులు, మూలధనంకు మధ్య అసంతులనము :

జనాభా పెరుగుదల వేగంగా జరగడము ఆర్థికాభివృద్ధికి ఆటంకదాయకము. 1941-50లో జనాభా సాలీనా 1.25 శాతం వృద్ధి రేటుతో పెరిగింది. కాని 1961-71లో యీ జనాభా వృద్ధిరేటు 2.5 శాతానికి పెరిగింది. మృత్యురేటు - వెయ్యికి 49 (1911-20) నుండి వెయ్యికి 15కు (1976) పడిపోయింది. కాని 1911-20లో వెయ్యికి 49గా వున్న జననరేటు 1976 నాటికి వెయ్యికి 3?కు మాత్రమే పడిపోయింది. పెరుగుతున్న జనాభా సమాజానికి పెద్ద ఆర్థికభారము. ఇందువల్ల ఆర్థికవృద్ధిని సాగించడానికి మరింత పెద్ద ప్రయత్నాలు అవసరమౌతాయి. జనాభా పెరుగుతూపోతూ వుంటే భూమి తలసరి లభ్యత, కొరతగా వున్న వనరుల తలసరి లభ్యత తగ్గుతాయి. అందువల్ల లభ్యమౌతున్న భూమిలోని ప్రతి యూనిట్‌నుండి యిదివరకటికంటె హెచ్చుగా ఉత్పత్తిని చేయడానికి మరింత హెచ్చు ప్రయత్నాలు చేయవలసి వస్తుంది. జనాభా పెరుగుతూపోతున్న సందర్భంలో, అప్పటికున్న జీవనప్రమాణం పడిపోకుండా వుండటానికి, ఏర్పాటయిన మూలధన ఏర్పాటునుండి చెప్పదగినంత భాగాన్ని జనపోషణ కుపయోగించవలసి వస్తుంది. అందువల్ల జనాభా పెరుగుదలరేటును అరికట్టడానికి, ఆర్థికాభివృద్ధిని పురోగమింపచేయడానికి సన్నిహిత సంబంధం వున్నది.

### నిరుద్యోగ సమస్య :

నిరుద్యోగితను తొలగించడము, పనిలేని మిలియన్ల శ్రామికులకు లాభసాటి ఔద్యోగితను లభ్యం చేయడము భారత ఆర్థికాభివృద్ధిలోని పెద్ద సమస్య. 1951లో నిరుద్యోగుల సంఖ్య 3.3 మిలియన్లు కాగా, 1980 నాటికది 20.7 మిలియన్లకు పెరిగింది. అంటే భారత పంచవర్ష ప్రణాళికలు వాటి కాలంలో పెరిగిన శ్రామికులకు కూడా ఉద్యోగాలు కల్పించలేకపోతున్నవి. అంతకుముందు మిగిలిన నిరుద్యోగులకు ఉద్యోగా లివ్వలేకపోయిందని వేరుగా చెప్పనవసరం లేదు. మొత్తంమీద నిరుద్యోగం తగ్గడానికి శ్రద్ధ గల పని జరగలేదని ప్రణాళికా సంఘము విచారం వ్యక్తం చేసింది.

నిరుద్యోగ, ప్రచ్ఛన్న నిరుద్యోగాలు రెండూ కూడా తొలగించబడితే మినహా ప్రణాళికా నిర్వహణవల్ల వాస్తవ స్థూల జాతీయ ఉత్పత్తి, వాస్తవ తలసరి ఆదాయం పెరిగినా - అంత ప్రయోజనం ఉండదు. ప్రణాళికాబద్ధ ఆర్థికాభివృద్ధి వ్యూహాన్ని (1) ఔద్యోగితా సాంద్రతను కల్పించే ప్రతి ఆర్థికరంగ ప్రణాళికారచనను చేపట్టేందుకు (2) ఉత్పత్తిచేసే సాంకేతిక పద్ధతిలో వచ్చే మార్పు వున్న ఔద్యోగితను నిల్పి, దాన్ని పెంచేందుకు (3) సంపూర్ణ ఔద్యోగితను ఏర్పర్చగల ప్రాంతీయ ప్రణాళికా రచనను ఏర్పర్చి అమలు జరిపేందుకు నిర్దేశించాలి. శ్రామికులు అవసరమయ్యే సాంకేతిక ఉత్పత్తి పద్ధతుల ద్వారా ఔద్యోగితను పెంచడం ముఖ్యము.

నీటిపారుదల సౌకర్య కల్పన, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, గృహ నిర్మాణ కార్యాలను అమలుజరపడంతోపాటు, రోడ్ల నిర్మాణము, విద్యుదీకరణ, మంచినీటి సరఫరా, గ్రామీణ పాఠశాలల నిర్మాణము, సామాజిక ఆరోగ్య పథకాల అమలు - అంటే అవస్థాపనా నిర్మాణ కార్యక్రమాల అమలు జరగాలి. ఇందువల్ల నిర్మాణ కార్యక్రమాలు విస్తరించి, ఔద్యోగితను ఎక్కువగా పెంచుతాయి. దీని ప్రభావంవల్ల ద్వితీయ, తృతీయరంగాల విస్తరణ, వ్యవసాయోత్పాదకత, ఆదాయాలు కూడా పెరిగి, నిరుద్యోగాన్ని, పేదరికాన్ని తొలగించడానికి తాయి.

### వ్యవసాయం; తత్సంబంధిత రంగాల ఉత్పత్తిలో స్థిమితము :

భారతదేశంలో వ్యవసాయం యిప్పటికీ ఋతుపవనాల దయాదాక్షిణ్యాలమీదనే ఆధారపడి పెద్ద ఎగుడు దిగుడులకు లోనౌతూ వుంటోంది. అందువల్ల వ్యవసాయోత్పత్తిలో అస్థిమితమేర్పడి పెద్ద సమస్యగా తయారయ్యింది. స్వాతంత్ర్యానంతర భారతదేశంలో వ్యవసాయోత్పత్తి తగినంతగా పెరుగుతూ వస్తోంది. 1955-56 1978-79 మధ్య కాలవ్యవధిలో ఆహారధాన్యాల ఉత్పత్తి 69 మిలియన్ టన్నులనుండి 132 టన్నులకు పెరిగింది. బియ్యం ఉత్పత్తి 29 మిలియన్ టన్నులనుండి 54 మిలియన్ టన్నులకు, గోధుమల ఉత్పత్తి 9 మిలియన్ టన్నులనుండి 35.5 మిలియన్ టన్నులకు, చెరకు ఉత్పత్తి 7 మిలియన్ టన్నులనుండి 16 మిలియన్ టన్నులకు పెరిగింది. వ్యవసాయోత్పత్తుల పెరుగుదలలు మెరుగు చెందినప్పటికి, ఆహారధాన్యాల ఉత్పత్తి మాత్రం సంవత్సరం, సంవత్సరం మారుతూ అస్థిమితంలో ఉంటోంది. నూనెగింజలు, చెరకు, దూది, జనుముల ఉత్పత్తిలో కూడా యీ అస్థిమితం కన్పించింది. వ్యవసాయోత్పత్తులలో వచ్చిన అస్థిమితము, వ్యవసాయంతో సంబంధమున్న రంగాల ఉత్పత్తుల్లో కూడా అస్థిమితం కల్గిస్తుంది. చెరకు ఉత్పత్తి తగ్గుదల పంచదార, బెల్లం పరిశ్రమలకు; జనుము ఉత్పత్తి తగ్గుదల జవుళి పరిశ్రమకు దెబ్బగా పరిణమిస్తుంది. వ్యవసాయోత్పత్తుల తగ్గుదల వ్యవసాయరంగంలోని ఔద్యోగితను తగ్గించవచ్చు. ఈ పరిస్థితుల్లో రైతుల ఆదాయాలు, వ్యవసాయ కూలీల వేతనాలు దెబ్బతింటే, వారి కొనుగోలుశక్తి తగ్గి, యితర రంగాల వస్తువులకు వారు చేస్తున్న సమర్థ డిమాండ్ తగ్గుతుంది. ఇందువల్ల భారతదేశ ఆర్థికాభివృద్ధి ప్రణాళికలు, వ్యవసాయోత్పత్తుల అస్థిమితాన్ని తొలగించే గట్టి వ్యూహాన్ని తయారుచేసి అమలు చెయ్యాలి.

### భారీ పరిశ్రమలకు - వేతన వస్తువులకు మధ్య అసంతులన స్థితి :

బ్రిటిషు హయాంలో, భారతదేశంలో భారీ పరిశ్రమలను ఏర్పర్చేందుకు విదేశ పాలకులు పూనుకోలేదు. కాని స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జాతీయ పాలకులు ఉద్దేశ్యపూర్వకంగా బ్రిటిషు విధానాన్ని తల్లక్రిందులుచేసి భారీ పరిశ్రమలను అభివృద్ధి చేసేందుకు పూనుకున్నారు. భారీ పరిశ్రమలను ప్రోత్సహించి పెంపొందించే విధానము - మెహలానబీస్ నమూనాతో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక నుండి ప్రారంభమయ్యింది. ఇందువల్ల భారతీయ ఆర్థికాభివృద్ధికి పారిశ్రామిక ప్రాతిపదిక లభ్యమయ్యింది.

1962లో జరిగిన పాకిస్తాన్ దాడి, 1965లో జరిగిన చైనా దాడి భారీ రక్షణ పరిశ్రమలు భారతదేశంలో బలహీనంగా వున్నయ్యని తెలియజేసినై. అందువల్ల అప్పటినుండి భారీ రక్షణ పరిశ్రమల నిర్మాణంపై శ్రద్ధ చూపబడింది. ఇది తగిన విధానమేకాని ఇందువల్ల పెట్టుబడి, వేతన వస్తూత్పత్తిరంగాలలో 41 శాతం (1950-51) నుండి 31 శాతానికి (1974-75) పడిపోయింది. అందువల్ల వేతన వస్తూత్పత్తిరంగపు ఆర్థికవృద్ధిరేటు, వేతన వస్త్వేతర ఉత్పత్తి రంగపు ఆర్థికవృద్ధి రేటుకంటె తక్కువగా వుంటూ వచ్చింది. కాని వేతన వస్తూత్పత్తిరంగపు ఉత్పాదనలకు డిమాండ్ పెరిగింది. ఇలా పెరిగిన డిమాండ్ వేతన వస్తువుల ధరలమీద వత్తిడిని పెంచింది. తత్కారణంగా వేతన వస్తువుల ధరలు పెరిగినై.

ప్రజలకు లభ్యమయ్యే వేతన వస్తువుల ప్రభావం ఆర్థికాభివృద్ధి గమనంమీద తగినంతగా ఉంటుంది. అందువల్ల వేతనవస్తు సప్లయి వేగంగా ప్రవహించాలి. తరువాత వేతన వస్తువుల ధరలు స్థిమితం చేయబడాలి.

1963-76లో జరిగిన ఆర్థికవృద్ధిపై ప్రొఫెసర్ బ్రహ్మానంద విశ్లేషణ యిలా వుంది: 1) వేతన వస్తువుల సప్లయిరేటు వేతనేతర వస్తువుల సప్లయిరేటుకంటె తక్కువగా వున్నది. వేతన వస్తురంగ వృద్ధిరేటు 2 శాతం కాగా వేతనేతర వస్తురంగపు వృద్ధిరేటు 4 శాతంగా వున్నది. ఇందువల్ల వేతన వస్తువుల ధరలు సాలీనా 8 శాతం చొ॥న పెరిగినాయి. తత్ఫలితంగా ప్రణాళికల తొలిదశల్లో పెరిగిన వాస్తవ వేతన పెరుగుదల, 1963-76లో వేతన వస్తువుల ధర పెరగడం వల్ల - తగ్గిపోయి, శ్రామికుల జీవన ప్రమాణానికి విఘాతం కల్గింది.

ఇప్పటికి భారతీయ ఆర్థిక వ్యవస్థకు తగిన పారిశ్రామిక ప్రాతిపదిక లభ్యమయ్యింది. కాబట్టి వేతన వస్తూత్పత్తి పరిశ్రమల పెట్టుబడిని పెంచడానికి కొంతవరకైనా వీలౌతుంది. అందువల్ల పెట్టుబడి చేసే విధానాలను సరిదిద్దవచ్చు. ఇందువల్ల భారీ పరిశ్రమల విషయంలో స్వయంనిర్భరతను సాధించామని చెప్పడంలేదు. కాని భారీ పరిశ్రమలను, వేతన వస్తూత్పత్తి పరిశ్రమలను ఒకేసారిగా-ఏకోన్ముఖంగా-అభివృద్ధి చేయవలసిన అవసరమున్నదని, ఆ సమయమాసన్న

మైనదని మాత్రమే చెప్పవలసి వస్తోంది. అంటే ఈ రెండు రంగాల మధ్య సంతులిత ఆర్థికాభివృద్ధి జరగాలని భావము. భారీ పరిశ్రమల విస్తృతికాలంలో వేతన వస్తువుల కొరత కారణంగా, త్యాగాలు చేసిన శ్రామికులకు, ఈ సంతులన ఆర్థికాభివృద్ధి విధానావలంబనవల్ల — పెరగని ధరలకు వేతన వస్తువులు లభ్యమై జీవనప్రమాణ స్థాయి మెరుగుపడి కొంత ఉపశమనం కలుగవచ్చు.

**పంపిణీలో అనంతులనము : పెరుగుతున్న అసమానతలు:**

జరిగిపోయిన మూడు దశకాల్లో జరిగిన ప్రణాళికాబద్ధ ఆర్థిక అభివృద్ధి క్రింద, ఆస్థి ఆదాయాలలో వ్యత్యాసాలు పెరిగినాయి. పంపిణీ ఎక్కువ ఆదాయాల వారికి అనుకూలంగాను, తక్కువ ఆదాయాల వారికి అనుకూలం కాకుండాను జరిగింది. పైగా ధనికుల చేతుల్లో ఆస్థి, ఆదాయాలు కేంద్రీకృతం కావడం హెచ్చింది. జరిగిన కొద్ది అభివృద్ధివల్ల వచ్చిన మంచి ఫలితాలు న్యాయయుక్తంగా పంపిణీ కాబడలేదని ప్రొఫెసర్ దండేకర్ ప్రొఫెసర్ రాత్‌లు స్పష్టం చేసారు. అట్టడుగున వున్న 20 శాతం జనాభా ఆర్థిక పరిస్థితి క్షీణించింది. వారిని అనుకుని పైనున్న 20 శాతం ప్రజల ఆర్థిక పరిస్థితి ముందుకు పోకుండా నిలిచిపోయింది. ప్రభుత్వ పారిశ్రామికరంగం పెరుగుదల కూడా బీదలస్థితిని మెరుగుపర్చలేకపోయింది. వివిధ ఆర్థిక రంగాల్లో ప్రయివేటు గుత్తాధిపత్యం (ఏకాధిపత్యం) పెరుగుదలను - కూడా పబ్లిక్ రంగం పెరుగుదల ఆపలేకపోయింది. దేశ ఆర్థికవ్యవస్థలో ఉత్పత్తి చేయబడిన జాతీయ సంపదను న్యాయయుక్తంగా పంపిణీచేస్తూ, ధారావాహికంగా ఆర్థికవృద్ధిని సాధించే సమస్య భారతదేశంముందు కన్పిస్తోంది. శ్రద్ధతో కృషిచేసి, సమర్థవంతంగా ఉత్పాదకతను పెంచి, న్యాయసమ్మతంగా పంపిణీచేసి సమస్యను పరిష్కరించవచ్చు. మనస్సుంటే మలుపు తిరిగి మాన్యతగల ఫలితాలను సాధించి ప్రజల కందించవచ్చు.

ఇంతవరకు భారతీయ ఆర్థికవ్యవస్థలోని ప్రధాన సమస్యలేమిటో చూచాము. మూడు కోణాలనుండి వీటిని పరిష్కరించాలి. (1) దారిద్ర్యాన్ని తగ్గించుట, నిర్మూలించుట (2) నిరుద్యోగితను తగ్గించుట, తొలగించుట (3) అసమానత్వాన్ని తగ్గించుట, సమానత్వాన్ని అవసరమైనంతగా ఏర్పర్చుట. తగిన కార్యసాధన వ్యూహాల నిర్మాణ, అమలులద్వారా దారిద్ర్య, నిరుద్యోగ, అసమానత్వాలను తప్పక తొలగించవచ్చు. ఈ విషయంలో విజయాన్ని సమకూర్చే పరిస్థితులను సమకూర్చుకోవడం మన మానసిక శ్రద్ధ, బుద్ధిబలం, శరీరకృషి మీద ఆధారపడి వుంటుంది.

(అయిపోయింది)

# ఓ కాలమా గర్వించకు!

## శ్రీ భువనగిరి నాగరాజు

కుసుమ పేశలమైన గుండెల్లో
కరకు కత్తులు గుచ్చానని పొంగిపోకు!
ఆ వేదనల గాయాలు చేసి
బాధల రుధిర స్రావాలు పారించి
నన్ను అజ్ఞాతవాసం పట్టించానని గర్వించకు!
నిజానికి ఈ గాయాలు, రుధిరస్రావాలు
నిద్రిస్తున్న నా మనస్సుకు
నీవు పాడుతున్న సుప్రభాత గీతికలని
తెలియనంత పిచ్చిదానివి నువ్వని మరచిపోకు!
పూచిన మోదుగై కన్ను తెరిచే
నా మేధస్సు చేసే తపస్సులో
ప్రభవించే రోచిస్సులో
ఈ విశాల విశ్వ సముద్రంలో
గొరిల్లావై గెరిల్లాలా దాడిచేసే నిన్ను
పట్టేందుకు తెగిపోని వలను సిద్ధం చేస్తాను!
అనుభవాల కవచాలు కప్పుకొని
వజ్రకాయుడనై
తిరిగి నీపై యుద్ధానికి వస్తాను!
సజీవంగా నిన్ను బంధించి
నా భావాల కత్తులతో
ఏ భాగానికాభాగం విడదీసి
సాహిత్యపు మ్యూజియంలో ప్రదర్శిస్తాను!
అక్షరాల అద్దాలలో నీ రూపాన్ని
సవాలక్ష ప్రతిబింబాలు చేసి చూపిస్తాను!
క్షోభించే ప్రతి గుండెకీ,
ప్రశ్నించే ప్రతి శిశువుకీ,
దర్శించే ప్రతి మనిషికీ,
నీ రాక్షస చరిత్ర వినిపిస్తాను!!

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

## ఆగష్టు - 1988

**మేషము** (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్విని వారికి నెల ప్రారంభమునుండి 21 తేదీవరకు ధన లాభం, సంసార కుటుంబసౌఖ్యం, సంఘంలో గౌరవ మర్యాదలు, విలాసములూ, వినోదములూ, దర్జా, ఆడంబరములు మొదలగువానితో హాయిగా గడచును. కాని శరీరశ్రమ, నలత, త్రిప్పట, అధికముగా నుండును. విద్యార్థులకు అతి కష్టంమీద ఉన్నత విద్యావకాశం కలుగును. ఉద్యోగస్థులకు ఉద్యోగం తొలగిపోవునన్న భయం, లేదా, స్థానం మార్పు, భయం కలుగును. వ్యవసాయదారులకు వృత్తిలో కటకట, శ్రమకు తగిన ఫలితము రాదు.

భరణి వారికి ఒకప్రక్క ధనలాభం, శరీరంలో అతివేడిమి, స్థానభ్రంశము కలుగును. అయితే మాతాపితృ భార్యాపుత్రాది సౌఖ్యం, సంసార సౌఖ్యం, చేతిలో పుష్కలముగా ధనము కలుగును. విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం, వృత్తి జీవులకు ధనలాభము కలుగును. గతంకన్న అన్ని విషయాలూ, మంచికి మారును. పరిస్థితులన్నీ శుభానుకూలంగానే జరుగును.

కృత్తిక 1పా. వారికి గత నెలవరకు వెంటాడుచున్న కష్టములు, ఆర్థికపు ఇబ్బందులు, కుటుంబంలోని చిక్కులు, తొలగిపోయి, ఉద్యోగంలో అభివృద్ధి కలుగును. వ్యవసాయదారులు, వర్తకులు, విద్యార్థులు, మొదలగువారికి చాల శ్రమ పడిన తర్వాత మంచి ఫలం కలుగును. ధనమునకు స్వల్పంగా తొట్రుపాటు కలుగును.

**వృషభము** (కృత్తిక 2, 3, 4పా. రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4పా. వారికి భార్యా మూలకంగా ధనలాభం, సంసార కుటుంబసౌఖ్యం, ఉద్యోగంలో అభివృద్ధి మొదలగునవి కలుగును. కాని వ్యవహార సంబంధమైన చిక్కులవలన ధనవ్యయం, త్రిప్పట జరుగును. ఆ వ్యవహారములు ఒక పరిష్కారమునకు రావు. మొత్తంమీద మంచి హెచ్చుగా, చెడు తక్కువగా జరుగును. కష్టసుఖాలు రెండూ ఒకదానివెంట ఒకటి వచ్చును.

రోహిణీ వారికి ఇంకా చిక్కులు తొలగిపోలేదు. చిక్కులవలన శ్రమ, ధనవ్యయం తప్ప, మరొక విధమైన నష్టమేమియు జరుగక పోయినను, మనస్సునకు కొంత దిగులుగా నుండును. దానికితోడు కుటుంబంలో కూడ కొన్ని కలతలు, నలతలు వచ్చును. అనుకొన్న పనులేమియు సకాలంలో జరుగవు. మీదు మిక్కిలి బంధువుల వలన కొన్ని మాటలు పడవచ్చును. బంధువుల వలన ధనము ఖర్చు, తిరిగి అపవాదులూ కలుగును.

మృగశిర 1, 2పా. వారికి బంధువులతో సామాన్యమైన పట్టుదలలు, గృహ నిర్మాణాది వ్యవహారములలో ప్రతిష్టంభనము జరుగును. ధనము బాగుగా లభించును. పెద్దలు, అధికారులు, మొదలగువారి మన్ననలు, అభిమానము లభించినను కేవలము ఆశ తప్ప వారివలన జరిగెడి ఉపకారమేమియు ఉండదు. అత్యాశ విడుచుట మేలు.

**మిధునము** (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3పా.)

మృగశిర 3, 4పా. వారికి నెలంతా బాగుగానే ఉండును. శరీరసౌఖ్యం, ధనలాభం, భార్యావర్గ బంధువుల మూలకముగా ధన వ్యయం, పుణ్య ధర్మకార్యములకై పాటుపడుట జరుగును. కాని అధికారులు, పెద్దలు, ఉన్నత పదవులలో నున్నవారు, రాజకీయ నాయకులు మొదలగువారి గురించి అనవసరముగా వ్యయప్రయాసలు పడుటయే తప్ప ప్రయోజనముండదు. ఆ పెద్దలు చివరివరకు ఉపకారము చేసినట్లే నటించెదరుగాని ఏమియు చేయరు. కాబట్టి ఒకరేదో చేసెదరని పెద్ద పనులకు దిగవద్దు.

ఆర్ద్రవారికి ధనమునకు లోపముండదు. వినోదపు ఖర్చులు, విలాసపు ఖర్చులు హెచ్చగును. అన్నివిధముల రాబడి బాగుగానే ఉండును. కాని అంతా ఖర్చు అగుట తప్ప, ఒక స్థిర రూపకల్పన జరుగదు. ఆదాయమునకు మించిన వ్యయమే జరుగును. పదుగురిలో గౌరవ మర్యాదలకు లోపము ఉండదు. పెద్దలతో పరిచయం, స్నేహం, ప్రజాసమ్మానం జరుగును.

పునర్వసు 1, 2, 3పా. వారికి ఉద్యోగములో అభివృద్ధి, దాని మూలకముగా ఊహించని ధనలాభము కలిగి, ఏదో ఒక వస్తురూపములో చేయుటకు ప్రయత్నము చేసినా, భార్యామూలక బంధువులు, సంతానము, శుభకార్యములు మొదలగువానివలన కొంత వ్యయమగుచుండును. కొంత స్థిరరూపము ధరించును. నెలంతా ధనయోగం, కుటుంబసౌఖ్యంతో గడచును.

**కర్కాటకము** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4పా. వారికి పిరికితనము హెచ్చు. పదుగురిలో భేషజములకు, గొప్పలకు పోయి, ఇతరులకై ధనము ఖర్చుపెట్టుట జరుగును. ఉద్యోగులకు మంచి అభివృద్ధి, విద్యార్థులకు, కర్షకులకు,

కార్మికులకు మొ॥వారందరికీ మంచి అభివృద్ధితో లాభదాయకముగా నుండును. స్థిరమైన వస్తు సంపాదనము, పదుగురిలో మంచి గౌరవము, ఉద్యోగులకు అధికారము పెరుగుట, కుటుంబంలో సుఖ శాంతులు కలుగుట, మొదలగు శుభఫలితములు కలుగును.

పుష్యమి వారికి నెలంతా శుభాశుభ మిశ్రఫలము కలుగును. శరీరములో అతివేడిమి చేయును. మొదటివారమంతయు ఆర్థికముగా తొట్రుపాటు కలుగును. తరచు ప్రయాణములచే శ్రమ కలిగినను, ఆర్థికంగా కొంత లాభించును. కుటుంబంలో చిన్న చిన్న తగవులాటలు కలిగి తొలగిపోవును. 10తే. తర్వాత కొంతవరకు లాభం కల్గును.

ఆశ్లేష వారికి ఇంతవరకు ఉన్న చిక్కులు తొలగిపోవును. 7-21 తేదీల మధ్య సంసార కుటుంబసౌఖ్యం బాగుగా నుండును. ధనలాభము బాగుగా కలుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు, కార్మికులకు, కర్షకులకు, వర్తకులకు కూడ ఉన్నతమైన అవకాశములు, ధనలాభము మొదలగునవి కలుగును. మొత్తంమీద బాగుగానుండును. ధనలాభం కలుగును.

## సింహం (మఘ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మఘ నక్షత్రం వారికి శరీరంలో నలత, కుటుంబంలో కలత, ఆర్థికంగా తొట్రుపాటు, మనస్సులో పరిపరివిధముల పనికిమాలిన ఆలోచనలు కలుగుచుండును. బంధువులతో విరోధము కలుగును. స్థిరాస్తికి కొన్ని ఒడుదొడుకులు ఉన్నను, ధనవ్యయమగుట తప్ప, నష్టము కలుగదు. విద్యార్థులకు, ఉద్యోగులకు తప్ప మిగిలినవారికి సామాన్యముగానే ఉండును. శని, కుజులకు శాంతి, జపము చేయుట మంచిది.

పుబ్బ వారికి శరీరారోగ్యం బాగుగా నుండును. మానసికంగా ఆందోళన కలిగించు పరిస్థితు లేర్పడును. ఎన్నాళ్ళనుండియో రావలసిన ధనము ఒక్కసారిగా చేతికందును. అందువలన ఒడుదొడుకులు కొంచెము తగ్గినట్లున్నను మనస్సునకు మాత్రం వ్యధ కలుగును. మానసికమైన ఆందోళనము, అనారోగ్యము కంటె హెచ్చుగా బాధించును. వ్యయము కూడ అధికమగును.

ఉత్తర 1పా. వారికి 13-28 తేదీలమధ్య నలత హెచ్చుగా నుండును. 15 తేదీవరకు శ్రమ మరింత హెచ్చు. నెల చివరలో ధనలాభము బాగుగానుండును. ఉద్యోగ వ్యవహారములు, శుభకార్య ప్రయత్నములు ఫలించును. గృహ నిర్మాణాది ప్రయత్నములు వాయిదా పడును. బంధువర్గముతో మాటపట్టింపులు వచ్చును. మొత్తంమీద శుభాశుభ మిశ్రఫలము కలుగును.

## కన్య (ఉత్తర 2, 3. 4 పా. హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2. 3, 4పా. వారికి భార్యకు అనారోగ్యం, అధికముగా ధనవ్యయము కలుగును. ఈ నక్షత్రంవారికి శరీరంలో నలత, శుభకార్య ప్రయత్నములకు విఘ్నములు, చిన్న చిన్న ఏక్సిడెంట్లు మొదలగునవి కలుగును. మనస్సునకు వ్యాకులత్వం ఉండును. అయితే ధనమునకు మాత్రం లోపముండదు. ఏవో చిన్న చిన్న ఒడుదొడుకులు ఉన్నను, ఈ నెల బాగుగా నుండును. శ్రమ హెచ్చుగా సుఖము తక్కువగా ఉండును.

హస్త వారికి శరీరములో నలత, నిస్సత్తువ, నీరసము కలుగును. భార్యకు స్వల్పంగా అనారోగ్యము, శరీరంలో అతివేడిమి, మానసికంగా అస్థిరత్వం, చాపల్యం కలుగును. బంధు విరోధం కలుగును. శుభకార్య విఘ్నములు కలిగి అందుకై వ్యయప్రయాసలు మాత్రం మిగులును. కుటుంబంలో చిన్న చిన్న కలతలు, బంధువుల రాకపోకలు వానివలన అధికంగా ధనవ్యయం, మొదలగునవి జరుగును. ఒక్క విద్యార్థులకు, వర్తకులకు ప్రయోజనము కలుగును. కర్షకులు, శ్రామికులు మొదలయినవారికి శ్రమకు తగిన ఫలితం లభించును.

చిత్ర 1, 2పా. వారికి అన్నివిధముల అనుకూలంగా ఉండును. విద్యార్థులకు, రాజకీయ నాయకులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు, మంచి యోగదాయకముగా నుండును. వ్యవహారములలో చిన్న చిన్న ఒడుదొడుకులు కలిగినా, అవన్నియు సమసిపోవును. శరీర శ్రమ మాత్రం హెచ్చుగా నుండును. చిన్న చిన్న ఏక్సిడెంట్లు జరిగి తొలగిపోవును.

## తుల (చిత్ర 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా.)

చిత్ర 3, 4పా. వారికి సోదరులతో స్వల్పంగా విభేదము కలుగును. అనుకొన్న పని సకాలంలో కాక అకారణముగా, అతి నెమ్మదిగా నత్తనడకవలె కొనసాగును. భార్యతో వాగ్వాదములు అప్పటప్పట తాత్కాలికముగా జరుగును. ధనవ్యయం అధికముగా నుండును. దైవభక్తి, ఆధ్యాత్మిక చింతనము కలుగును. మొత్తం మీద బాగుగానే యుండును.

స్వాతివారికి శరీరంలో అప్పటప్పట నలత కలుగుచుండును. జరుగవలసిన పనులు జరిగిపోవుచున్నట్లే, కనబడి వ్యయప్రయాసలను కలిగించి వాయిదా పడుచుండును. దైవభక్తి, దైవకార్యములు, పెద్దలతో, సాధు సజ్జనులతో సాహచర్యము, సద్గోష్ఠి కలుగును. వివాహాది శుభకార్యములలో పాల్గొనుట జరుగును. ధనమునకు లోపముండదు.

విశాఖ 1, 2, 3పా. వారికి ధనము బాగుగా కలసివచ్చును. దానిననుసరించి వ్యయము కూడ ఎప్పటికప్పుడు తప్పనిసరిగా కలుగును. భార్యావర్గమువారితో శత్రుత్వము హెచ్చును. కోరి కొన్ని వ్యవహారములను నెత్తిన వేసికొనవలసి వచ్చును. దైవ పుణ్యకార్యములలో పాల్గొనుట జరుగును. ప్రతి విషయములోను మూర్ఖత్వం, పట్టుదల, కార్యఫలం తేలేవరకు పట్టు పట్టుట, ఫలితము సాధించుకొనుటకు, ఎన్నో మంచి మార్గములున్నను, మూర్ఖమార్గము ద్వారానే పట్టుపట్టుట, తర్వాత విచారించుట జరుగుచుండును. అతి చిన్న విషయమును అతి పెద్దదిగా చేసికొని, క్లేశమును కొనితెచ్చికొనుట జరుగును.

## వృశ్చికము (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4పా. వారికి సంతాన సౌఖ్యం, సంతానమునకు అన్ని విధాల అభివృద్ధి కల్గును. బ్రహ్మచారులకు వివాహాది శుభకార్య ప్రయత్నములు నెరవేరును. సంసార దాంపత్యసౌఖ్యం, బంధుమిత్రాదులతో మంచి అనుకూలత, ధనలాభము, మాతాపితృ సోదరీ సోదర సౌఖ్యం కలుగును. ఉద్యోగులకు అభివృద్ధి, విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం కలుగును. మొత్తంమీద ఈ నక్షత్రం నాల్గవ పాదం వారందరికి మంచి అనుకూల శుభఫలితములు కలుగును. వర్తకులకు, శ్రామికులకు మంచి లాభము కలుగును.

అనూరాధ వారికి 6తేదీవరకు భార్యకు నలత చేయును. శరీరంలో వేడిమి కలుగును. చిన్న చిన్న ఏక్సిడెంట్సువలన ప్రమాదములు కలిగి తొలగిపోవును. రెండవవారమునుండి సంసార కుటుంబ, పుత్ర పుత్రికా సౌఖ్యము, అనుకూల దాంపత్యము, ధనలాభము, పెద్దలతో పరిచయమేర్పడి, అనుకొన్న పనులన్నీ సానుకూలముగా నెరవేరును.

జ్యేష్ఠ వారికి ఇదివరకు ఉన్న చిక్కులు తొలగిపోయి, వ్యవహారములలో మంచి అనుకూలత ఏర్పడును. సంసార కుటుంబ సౌఖ్యములలో కూడ మంచి అనుకూలత కలుగును. అన్నివిధముల సుఖసంతోషములు నిండుకొనును. ప్రజలయొక్క, పదుగురి పెద్దల యొక్క గౌరవాదరములు సంపాదించుట జరుగును. అయితే కొంత వరకు ప్రయాణములలో జాగ్రత్త అవసరము.

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

మూల నక్షత్రం వారికి జన్మతారలోనున్న శని నలత చేయును. శారీరకముగా, మానసికముగా కూడ శ్రమను కలిగించును. మనఃక్లేశం, కుటుంబంలో చిక్కులు, వృధా ఖర్చులు పెరుగును. మాతృవర్గము వారితో భూగృహ వ్యవహార సంబంధమైన చిక్కులు కలుగును. తల్లికి ఆరోగ్యము భంగమగును.

పూర్వాషాఢ నక్షత్రంవారికి, ఇంకా నలత రోజులు పోలేదు. భార్యకు స్వల్ప అనారోగ్యము కలిగి తొలగిపోవును. విద్యార్థులకు అతికష్టంమీద ఉన్నత విద్యావకాశం కలుగును. ప్రతి విషయములోను వ్యయం, ప్రయాస హెచ్చుగానుండును. త్రిప్పట, శరీరంలో వేడిమి హెచ్చును. బంధువులతో విరోధము కూడ కలుగును. అనారోగ్యము లేకపోయినను, అధిక వేడిమిచే, శరీర తాపముచే బాగుగా అలసిపోయినట్లు అనిపించును.

ఉత్తరాషాఢ 1పా. వారికి శరీరములో అధికశ్రమ వలన, తీరికలేని పనుల ఒత్తిడివలన అలసట బాగుగానుండును. ఆటంకములు కలిగినను, తలచిన పనులు నెరవేరును. గృహ కుటుంబసౌఖ్యం, సంసార సౌఖ్యం కలుగును. సంతానమునకు అనేకవిధముల అభివృద్ధి కలుగును. విద్యార్థులకు సామాన్యయోగము. ఉద్యోగులకు లాభదాయకముగా నుండును.

## మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ట 1. 2 పా.)

ఉత్తరాషాఢ 2, 3, 4పా. వారికి శ్రమ హెచ్చు. ఫలితం తక్కువ. వ్యయము హెచ్చు, సుఖము తక్కువ. సోదరవర్గముతో అభిప్రాయ భేదములు కలుగును. మానసికంగా ఆందోళన, దిగులు, పొందవలసి వచ్చును. విద్యార్థులకు పెద్దగా యోగించదు. కాని పలుకుబడి, అధిక శ్రమ, ధనవ్యయము వలన ఆలస్యముగా ఉన్నత విద్యావకాశం కలుగును. అనుకొన్నది సిద్ధింపకపోయినను, మరొకటియైన ఉన్నత విద్యావకాశం కలుగును.

శ్రవణంవారికి శరీరంలో నలత, శ్రమ అధికముగా నుండును. తలచిన పనులకు ఆటంకములు కలుగును. అనాలోచితముగా ప్రతి విషయములోను తొందరపాటు హెచ్చుగా నుండును. సోదర వర్గముతో, మాతృ వర్గముతో అభిప్రాయ భేదములు, మాట పట్టుదలలు వచ్చును. పనికిమాలిన ఆలోచనలతో వ్యర్థముగా కాలము గడుపుట జరుగును. తలచినదే తడవుగా ప్రతి పనిని ప్రారంభించి, చేయలేక విరమించుట జరుగుచుండును.

ధనిష్ట 1, 2పా. అన్ని విధముల బాగుగానుండును. సంతానమునకు విద్యాభివృద్ధి కలుగును. కుటుంబంలో సుఖసంతోషములు నెలకొనును. కాని ధనము మాత్రము అధికముగా వ్యయమగుచుండును. అది కూడ హెచ్చు భాగము పనికిమాలిన ఖర్చులకగును. లగ్జరీలు, విలాసములు, వినోదములు, హెచ్చుగా తటస్థించును. 15 తేదీవరకు భార్యకు అనారోగ్యము చేసి నిమ్మళించును.

**కుంభం** (ధనిష్ట 3, 4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా.)

ధనిష్ట 3, 4పా. వారికి దైవభక్తి, పరమార్థ చింతనము, మాతృసౌఖ్యం, గృహ భూ వాహన సౌఖ్యం, పుత్రికా సంతాన సౌఖ్యం కలుగును. అయినను కొన్ని విధములయిన కుటుంబ చిక్కులకు గురి కావలసి వచ్చును, డాబు దర్పములకు, విలాసములకు ఖర్చుచేసి తరువాత విచారించుట జరుగుచుండును.

శతభిషం వారికి కుటుంబంలో చిన్న చిన్న చిక్కులు కలుగుచుండును. 13 తేదీనుండి ఆ చిక్కులు మరికొంచెము హెచ్చగును. వివాహాది శుభకార్య ప్రయత్నములకు విఘ్నములు కలుగును. తలపెట్టిన ప్రతి పనికిని ఏవో ఆటంకములు కలిగి మనస్సునకు ఖేదము కలుగుచుండును. ఆరోగ్యభంగమగును. 24 తేదీనుండి చిక్కులు మరికొంచెము హెచ్చగును.

పూర్వాభాద్ర 1, 2, 3పా. వారికి నెలంతా సుఖ సంతోషములతో గడచును. కుటుంబంలో సుఖసంతోషములు, శుభకార్యములు, బంధుమిత్రులు, రాకపోకలు, నానావిధముల ఆదాయము పెరుగుట, దైవభక్తి, పరమార్థ చింతనము హెచ్చగును. పుత్రికా సంతానమునకు వివాహాది శుభకార్య ప్రయత్నములు నెరవేరును. పదుగురిలో మాట పలుకుబడి పెరుగును. విద్యార్థులకు చాల ఉత్సాహవంతమైన కాలము. ఉద్యోగులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు అన్ని విధముల లాభసాటిగా నుండును.

**మీనము** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4పా. వారికి ఉద్యోగ వ్యవహారములలో కొంత మందకొడిగా నుండును. మాతృసౌఖ్యం, గృహ వాహన సౌఖ్యం, పాడిపంటలు, బంధుమిత్రాదుల రాకపోకలు మొదలగువానివలన మనస్సు మంచి ఉల్లాసముగా ఉండును. నెల చివరి రోజులలో మానసికముగా ఖేదం కలుగును.

ఉత్తరాభాద్ర వారికి ధనలాభం బాగుండును. కాని భార్యకు అప్పటప్పట నలత చేయును. సోదరులతో మంచి అనుబంధమేర్పడి తగిన సహాయ సహకారములు లభించును. ఉత్సాహం, ధైర్యము హెచ్చుగా నుండును. పుణ్య ధర్మ కార్యములలో పాల్గొనుట జరుగును. శుభకార్యముల నిమిత్తము ధనవ్యయము జరుగును. శరీరంలో నలత, వేడిమి హెచ్చుగా నుండును.

రేవతి వారికి 7 తేదీనుండి 21 తేదీవరకు భార్యకు నలత చేయును. సంతానసౌఖ్యం బాగుగా నుండును. తలచిన పనులన్నియు చక్కగా నెరవేరును. ఉద్యోగమూలకముగా ఉద్యోగులకు, వర్తకులకు వ్యవసాయాదిమూలకముగా ఆయా వృత్తులవారికి బాగుగా లాభించును. శ్రామికులకు-కార్మికులకు కూడ ధనలాభము బాగుగా నుండును. విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం కలుగును. మొత్తం మీద ఈ నక్షత్రంవారికి గత మాసంకన్న ఈ నెల అన్నివిధముల బాగుగా నుండును.

సిద్ధాంతి: **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**



కొల్లూరు సూర్యనారాయణ

# మధ్యాంధ్రయుగంలో భూమి సేద్యము - పన్నులు

తెలుగునాటి మధ్యయుగాల చరిత్ర తెలుగువారి సాంఘిక జీవన వివరాలను కూలంకషంగా పరిశీలించటానికి ఒక అత్యుత్తమ వేదిక. ఆనాటి మనవారు అనుసరించిన విధానాలు, పాటించిన పద్ధతులు ఏ సాంఘిక ప్రయోజనాలకోసం ఉద్దేశింపబడ్డాయో, కాలగతిలో మన సంస్కృతీవికాస గమనంలో ఎలాంటి సవాళ్ళ నెదుర్కోవటానికి ఎలాంటి పద్ధతులవసరమైనాయో మధ్యాంధ్రయుగ చరిత్ర సుస్పష్టంగా తెలుపుతుంది. అయితే, విశాల ప్రాతిపదికపై అనేక వైవిధ్యాలతో సంశయగ్రస్త ఆధారాల మధ్య నలుగుతున్న సాంఘిక చరిత్రను యథా తథా నిర్ధారించగలగటం సాధ్యం కాకపోవచ్చు. మనకి లభ్యమయ్యే కొద్దిపాటి ఆధారాలు ఆనాటి పూర్తి వ్యవస్థను రూపేర్పరుపలేకపోవచ్చు. కాని సాంఘికపరంగా తెలుగునాట చరిత్రగమనం ఏ విధంగా వుందో తెలుసుకోవటానికి వేర్వేరువిధాల చారిత్రకాధారాలున్న మధ్యాంధ్రయుగాన్ని విస్మరించలేము.

సమాజపుష్టికి, ఆర్థికతుష్టికి ఏ కాలంలోనైనా సేద్యం నిర్వహించే భూమిక బహుదొడ్డది. పారిశ్రామికీకరణకి పూర్వరంగంలో మానవ సమాజపు ఆర్థికస్థితిని నిర్ధారించి నడిపించింది కేవలం వ్యవసాయరంగమే. తెలుగునాట అధికారం చేసిన రాజరికాలు చాలవరకు యీ ప్రాథమిక విషయాన్ని మరచిపోలేదు. గడచిన శతాబ్దాల చరిత్రల్లో పాలక వ్యవస్థలు వ్యవసాయ ప్రోత్సాహానికి తీసుకున్న నీటిపారుదల సౌకర్యాలవంటివెన్నో వేర్వేరు సందర్భాల్లో పేర్కొబడ్డాయి. సస్యపు విషయంలో ఆనాటి ప్రజల శాస్త్రవిజ్ఞానాన్ని అంచనా వేసుకుందికి, ప్రకృతిని ఎంత స్థూలంగా పరిశీలించి అన్వయించుకునేవారో తెలుసుకుందికి, పధ్నాలుగో శతాబ్దంలో దోనయామాత్యుడు తెలుగులో వ్రాసిన 'సస్యానందం' ఒక తిరుగులేని ఉదాహరణ.[1]

జనావాసాలు పెరుగుతున్నకొద్దీ అడవులను నిర్మూలనచేసి పంటభూమి విస్తీర్ణాన్ని పెంచి వ్యవసాయాభివృద్ధికి కృషి చేయటం మధ్యయుగాల్లోనే గణనీయంగా పెరిగింది. భూదానం మహా పుణ్యకార్యంగా ప్రచారం జరగటం, వివిధ 'వృత్తు'లకు సస్యాంశం కేటాయింపబడటం లాంటివి[2] వాసిపరంగాను, రాశిపరంగాను పంటల దిగుబడి వృద్ధిపరచబడటానికి మాత్రమే కాక, సమాజంలోని అన్ని వర్గాలవారిని వ్యవసాయానికి సన్నిహితంగా వుంచటానికి ఉపయోగపడింది. భూగర్భజలాల్ని వెలికితీసి సస్యోపయోగ్యంగా వినియోగించుకొనే ప్రక్రియలో వర్షాన్ని భూమి ఉపరితలంపై నిలుపగట్టి జలాశయాలు, కుంటలు, ఆవలు నిర్మించి భూమి తలాల్లోని నీటిశాతాన్ని వృద్ధిపరచి సస్యపు దిగుబడి పెంచే ఆనాటి విధానాన్ని దూరదృష్టి కల పద్ధతిగా యీనాటి ఆధునిక వ్యవసాయ విజ్ఞానం మెచ్చుకోక తప్పదు. సంతానసాగర[3], వీరసాగరాది[4] లెక్కకు మిక్కుటమైన సాగరాలు, వంశవర్ధనాది[5] అనేక సస్యోపయుక్త నీటి తీరువలు, అసంఖ్యాక తటాకాలు, అనంతర శతాబ్దులనాటికి కూడ ఉపయుక్తకర స్థితిలో నుండటం ఆనాటి మనవాళ్ళ పారమార్థికచింతనకు, పరమ ఆర్థిక చింతనకు కూడ ప్రతీకయే. రెండు కొండలమధ్య కట్ట నిర్మించి జలాశయ మేర్పరచి సస్యాభివృద్ధికి ఎలా తోడ్పడవచ్చో శ్రీనాథుని 'హరవిలాసం' సూచిస్తుంది.[6] విజయనగర రాజుల ఏలుబడిలో నిర్మింపబడ్డ జలాశయాలు వారి ఆర్థిక విధానానికే నికషోపలలు. విడినీరు, ఏతమునీరు మొదలైన ద్రాక్షారామపు శాసనాల్లోని ప్రస్తావనలనుబట్టి[7] నీటితీరువలను మలుచుకొనే కృషీవలుర సాధారణ విధానాలు తెలుస్తాయి. సమకాలీన తెలుగు సాహిత్యంలో కవులు కృషీవలత్వంలోని యిబ్బందుల్ని గుర్తించారనటానికి కొరవిగోపరాజు క్రింది పద్యం చాలు.[8]

> "ఈ యెడఁ గర్మభూమియగుఁ డెవ్వరికైనను బుద్ధి నేర్పునం
> జేయఁగలేదు కాలమెడఁ జేసిన నేతముఎత్తి, కాల్వలుం
> బాయలుఁ గోళ్ళ నూతులును బావులు రాట్నములున్ జలార్థమై
> చేయఁగ నాయెఁగాక మఱిచేయని నాడవి తామె పుట్టునే"

ఈ జలాధారాలతో కొన్ని వందల రకాల ధాన్యవిశేషాలే కాక మిరియాలు, జీలకర్రవంటి సుగంధపు దినుసులనుండి పోకతోటలు,

చింతతోపులవరకు పెంచి ఏవిధంగా కర్షకులు ఉత్పత్తి, తద్వారా స్వయం సమృద్ధికి తోడ్పడ్డారో తెలుస్తోంది.

ప్రభుత్వకోశానికి ధనాన్ని సమకూర్చే ముఖ్యమైన ఆధారం భూమి పన్ను. అది చెల్లింపవలసిన కారణాన్ని, పద్ధతినిబట్టి వేర్వేరు పేర్లతో వ్యవహరింపబడటం జరిగేది. ఆనాటి పాలక వ్యవస్థలో ఆర్థిక మెరుగుదల కోసం పాలకులు ఏ ఏ మేరకు పన్నులు విధించవచ్చునో బద్దెన, మల్లనలవంటివారు సూచించారు. 'పరాశర మాధవీయం'లాంటి వాటిల్లోకూడ భూమి పన్నుల విషయం గూర్చి సూచనలున్నాయి. అయితే వీరి యీ సూచనలు ఆనాటి పాలకుల కేమేరకు ఆచరణ యోగ్యాలయ్యాయో తెలియదు.

సమకాలీనంగా ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థకి యితోధికంగా ధనం కూర్చేది భూమిపన్ను మాత్రమే. అందువలననే భూమిని కొలిచి కాలానుసారంగా పన్ను నిర్ధారించేవారు. నిర్దిష్టమైన పొడవుగల కోల, గడ, లాంటి కొలబద్దలు భూమి కొలతల కుపయోగింపబడేవి. అయితే, యివి ప్రదేశాన్నిబట్టి, కాలాన్నిబట్టి మారుతున్నట్లు తెలుస్తోంది. ఆ కారణం వలననే కొన్ని క్రయ, విక్రయాల్లో సూచింపబడ్డ శాసనాల్లో "మా వూరి కోలను సలుతుము" అని నిర్ధారించి చెప్పబడేది[9]. విజయనగర రాజుల కాలానికి ముందు భూమి కొలతలు వేర్వేరు కాలాల్లో క్రమపద్ధతిలో జరిగేవో, లేవో సరిగ్గా తెలిసే ఆధారం లేదుగానీ, శాసనాల్లోను సాహిత్యంలోను భూమి కొలతల ప్రస్తావనలున్నాయి. పూరీ జగన్నాథుని ఆలయ చరిత్రను చాటిచెప్పే 'మదాలపంజి', గంగరాజుల కాలంలో భూమి కొలత నిర్వహింపబడినట్లు తెలుపుతోంది.[10] విజయనగర రాయల కాలంలో వేర్వేరు ప్రాంతాల్లో చాల సార్లు యీ కొలతలు జరుపబడ్డాయి.

పుట్లు, తూములు మొదలైన పదాలతో పంటభూమి విస్తీర్ణం పరిగణన చెయ్యబడేది. ఇరవై తూములు ఒక పుట్టికి సమానం. దినుసులయొక్క కొలతలు సూచింపబడే పదాల్ని భూమి కొలతలకు నిర్దేశించటానికి కారణం, అంత పరిమాణపు విత్తనాన్ని జల్లటానికి సరిపడు భూమి అని సూచించటానికే. పుట్లు, ఖండుగలు, తూములు మొదలైనవి శాసనాల్లో దానము లీయబడ్డ భూమి కొలతలు సూచింపబడే సందర్భాల్లో, పు, ఖ, తు, మొదలైనవిధంగా సూక్ష్మీకరించి చెప్పబడుతుండేవి.[11] ఒక నాగలి ఒకరోజులో దున్నే భూవిస్తీర్ణంగాని, భూకమతాలుగాని ప్రాతిపదికగా భూమి శిస్తు నిర్ణయింపబడేది. భూములకు హద్దులు నిర్ధారించే 'ఎల్లరాళ్ళ' పాతటం కూడ కొన్నిచోట్ల కానవసుంది.

విజయనగర రాజుల కాలానికి తెలిసినంత విపరంగా అంతకు పూర్వపు ఆంధ్ర ప్రాంతాల నేలిన పాలకుల భూమిశిస్తు విధానం తెలీదు. పల్లము, మెట్టభూమి తోటభూమి మొదలైనవి భౌగోళిక ప్రభావితాలైనప్పటికీ ఉత్పాదక సామర్థ్యం దీన్నిబట్టే వుంటుంది. శాసనాల్లో చాల సందర్భాల్లో పల్లపుభూమిని జలక్షేత్రమనీ, నీరునేల అనీ: మెట్టభూమిని చౌకభూమి అనీ. వెలి పొలమనీ; తోటభూమిని తోంటగట్టు అనీ ప్రస్తావించేరు. పన్ను నిర్ధారణ నేల స్వభావాన్ని, సారాన్ని, జలాధారాలనిబట్టి నిర్ధారితమౌతుంది. నిరంతర యుద్ధ ప్రఘట్టనల్లో ఘూర్ణిల్లిన మధ్యయుగాల ఆంధ్రావనిలో పాలకులు ప్రజలపై భూమిపన్ను భారం అధికంగానే మోపేరని చెప్పవచ్చు. పరిస్థితుల క్లిష్టతనిబట్టి యీ పన్ను హెచ్చుతగ్గులు ఆధారపడేవి. బ్రాహ్మణుల కీయబడిన అగ్రహార భూములపై కూడ, అవి ఎంత 'సర్వకర పరియారువు'లైనప్పటికీ, అసాధారణ పరిస్థితుల్లో అత్యవసర పన్నులు విధింపబడినట్లు సూచించే ఆధారాలున్నాయి. బ్రాహ్మణుల నిత్యనైమిత్తికాదులకు, యితర వెచ్చములకు భంగము వాటిల్లని రీతిలో క్లిష్ట పరిస్థితుల నధిగమించుటకు పాలకులు పన్ను గ్రహించవచ్చునని 'నీతివాక్యామృతము' సూచించుచున్నది.[12]

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ప్రోలయ నాయకుని విలస శాసనమాధారంగా పల్లపుభూమిపై పన్ను వస్తురూపేణా (దినుసు) వసూలు చేయబడినట్లును, మిగిలిన వివిధాలైన పన్నులు ధనరూపేణా గ్రహింపబడినట్లు భావించారు.[13] రాజ్యవ్యాప్తంగా పన్ను వస్తురూపేణా ఏవిధంగా వసూలు జరిగేదో, ఆ మొత్తం దినుసు, ఎక్కడ ఏవిధంగా ఎవ్వరి అజమాయిషీలో నిలువచేయబడేదన్నది తెలుసుకునే ఆధారాలు లేవు. పన్ను వసూలు సందర్భాల్లో మాత్రం అధికారులు చాల నిర్దయతో వ్యవహరించి వసూలు చేయటం జరిగేది. పాత, క్రొత్త నీటిపారుదల సౌకర్యాలు సమీక్షించి పన్ను నిర్ధారింపబడేవని గ్రహించవచ్చు. పంట పరిపక్వతకు రాకుండ పన్ను వసూళ్ళు మొదలిడరాదని, పంట పొలాలపై సైన్యాన్ని అసలు మోహరింపచేయరాదని, యివి రెండూ రాజ్యక్షామానికి దారితీస్తాయని సోమదేవసూరి వంటి పండితుల హెచ్చరిక![14]

శ్రీనాథ కవిసార్వభౌముని ప్రసిద్ధ చాటువులోని "నెట్లు చెల్లింతుఁ టంకంబు లేడునూట్లు", అనే వాక్యం యీ సందర్భంలో స్ఫురణకు రావటం సహజం. ఇది రూఢిగా రెండు విషయాలను చాటి చెప్తుంది. మొదటిది, ప్రభుత్వాధీనంలోని వేర్వేరు భూములను కృషి

వలురకు నిర్దిష్టమైన శిస్తు విధించి అమరకం చేసేవారు. శ్రీనాథుడు 'బొడ్డుపల్లి'లోని భూముల్ని ఆ విధంగానే తీసుకున్నాడు. రెండోది, ప్రకృతి వైపరీత్యాది కారణాలవలన సస్యనాశనం జరిగినప్పుడు విధిగా ప్రభుత్వం పన్నుని రద్దు చేయాలనే నియమం లేదు. ఆ నిర్ణయం అప్పటి ప్రభుత్వపు యిష్టాయిష్టాల్ని, ఆర్థికపు టవసరాల్ని బట్టి మారుతుంటుంది. అయితే, ముందే "అస్య గ్రామస్య కప్పావిధానం కరం వర్జితం" అని ప్రకటింపబడ్డ[15] సందర్భాల విషయం వేరు.

మధ్యాంధ్రయుగ శాసనాలు పెక్కింటిలోని అంశాల్నిబట్టి 'భూమిహక్కు' వేర్వేరుగా వ్యక్తుల స్వంత ఆస్తిగాను, ప్రభుత్వాల ఆస్తిగాను కూడ వుండేదని తెలుస్తోంది. దేవదేయ, బ్రహ్మదేయాలు వ్యక్తుల ఆస్తిగానే పరిగణింపబడేవి. పాలక సిబ్బంది సేవలకు ప్రతిగా 'వృత్తి యినాములు' కూడ యివ్వబడేవి. భూమి హక్కు గుర్తింపబడి వారసత్వపు హోదా కలిగివుండేది. దాన క్రయ విక్రయాలు అన్ని హక్కులతో పేర్కొనబడేవి. భూమిని వ్యక్తుల స్వంత ఆస్తిగా పరిగణించి దాన క్రయ విక్రయాలు జరిపినట్లున్న శాసనాలు చాల కానవస్తాయి. ఏ పాలకుడైనాసరే, వ్యక్తుల స్వంతభూమిని దానమీయవలసి వచ్చినప్పుడు, ముందుగా దానిని క్రయము చేయవలసిందే.

భూమి పన్ను నిర్ధారింపులను ప్రకటించే రాజాజ్ఞల ఉదాహరణలు మనకు చాల అరుదుగా కన్పిస్తాయి. సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజుల రెండో విజయరాజ్య సంవత్సరంలో యిస్తున్నానంటూ, ఒక విజయాదిత్య చక్రవర్తి నిరవద్యప్రోలిపీట విజయం చేసి, వేంగీ మండలపు మల్లీశ్వర మహాదేవ పట్టణపు ప్రజలకు రాజమర్యాదతో ఏ విధంగా భూమి పన్ను నిర్ణయించాడో గమనించండి.[16]

| | | | | |
|---|---|---|---|---|
| ఊ(డ్పు)వరినేల | - | పుట్టి ఒక్కింటికి | - | రెండుచిన్నాలు |
| ఊడ్పునేల | - | " | - | ఆరు చిన్నాలు |
| మెట్టునేల | - | " | - | నాలుగు చిన్నాలు |
| జొన్ననేల | - | " | - | (శాసనభాగము శిథిలము) |
| కొత్తనేల | - | " | - | రెండు చిన్నాలు |
| నువునేల | - | " | - | (శాసనభాగము శిథిలము) |

దీనినిబట్టి, భూమి ఉత్పాదకతనిబట్టి శిస్తు నిర్ధారితమయ్యేదనీ, క్రొత్తగా సాగునకు మళ్ళించబడిన భూమికి శిస్తులో రాయితీ కల్పించబడి ప్రోత్సహింపబడేదని తెలుస్తోంది.

మధ్యాంధ్రయుగానికి సంబంధించినంతవరకు భూమి సేద్యము, పన్నులను గురించి కొంతవరకు తెలుస్తున్నప్పటికీ, ఆసక్తికరమైన అనేక వివరాల్ని తెలుసుకొందికి ఆధారాలు చాలవనే చెప్పాలి. ఉదాహరణకు - వృత్తిపరంగా విధింపబడే యిలాంటి పన్నుల విషయంలో కులాల హెచ్చు తగ్గుల ప్రసక్తి వుండేదా అనేది పరిశీలించాల్సిన అంశం. బ్రాహ్మణుడైనా, శూద్రుడైనా, వ్యవసాయదారుడై ఒకే శ్రేణీవ్యవస్థలో సభ్యులైన సందర్భాల్లో, కులరీత్యా ఏ 'అగ్రవర్ణ' మైనప్పటికీ, ప్రత్యేక రాయితీలు పొందే అవకాశం లేదు. ఆర్థిక విధానంలో కులంకన్నా 'వృత్తి'కే ప్రాధాన్యత, గుర్తింపు వుండేవి. వ్యవసాయమే వృత్తిగా కలిగిన విభిన్న కులస్థులు ఆచరణలో పాటించేది శ్రేణీ నియమాలా, లేక కుల కట్టుబాట్లా, అనేది కూడ నిర్ధారణగా చెప్పలేం. వేర్వేరు రాజ్యాల పొలిమేర గ్రామాల్లో, రోజుకో రాజరికం చెలామణీ అయ్యే అస్తవ్యస్త సందర్భాల్లో ఎవ్వరి భూమి శిస్తు విధానం ఏ మేరకు అమలు జరిగేదన్నదీ సందేహమే!

**అధోజ్ఞాపికలు :**

(1) భారతి, జూన్, 1946, పు. 500; (2) భారతి, జనవరి, 1968, పు. 3; (3) ఇ.ఐ. సం.11, పు. 319: (4) యస్.ఐ.ఐ. సం. 6, నెం. 662; (5) సి.టి.ఐ. సం 2, నెం. 25; (6) హరవిలాసము, అ. 2, ప. 233; (7) యస్.ఐ.ఐ. సం 6, నెం.1884; (8) సింహాసన ద్వాత్రింశిక, అ. 6, ప. 70; (9) యస్.ఐ.ఐ. సం. 6, నెం. 666; (10) అడ్మినిస్ట్రేషన్ అండ్ సొసైటి ఇన్ మిడీవల్ ఆంధ్ర (ఎ.డి. 1038-1538) అండర్ ది లేటర్ యీస్టరన్ గాంగాస్ అండ్ ది సూర్యవంశి గజపతిస్, (నెల్లూరు, 1976), పే.196; (11) యస్.ఐ.ఐ. సం. 6, నెం. 784, 925, 790, 860, 924, 975 మొదలైనవి. (12) నీతివాక్యామృత, అ. 21, శ్లో॥ 14; (13) హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్డమ్స్, పే. 213; (14) యశస్తిలక అండ్ ఇండియన్ కల్చర్, (షోలాపూరు, 1968), పే. 117; (15) ఇ.ఐ. సం. 7, పే. 188; (16) యస్.ఐ.ఐ. సం.6, నెం. 1243.

# సంశయాలు

ఏ విశ్రాంత మార్గాల
అవిశ్రాంత చేతస్కృత మేల్కొంచి
కాల దుకూలాన్ని విసరివేస్తుందో
ఏ విక్రాంతశక్తి జాగృతమై
లోకపరివ్యాప్తమైన
ధూళిధూసరిత శక్తుల్ని
అణచివేస్తుందో
వాక్కుకందని ఏ నిరామయ విహ్వలత రెక్కలు విప్పి
కలలజాలాన్ని తొలగించి
నిసర్గ సుందర దృశ్యాలని
అక్షిగోచరం చేయ సమకడుతుందో-
ఆ అరుణసంధ్యల వెనుక
నవ్వుతూ తుళ్ళింతలాడే సత్యాన్ని
స్వాగతించడానికి సిద్ధం చేస్తున్నా నీ నేలని
విరిగిన ఆశయాల నతకడానికి
చెట్లనించి రాలే
ప్రగాఢ సత్యాల వగరు జిగురును కూరుస్తూ
అస్వతంత్ర జ్ఞాన సరస్తీరాల్లో
సంకోచం లేకుండా జలకాలాడే
స్వచ్ఛధవళకాంతుల హంసల్ని చూసి
నిట్టూరుస్తున్నా
అవి అక్కడినుండి ఎగిరిపోవాలని
కోరుకుంటున్నా, ప్రార్థిస్తున్నా.
ఈ అవజ్ఞా తుషారం కరిగేదెన్నడని
సంశయాల హిమమరీచికల్ని
మరీ మరీ ప్రశ్నిస్తున్నా.

# స్వకీయం

కవితా మహానగరంలోని
సంకీర్ణమైన రాచబాటలో
అంధపాంథుణ్ణి
వినువీధులలో ఎగిరిపోతూ
నీలపు తీరాలని రెక్కలకంటించుకునే
డేగజాతి పక్షిలాగా
స్పృష్టాస్పృష్టపు భావనాతీరంలో
విహరించే భ్రష్టయోగిని
ఎందరికో పునరుజ్జీవనాలు నేర్పి
నిరంతరమూ నిశ్చలధ్యానమగ్నమైన
మల్లెపూవు తీవెపై నిలచినట్టు
నిలచివుండాలన్న భావన.
కానీ ఇది కరకునేల
నల్లని మెట్లపైన సుతారంగా
తీగెలాంటి వేళ్ళు కదలినట్టు
నడవడమిట దుస్సాధ్యం.
ఆలోచనల వలలు విసిరి
ఎన్నో భావాల ముత్యాలను
సేకరించాలని కాంక్ష.
వినీలాంబర దుకూలాల్ని ధరించి
ఎన్నో కలల తారకల్ని
ప్రోవుజేయాలని కోరిక,
నిమ్నగా పథగామినై
ఎన్నో మధురాంబువుల సేదదీరాలని
ఆమ్నాయాక్షర సంచయంలో
ఎన్నో మధుకణాలని
జుర్రుకోవాలని ఆశయం.
ఎన్ని దూరతీరాలు గడవాలో తెలియదు
ఏ భావాలు అందుకోనాలో, ఏ వర్ణాల వికసించాలో
అర్థంకాదు.
ఇక్షురసంలాంటి ఆలోచనాఝురిలో
కుక్షింభరత్వంతో పరిభ్రమిస్తున్నాను.

శ్రీ దేశెట్టి కేశవరావు

ఆర్. శేషశాస్త్రి, శ్రీ జె. సదానందం

# కవిజనాశ్రయకర్తృత్వము - పునఃపరిశీలనము

కన్నడమూ తెలుగూ ఆరంభకాలం నుండి కూడ ప్రక్క ప్రక్కనే జతగా అభివృద్ధిని పొందుతూ వున్నాయి. దానికి కారణాలు సర్వవిదితాలై నందువల్ల ఇక్కడ వివరించాల్సిన పనిలేదు. తెలుగు లక్షణ గ్రంథాల్లో అతి ప్రాచీనమనదగింది కవిజనాశ్రయము. అట్లే కన్నడంలో ప్రాచీన లక్షణ గ్రంథం కవిరాజమార్గ. నృపతుంగుని రచనగా భావింపబడిన కవిరాజమార్గ, పండితుల పరిశోధకుల నిశిత పరిశీలనవల్ల ఈనాడు శ్రీ విజయకృతంగా నిర్ణయింపబడింది. అట్లే కవిజనాశ్రయము కర్త ఎవరన్న విషయంలోనూ ఇంకా తెగని (విడివడని) చిక్కుముడి వుంది. ఆ ముడిని విప్పడానికి చేసిన నూతనమైన మరో ప్రాంజల ప్రయత్నమే ఈ మా వ్యాసం.[1]

కవిజనాశ్రయ[2] కర్తృత్వాన్ని గూర్చి ముఖ్యంగా రెండు వాదాలున్నాయి. ఒక పక్షంవాళ్ళు వేములవాడ భీమకవినీ, రెండవ పక్షంవాళ్ళు మల్లియరేచననూ కర్తగా చెబుతారు. వేములవాడ భీమకవి దీని కర్త అని చెప్పేవాళ్ళకున్న ఆధారాలివి.

1. అప్పకవి మాట.

వికటకవులు కొన్ని వింతలు కల్పించి
కవిజనాశ్రయమునఁ గలిపినారు
వాని గైకొనంగ వలదప్రయుక్తము
లేల సెప్ప భీముజెరిగి యెరిగి.

2. పొత్తపి వేంకట రమణకవి (ఇంచుమించు అప్పకవి కాలమువాడు) "యతులు కవితా మహత్వంబునందాది భీమన్నగారి మతంబున దశవిధంబు లనంబడియె" అని చెప్పడము.

3. జయంతివారు పరిశీలించిన పది కవిజనాశ్రయ ప్రతులలో ఒకదానిలో మిగత ప్రతులలోకంటె అధికంగా ఆరు పద్యాలుండి అందులో-

వేముల వాడను వెలసిన
భీమేశ్వరు కరుణ గల్గు భీమ సుకవినే
గోమటి రేచన మీదను
నీమహిగవులెన్న ఛందమెలమి రచింతున్.

ఆచంద్ర తారకంబుగ
భూచక్రములోన సుకవి పూజితమగుచున్
ఏ ఛందమమరు చుండును
నాఛందము నీదుపేర నమరును రేచా.

రేచన సంతోషింపగ
భూచక్రములోన భీమ పురహరు కృపచే
నేఛందము సుకవుల బ్రదు
కేఛందము తెరువుదానినే రచియింతున్.

నిను నేనె పొగడు వైఖరి
నొనరించెదఁ దెనుగుబాస నొప్పఁగ ఛందం
బును గనక కవిత చెప్పిన
వినవే లచ్చనము వాడు వెంగలిరేచా.

అనే పద్యాలు భీమకవి కోమటిరేచన పేరుమీద ఈ లక్షణ గ్రంథాన్ని వ్రాశాడని తెలుపుతూ వుండడం.

పై నాలుగు పద్యాలేకాక (1) శ్రీకరముగ రేచనపై...... (2) లచ్చన మెరుగని కవులను......; అను పద్యములతోపాటు ఆరు పద్యాల్ని జయంతిరామయ్య పంతులుగారు మూలపాఠంగా స్వీకరించారు. ఇదే 'జ' ప్రతిలోని (1) పరగిన... (2) అసమాన... అనే మరో రెండు పద్యాల్ని అధోభాగమున చూపించారు. వీటిని ప్రక్షిప్తాలని కూడ స్పష్టం చేయలేదు. భీమనను గర్తగా చెప్పే ఆరు పద్యాల్ని మూలంగా స్వీకరించి ఈ రెంటినీ ఎందుకు అధస్సూచికలో చూపారో సమర్థించలేదు. ఇవి ఒకే ప్రతిలో ఉండడం కారణమనుకొంటే పై ఆరు పద్యాలూ 'జ' ప్రతిలో మాత్రమే వున్నాయి కదా! అయితే వేములవాడ భీమకవిని కర్తగా చెప్పబూనిన యీయనకు పై రెండు పద్యాలు "అనన్వయముగా నుండుటచేత నందుఁ బేర్కొనఁబడిన భీమునకును గ్రంథమునకును గల సంబంధ మిట్టిదని నిర్ణయింపవలను" గాకపోయినది. ఈ విషయమును పీఠికలో స్పష్టపరచిన యీతని ప్రామాణికత ప్రశంసనీయము.

కవిజనాశ్రయాన్ని 1951లో శ్రీ నిడదవోలు వెంకటరావుగారు సంపాదించి ప్రకటించారు. వారు పూర్వకల్పితమైన ఒక సిద్ధాంతాన్ని మనసులో పెట్టుకుని ఈ కృతిని సంపాదించినట్లు తోస్తుంది. ఇది వారి సంపాదనా కార్యానికి శాస్త్రీయతను తెచ్చిపెట్టలేదు. రేచనయే దీని కర్త అని దృఢంగా నమ్మిన యీయన 'భీమన' ప్రస్తావన వచ్చే అన్ని పద్యాల్ని (వారి మాటల్లోనే చెప్పాల్సివస్తే) "తొలగించా"రు.[3] వాటినన్నింటిని ప్రక్షిప్తాలుగా భావించారు. "ఒక్క ప్రతిలోనున్నవి" అను కారణముతో వీరు వీటిని తొలగించారు.

ఈ పద్యాలు ఎందుకు ప్రక్షిప్తాలు అయ్యుండరాదని శ్రీ పరబ్రహ్మ శాస్త్రిగారు సందేహాన్ని ప్రకటించారు. "అప్పకవినాటికే కొందరు వింత పద్యములు అల్లి భీమకవిపేర రూఢి చేసినట్లు చెప్పవచ్చును. అట్లాంటిదే జయంతివారు చూపించిన వ్రాతప్రతిలోని అధికమైన ఆరు పద్యాల అవతారిక కావచ్చును." (భారతి, మే, 1988. పు.6)

ఒక కృతిలోని ఒకానొక భాగం ప్రక్షిప్తమా కాదా అని నిర్ణయించడానికి గ్రంథ సంపాదనా శాస్త్రంలో కొన్ని నియమాలున్నాయి. కేవలం ఒకే ప్రతిలో వున్నాయని వాటిని ప్రక్షిప్తాలనడానికి వీలు లేదు. లభించిన ప్రతుల కాలం, పాఠం, మూల పాఠానికి దగ్గరగా ఉన్న పాఠం అనే అంశాల్ని పరిశీలించి జాగ్రత్తగా నిర్ణయించాల్సి వుంది.

పై చూపునకే ఈ పద్యాలు ప్రక్షిప్తాలు కావని తెలుస్తూ వుంది. మన వాదానికి సరికానిదాన్ని ప్రక్షిప్తమని తీసివేయడానికి వీలులేదు. ఇక రెండవ పక్షంవాళ్ళు చూపే ఆధారాలు :

1. యాప్పిరంగలంకారికై అనే తమిళ ఛ్ఛందోగ్రంథంలో 'రేచియర్ సెయ్ద వడుగచ్ఛందం' అని వుంది.
2. ఇది జైనకృతి. వేములవాడ భీమకవి శైవుడు.
3. రేచన పేరుమీద భీమకవి రచించినట్లు తెలిపే పద్యాలు ప్రక్షిప్తాలు.

కవిజనాశ్రయ కర్తృత్వాన్ని నిష్కర్ష చేసేప్పుడు కవిరాజమార్గపు నేపథ్యంలో పరిశీలించడం సూక్తమార్గం. 'కవిరాజమార్గ' మొదట ప్రకటింపబడినప్పుడది నృపతుంగకృతంగా భావింపబడింది. పైచూపున కెక్కడగాని కనిపించని శ్రీవిజయుని కర్తృత్వము నిశిత పరిశీలనద్వార స్పష్టమైంది. ఇటీవలి పరిశోధకులందరూ దీన్నిప్పుడు శ్రీ విజయకృతంగా అంగీకరిస్తున్నారు.[4]

ఇలాగే నిశితంగా పరిశీలిస్తే కవిజనాశ్రయాన్ని కూడ మల్లియ రేచనగాని, వేములవాడ భీమకవిగాని రచించలేదని వేరొక భీమన దీన్ని రచించాడనీ తెలియవస్తుంది.

ఛందః కవిరేచనను పలు విధాలుగా ప్రశంసించాడు. అందులో పేరుతో సంబోధించడమూ, వంశకీర్తనా, పలురీతుల పోలికలు, సౌందర్య వర్ణన, కీర్తిప్రశంస, విభవ వర్ణన, గుణ, చారిత్ర్య, పరాక్రమ, విద్యావైదుష్య స్తుతి, జినధర్మ పరాయణతలు వర్ణించబడ్డాయి. గ్రంథమంతటా వేరొక వ్యక్తి రేచనను సంబోధించినట్లే ఉండడంవల్ల, కవిజనాశ్రయుడు మల్లియరేచన సుకవి కవిజనాశ్రయమను ఛందము తెనుగుబాస నరుదుగ జెప్పెన్." అని రేచనకాక మరొకరు చెప్పినట్లే వుంది. ప్రథమపురుషలో చెప్పబడిన ఈ పద్యాల మధ్యలో ఉన్నట్లుండి శ్రుతులును శ్రుత్యంతంబులు అను పద్యములో సంబోధించడం ప్రారంభమౌతుంది. మరల కడపట మల్లియరేచన సుకవి జనాశ్రయుడీ ఛందంబు జెప్పె జనులకుఁ దెలియన్ అని ప్రథమపురుషతోనే ఈ గ్రంథం ముగిసింది. ఈ వైవిధ్యం ఎందువల్ల? కవి వేరొకడు కావడంవల్లే.

భీమన ఇంతగా రేచననెందుకు స్మరించాలి? జీవి శరీరాన్ని త్యజించిన తరువాత అతని పేరు ఈ లోకంలో ఎన్నాళ్ళుంటుందో అన్నాళ్ళు అతడు ఊర్ధ్వలోకాల్లో నివసిస్తాడనే నమ్మకం వైదికులలోనే కాదు జైనులలో కూడ ఉంది.

తనయుడు చెఱువును కావ్యం
బునిధానము గుడివనంబు భూదేవస్థా
పనమును ననుని య్యేడును
జనుశాస్త్రములందు సప్తసంతతులనగన్.

అప్ప. 1-15

పై ఏడు సంతానాల్లోనూ ప్రశస్తమైంది కృతి.

"సప్త సంతానములలో ప్రశస్తమైన
కృతి లభించుటయే చాల కీర్తికరము."

తనికెళ్ళ ప్రకాశశాస్త్రి, నిశ్శంక కథాంశము

అని చెప్పబడింది. ఇక్కడ సప్తసంతానములలో ప్రశస్తమైన కృతి- అని చదువుకోవాలి. అట్టి కృతిని పొందడం కీర్తికరం అని అర్థం. కృతిని పొందినవానిని (అంకితముగా గొన్నవానిని) కృతిభర్త అనడం కద్దు. కృతిని అంకితంగా కొనడమే సప్తసంతానాల్లో ఒక్కటైతే సంతానానికి అతడు భర్త ఎలా అవుతాడు? కాబట్టి అది రచించిన వానికే సప్తసంతానాల్లో ఒకటవుతుంది. అందుకే కవికి కృతి కన్య అవుతుంది. ఇక్కడ మరో విషయాన్ని గమనించాలి. కృతిని అంకితంగా కొనడం వేరు. తన పేరున వెలయింపజేయడం వేరు. పేరునున వెలయింపజేయడం దత్తు ఇవ్వడం వంటిది.

గురువున కిష్టదైవమునకుం బతికిన్ కృతి చెప్పి పుణ్యమున్
పరమును తేజముంబడయ వచ్చు జగంబుల నిశ్చయంబు

నన్నెచోడకవి. కు.సం. 1-51

అనే నమ్మకం ఉంది. ఆ నమ్మకంతోనే భీమన కవిజనాశ్రయాన్ని రేచన పేరున వెలయింపజేశాడు. కవిరాజమార్గను శ్రీవిజయుడు

నృపతుంగుని పేర వెలయించాడు. భారతారణ్య పర్వశేషాన్ని ఎఱ్ఱాప్రెగడ 'అతనిరచనకా' నన్నయ రచించినట్లే వ్రాశాడు.

ఛందోంబుధికారుడైన నాగవర్మ తన భార్యను సంబోధిస్తూ లక్షణ గ్రంథాన్ని చెప్పాడు. ముద్దణ రామాశ్వమేధంలో ఈ పనే చేశాడు. ఇదొక రచనాతంత్రం. నిను నీవె పొగడు వైఖరి నొన రించెద తెనుగుబాస నొప్పగ ఛందంబు" అన్నదానికి ఇట్టి గ్రంథాన్ని రచింపజేసినందుకు రేచన తన్ను తాను గర్వంతో పొగడుకోవడం అనే అర్థమేగాని గ్రంథంలోని నానా సంబోధనల రూపంలో పొగడుకోవడం అని అర్థం కాదు. ఈ విషయాన్ని గూర్చి తెలియకే తమిళచ్చందో గ్రంథకర్త రేచనయే ఈ ఛందఃకృతిని రచించినట్లు తెలిపాడు. భట్టా కళంకుడనే కవీ ఇలాగే కవిరాజమార్గ ద్నపతుంగకృతమని తెలిపాడు. ఈ అభిప్రాయాలు భ్రమమూలకాలు

దక్షిణ భారతదేశంలో సాహిత్యం ముఖ్యంగా రాజాశ్రయంలో వుండింది. కొన్నిసార్లు రాజాశ్రయాన్ని కోల్పోయి ధర్మాశ్రయాన్ని (మతం) పొందింది. అలాంటి సందర్భాల్లో ఆయా ధర్మానుయాయులైన శ్రీమంతులు కవుల కాశ్రయమిచ్చి గ్రంథరచనను ప్రోత్స హించారు. దానచింతామణి అని ప్రసిద్ధమైన అత్తిమబ్బె పొన్న, రన్న కవులకు ఆశ్రయాన్నిచ్చింది. ఇదే మేల్పంతిగా పణి గ్వంశ చూడామణి మల్లియరేచన భీమనకు ఆశ్రయాన్నిచ్చాడు. రాజాశ్రయంలో అభివృద్ధి పొందిన సాహిత్యం మూడు విధాలుగా వుంది. (1) ఆశ్రయదాత పేరు స్థిరస్థాయిగా వుండాలని అతని పేరుమీదుగా వ్రాయడం. (ఇది చాలవరకు గ్రంథాల్లోనే జరిగివుండడం గమనార్హం) కవిరాజమార్గ, కవిజనాశ్రయాలు ఈ రీతిగానే వచ్చాయి. (2) కృతిని వ్రాసి అంకితమివ్వడం. ఈ పద్ధతి తెలుగులో మిక్కిలి ప్రచారంలో ఉం(డిం)ది. (3) పురాణ పురుషుడిని తన రాజుతో సమీకరించి తన్మూలకంగా అతని కీర్తి చిరస్థాయి అయ్యేట్లు చెయడం. (ఈ పద్ధతిని కన్నడ జైనకవులు విశేషంగా పెంచారు.)

అయితే ఇక్కడ మల్లియరేచన ఇచ్చే ఆమిషానికి బలియై భీమన అతని పేరుమీద రచించాడనుకోవడం సాధువు కాదు. అసమాన దాని, రవితనయ సమానోన్నతుడైన వాచకాభరణుని మిత్రుడు ఈ భీమన. అతడిలా చేసివుంటాడనుకోవడం ఇతిహాసకారులు ఆ యిరువురికి అన్యాయం చేసినట్లే అవుతుంది.

మల్లియరేచనకు ఛందః పరిజ్ఞానమే లేదా? అట్లని భావించాల్సిన పనిలేదు. శ్రీవిజయుడు "నృపతుంగ దేవాను మతదిం" చెప్పినట్లే ఇక్కడా 'మల్లియరేచన చెప్పడం' అంటే అతనికి ఛందః పరిజ్ఞానమున్నదన్నమాట. అతని అభిప్రాయాలూ అతనికున్నాయి.

వేములవాడ భీమకవినే కర్తగా చెప్పడానికి ఆధారంగా చెప్పే పద్యాల మాట ఏమిటి? రేచనకర్త కాకున్నా వేములవాడ భీమకవిని కర్తగా ఈ పద్యాలు చెబుతున్నాయి కదా అని వాదించేవాళ్ళకు సమాధానమిది.

వేములవాడను వెలసిన
భీమేశ్వరు కరుణ గల్గు భీమసుకవినే
కోమటిరేచన పేరున
నీ మహి గవులెన్న ఛంద మెలమిరచింతున్.

రేచన సంతోషింపగ
భూచక్రములోన భీమ పురహరుగృపచే
నే ఛంద మమరుచుండును
నాఛందము నీదుపేర నమరును రేచా.

అనే రెండు పద్యాలు మార్పునకు గురైనాయి. వీటి వాస్తవపాఠాలు-

వేములవాడను వెలసిన
నేమీశ్వరు కరుణగల్గునే భీమకవిన్
కోమటిరేచన పేరున
నీ మహి కవులెన్న ఛంద మెలమిరచింతున్.

రేచన సంతోషింపగ
భూచక్రములోన భీమపుత్రుని కృపచే
నే ఛందమమరుచుండును
నా ఛందము నీదుపేర నమరును రేచా. అనేవి.

వేములవాడలో భీమేశ్వరాలయం ఉండటంవల్లో నేమి అనేది తెలియకపోవడంవల్లో పైవిధమైన మార్పు జరిగివుండాలి. ఈ గ్రంథరచనాకాలానికి వేములవాడలో బద్దగేశ్వరాలయమేగాని భీమేశ్వరాలయం లేదు. కాలక్రమంగా బద్దగేశ్వరాలయమే భీమేశ్వరాలయమయ్యుండాలి. ఇప్పటి భీమేశ్వరాలయంలో దొరికే శాసనాల్లో భీమేశ్వరాలయ ప్రసక్తే లేదు. కాబట్టి ఇది బద్దగేశ్వరాలయమే అయ్యుండాలి. ఈ వేములవాడలో యశస్తిలక చంపుకర్త సోమదేవసూరి నిర్మించిన ఒకానొక జైనతీర్థంకరుని బసదిని గూర్చిన శాసనం ఒకటి దొరుకుతూ వుంది. పూర్వం ఇదొక జైనకేంద్రం అనేది నిర్వివాదాంశం.

"కవిజనాశ్రయకర్త వేములవాడ భీమకవి కాదని బ్ర.శ్రీ. వీరేశలింగము పంతులుగారును, మానవల్లి రామకృష్ణగారును, చిలుకూరి వీరభద్రరావుగారును అభిప్రాయపడియున్నారు. అదియే సత్యమని నా యభిప్రాయము" అని శ్రీ చాగంటి శేషయ్యగారు సెలవిచ్చారు.[5]

"అప్పకవీయములో బిందుయతికి లక్ష్యముగా భీమన చాటు పద్యంచం॥ గరళపు......ఉన్నది. ఈ (శైవ) భీమనయే కవిజనాశ్రయ కర్త అయితే ఈ వళిభేదము తన లక్షణగ్రంథములో ఎందుకు

పేర్కొనలేదో[6] అని విద్వాన్ రావూరి దొరసామి శర్మగారు అభిప్రాయ పడ్డారు.

వేములవాడ భీమకవియే దీన్ని రచించివుంటే, ఈ గ్రంథం నన్నయ్యకు తరువాత రచింపబడినదౌతుంది. అపుడు ఈ గ్రంథకర్త నన్నయ్య ప్రయోగాలను గమనింపకపోవడం జరుగదు. అప్పకవి ల-శ-డ ల మైత్రిని చెప్పినాడు. ల-ళ ల మైత్రికి ఆదిపర్వంలోనే ప్రయోగముంది. కాని కవిజనాశ్రయంలో ఇది చెప్పబడలేదు. నన్నయ భారతాన్నే లక్ష్యంగా పెట్టుకొని కవిజనాశ్రయం రచింపబడింది అనేమాట అంగీకార్యం కాదు. ఇందులోని, తెలుగు కవిత్వానికి ఆయువుపట్టనదగిన యతిప్రాసలు నన్నయ భారతాన్నే లక్ష్యంగా గలిగినవి కావు. ఇందులోని లక్షణాలకు నన్నయ భారతంలో లక్ష్యాలు దొరికినంత మాత్రాన అవే ఇతనికి లక్ష్యాలు అని చెప్పడం పొసగదు.

నన్నయకు పూర్వమే ఈ గ్రంథం రచింపబడిందనడానికి గ్రంథస్థంగానే నిదర్శనం దొరుకుతుంది.

7 పరగిన విమల యశోభా
సురచరితుడు భీమనాగ్రసుతుఁ డఖిలకళా
7ఎ పరిణతుఁడయ్యెను భాసుర
వరప్రసాదోదితధ్రువ శ్రీయుతుడై

అనే పద్యంలో భీమనాగ్రసుతుడు స్మరింపబడ్డాడు.

7 అసమాన దాన రవి తన
య సమానోన్నతుడు[7]బి వాచకాభరణ ప్రా
ణ సమాన మిత్రుఁడీకృతి
కి సహాయుడుగా నుదాత్త కీర్తిప్రీతిన్.

అనే పద్యంలో వాచకాభరణుని ప్రస్తావన ఉంది.

ఈ భీమనాగ్రసుతుడూ, వాచకాభరణుడూ ఎవరు?

పై పద్యాల్ని కుర్క్యాల శాసనపు నేపథ్యంలో విశ్లేషించిన శ్రీపి. వి. పరబ్రహ్మశాస్త్రిగారు "పరగిన విమలయశో......ఈ పద్యం ముందటి ఒకానొక పద్యంలోకి సాగినట్లనిపిస్తుంది. ఈ కృతి ఆరంభంలో జైన పరమైన స్తుతి పద్యాలుండి తరువాత 'గురు యతి గణముల పాదాంబురుహంబుల కెరగి' అని ఛందః పారిభాషిక పదాలతో శ్లేషలో జైనగురు ముసివృందానికి నమస్కరించాడు. తరువాతి పద్యం అతని గురువును గూర్చినదయ్యుండాలి. అందుకే అధికారాంత్యంలో తానే చెప్పుకొన్న వాదీంద్ర చూడామణిని గూర్చినదే అయ్యుండాలి. పంపనికి వాదీంద్ర చూడామణి అనే బిరుదు ఉండడం ఇంకా స్పష్టం కాని కారణాన ఇతడే పంపడని చెప్పడం కష్టం.' అని అభిప్రాయ పడ్డారు. ఈ కృతిలో ఉల్లేఖితుడైన వాచకాభరణుడు పంపని తమ్ముడైన జినవల్లభుడే అని వీరు సహేతుకంగా నిర్ణయించారు.

కన్నడంలో విక్రమార్జున విజయాన్ని రచించినవాడు పంప మహాకవి. అతని తమ్ముడే కుర్క్యాల శాసనంలో కీర్తితుడైన జినవల్లభుడు. వీరిరువురి తండ్రి పేరు భీమపయ్య. అందుకే పెద్దవాడైన పంప మహాకవిని భీమనాగ్రసుతుడనీ, చిన్నవాడైన జినవల్లభుని అతని బిరుదనామంతో వాచకాభరణుడనీ ఈ గ్రంథకర్త తెలిపాడు. కుర్క్యాల శాసన పరిసరకాలంలో వాచకాభరణుడనే బిరుదం జినవల్లభున కొక్కనికే సాహిత్యంలో కనిపిస్తున్నందువల్ల కవిజనాశ్రయంలో కీర్తితుడు జినవల్లభుడే అని నిస్సంశయంగా చెప్పవచ్చు.

వాచకాభరణుని (జినవల్లభుని) ప్రాణసమాన మిత్రునిగా చెప్పినందువల్ల అతడే భీమనాగ్రసుతు డనుకోవడానికి వీలులేదు. ప్రాణసమాన మిత్రుడు సాయము చేస్తాడేగాని అతడు చేసే సాయం కృప అనిపించుకోదు. కాబట్టి ఇది తప్పక పంపని గూర్చిన మాటే అయ్యుండాలి. ఇంతకుముందు మనం గమనించిన "పరగిన విమలయశోభా సురచరితుడు......అనే పద్యం తరువాత ఉండవలసింది— "రేచన సంతోషింపగ......"అనే పద్యం. అలా ఉన్నప్పుడు భీమనాగ్రసుతుని ప్రస్తావన వచ్చే పద్యం అర్ధాంతరంగా ఆగిపోక ముందుకు సాగినట్లౌతుంది.

శ్రీయుత పరబ్రహ్మశాస్త్రిగారు అధికారాంత్యంలో ఈ కవి తన గురువుగా చెప్పుకొనే వాదీంద్ర చూడామణికి భీమనాగ్రసుతునికి ఎందుకు ముడివేశారో తెలియదు. అధికారాంత్యంలో వచ్చిన గురు స్మరణ అవతారికా పద్యాల్లో రావాల్సిన అగత్యంలేదు. అది నియమమూ కాదు. ఈ దృష్టితో చూస్తే వాదీంద్ర చూడామణియే వేరు. భీమనాగ్రసుతుడే వేరు అనేది స్పష్టం.

భీమసుకవి ఈ కృతిని వ్రాసేప్పుడు జినవల్లభుడు సహాయానికి నిలిస్తే, ఇరువురికీ పెద్దవాడైన పంపడు ఈ ప్రయత్నానికి ఆశీస్సుల్ని అందించాడు. అంటే ఈ కృతి పంపడు ఇంకా జీవించి వున్నప్పుడే అంటే కుర్క్యాల శాసనకాలానికి కొంచెము పూర్వం రచింపబడి వుండాలి.

ఈ కవి కవిరాజమార్గను అనుసరించినందువల్లా, పంప భారతాన్ని బాగుగా చదివి అందలి కర్ణపాత్రయొక్క స్నేహధర్మాన్ని ఆకళించుకొని తన మిత్రుడైన వాచకాభరణుని కర్ణునితో పోల్చడంవల్లా ఇతనికి కన్నడంతో పరిచయం ఉందనీ తెలుస్తుంది. 'పంపకవి యమౌల్యప్రసార' అనే వ్యాసంలో డా॥ ఎం. చిదానందమూర్తిగారు ఎత్తి చూపిన పంపని కాలంనాటి మౌల్యాలలో స్నేహధర్మమూ ఒకటియ్యుంది, ఈ ఉపమానమూ దాన్ని ఉద్దేశ్యంలో పెట్టుకొన్నదే అని చెప్పవచ్చు.

వాచకాభరణుడు కవితలో ఇతనికి సాయం చేయగలిగినవాడేనా? అన్న శంకకు కుర్క్యాల శాసనమే సమాధానాన్నిస్తుంది. అందలి

మూడు కందపద్యాలు ఇతనికి కవిత్వంతో పరిచయమున్నట్లు తెల్ప డమే కాదు, ఆనాటి తెలుగువారూ ఇతణ్ణి 'జితకవి' అని పొగడినారన్న తరువాత ఇతని కవిత్వ పరిచయాన్ని శంకించాల్సిన అవసరం లేదు. జైనధర్మం క్షీణించిన తరువాత కన్పించకుండా పోయిన జినేంద్ర పురాణము, గజాంకుశుని కొన్ని కృతులతోపాటు జినవల్లభుని కృతులూ కాలగర్భంలో కలసిపోయుండాలి.

జినవల్లభుడూ, పంపమహాకవీ నన్నయ్యకంటె పూర్వులు. వారికి సమకాలికుడైన భీమన నన్నయ కావ్యాన్ని లక్ష్యంగా పెట్టుకొనే అవకాశంలేదు.

ఇతడు జైనుడైనందువల్ల నన్నయ్య పద్యాల్ని లక్ష్యాలుగా స్వీకరించలేదనడమూ భావ్యంకాదు. ఇక్కడ కావ్యధర్మమే ముఖ్యం గాని ధర్మం (మతం) కాదు. పంప మహాకవి ఈ రెంటి భేదాన్ని స్పష్టంచేస్తూ[8] "అరివుదు ధర్మ ముమం కావ్యధర్మ ముమం" అని చెప్పాడు. కన్నడ గ్రంథాల్లో వైదిక, వీరశైవ జైనగ్రంథాల్నుండి ఉదాహరణలు తీసికోబడ్డాయి. కవిరాజమార్గకారుడు రామాయణం నుండి లక్ష్యాల్ని స్వీకరించాడు.

కవిజనాశ్రయం నన్నయ్యకు పూర్వమే రచింపబడినా నన్నయ్యకు కుందేమీ లేదు. ఆయన భారతంతో సరితూగగల్గిన మరో గ్రంథం ఆయనకంటె పూర్వం రచింపబడింది దొరికేంతవరకు నిస్సంశయంగా నన్నయ్యే ఆదికవి.

ఆంధ్రదేశంలో క్రీ.శ. 1000 తరువాత జైనధర్మం క్షీణింప సాగింది. నన్నయ తరువాత కవులు వైదిక ధర్మోద్ధరణకు దేశీయ భాషలో రచనలు సాగించినారు. నన్నయ్య "కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడన్" రచించిన తరువాత, ఆ వేళకు రచింపబడిన జైనకృతులు వెనుకబడ్డాయి. కవిజనాశ్రయం మాత్రం లక్షణగ్రంథమైనందువల్ల నిలువగల్గింది.

జైనధర్మ ప్రభావం ఎప్పుడు తగ్గిందో అప్పుడే ఈ కృతిలోని పాఠాలను ఇష్టం వచ్చినట్లు మార్చడమూ జరిగింది. అంతేకాదు 14శ॥ తరువాత ఆవేళకు వుండిపోయిన వర్ణరంజిత వ్యక్తిత్వాన్ని కల్గిన వేములవాడ భీమకవికి 'భీమన' అనే పేరులోని సామ్యతవల్ల ఈ కృతి కర్తృత్వాన్ని జోడించారు. దానికి తగినట్లే భీమన కృతికర్త అని చెప్పే పద్యాల్ని కూడ మార్చినారు.

భీమన కర్తృత్వాన్ని తెలిపే ఆరు పద్యాల్లోని రచన, శైలి భాష, ఆ గ్రంథ రచనాకాలంలోని భాషతో సరిపోతాయా అనే ప్రశ్న ఉదయించవచ్చు. జైనుడైన భీమనన్నుండి శైవుడైన భీమనకు కర్తృత్వం మారే సమయంలో నానారీతులుగా పాఠాన్ని మార్చడం జరిగింది. మార్పును పొందిన పాఠం కవి మూలపాఠానికి దూరం గావడం సహజమే. అయినా అందులో కొద్దిగా మార్పుల్ని చేసి మూల పాఠాన్ని తిరిగి సాధింపవచ్చు. నిను నీవె......అను పద్యంలో 'ఛందంబును గనక కవిత చెప్పిన వినవే లచ్చనమువాడు వెంగలి రేచా!" అన్నదాన్ని "ఛందంబును గనక కవిత చెప్పిన వినవే తక్షణము వాడు వెంగలిరేచా!" అని చదువుకోవాలి. మిగిలిన పద్యాలకీ ఇలాగే కొన్ని దిద్దుబాట్లను పూర్వమే సూచించడం జరిగింది గదా! అనేక రీతులుగా మార్పును పొందిన పాఠాల్నిబట్టి ఆ పద్యాలే ప్రక్షిప్తాలనడం సబబు కాదు. గ్రంథ సంపాదనా శాస్త్రపరంగా చూస్తే అలాంటి ఆలోచన తప్పుకూడ.

కవిజనాశ్రయాన్ని 1951 సం॥ పునర్ముద్రించిన శ్రీ నిడదవోలు వెంకటరావుగారు తమ ముందుమాటలో చెప్పిన (అధోజ్ఞాపిక పు-38) ఇది కర్నాటభాషలో నాగవర్మచే క్రీ.శ. 990 ప్రాంతమున రచితమగు ఛందోంబుధి ననుసరించి రచితమైనది" అనేమాట అంగీకార్యం కాదు. ఇతడు ఛందోంబుధినే అనుసరించి వుంటే కేవలం ఛందస్సునే చెప్పివుండేవాడు. కాని కవిరాజమార్గంలోలాగా కావ్య లక్షణాల్ని దోషాధికారాన్ని కూడ చెప్పాడు. కాబట్టి ఈ ముగ్వురూ స్మరించిన మరొక కవి వీరికి మార్గదర్శకుడయ్యుండాలి. అతడే జయదేవుడు. నాగవర్మ, శ్రీ విజయుడు ఇద్దరూ జయదేవుడిని స్మరించారు.

జయదేవాద్యర ఛందో
న్వయ ప్రయోగ తరమాదు వంపేరటని
ర్ణయ మాగి రలింపట్ప్రి
త్యయమం చెల్వాగె పేళ్వెనంబుజవదనే

నాగవర్మ - ఛందోంబుధి

జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియరేచన సుకవి జనా
శ్రయుడీ ఛందంబు చెప్పె జనులకు నొనరన్.

—కవిజనాశ్రయము

ఇక్కడ రెంటికిని సామ్యముంది. అలాగే దోషాధికారం కావ్యలక్షణం చెప్పడం, వేరొకరి పేరుమీద గ్రంథరచన చేయడంవంటి వాటిలో కవిరాజమార్గంతో పోలికలున్నాయి. కవిజనాశ్రయంలో రగడల ప్రస్తావన లేదు. కవిరాజమార్గంలోనూ లేదు. కాబట్టి ఈ కవి కవిరాజమార్గనే హెచ్చుగా అనుసరించాడని చెప్పవచ్చు. నాగవర్మ ఛందోంబుధితో పోలికలకు జయదేవు ననుసరించడమే కారణం.

తెలుగులో జైన సంప్రదాయాల్ని తెలిపే గ్రంథాల్లో ఇది ఒకటి అన్న అభిప్రాయం సరికాదు. ఈ గ్రంథంలో జైన సంప్రదాయాలెక్కడా చెప్పబడలేదు. ఒక ధర్మాన్ని ప్రచారం చేయడం ఈ గ్రంథంయొక్క ఉద్దేశ్యం కాదు. ధర్మప్రచారం లక్షణగ్రంథాల

ద్వార జరగడం అరుదు. అయినా కావ్యత్వం ధర్మంతో కట్టుబడింది కాదు. ఛందస్సులలో జైన ఛందస్సు వైదికఛందస్సు అని వేరుగా లేవు.

కవిజిహ్వాబంధనకారుడైన ఈశ్వరకవి (క్రీ.శ. 1500) తాను తెలుగు ఛందోగ్రంథాన్ని ఆధారంగా చేసుకొని తెలుగువడులను గూర్చి తెలుపుతానన్నాడు[9]. అతడు కవిజనాశ్రయంలోలాగే వడుల్ని విభజించాడు. సంయుక్తాక్షర యతిని మాత్రం ఎక్కువగా చెప్పాడు. అతనికాలంనాటికి బహుశ సంయుక్తాక్షర యతి ప్రచారం లోకి వచ్చివుంటుంది. 15వ శతాబ్దివాడైన అనంతుడు సంయుక్త యతిని చెప్పడం దీనికి నిదర్శనం. సిద్ధ సాధ్య సంయోగాలలో సిద్ధ సంయోగంలో ప్రథమాక్షరానికి సాధ్య సంయోగాలలో రెండవ భాగంలోని మొదటి అక్షరానికి వడిని కూర్చుచున్నందువల్ల ఆయా స్థానాల్లో అవి సరసవడికో, ఎక్కటి వడికో, వర్గవడికో చెందుతున్నందు వల్ల ప్రత్యేకంగా సంయుక్తాక్షర వడిని చెప్పనవసరము లేకపోయి నది. అందుకే కవిజనాశ్రయకారుడు చెప్పలేదు. కాలక్రమములో ఈ వడిని మరికొన్నిచోట్ల పై నియమాన్ని తప్పిచేసడంవల్ల అనంతుడు మొ॥వారు దీన్ని ప్రత్యేకంగా చెప్పడం జరిగింది.

మా యీ ప్రయత్నం కేవలం ప్రాథమికస్థాయి అంతే. కవి జనాశ్రయాన్ని ఇంకా సూక్ష్మంగా, లోతుగా పరిశీలించాల్సిన అగత్యం ఎంతో ఉంది. కవిజనాశ్రయాన్ని విశ్లేషించడమంటే అది ఒక రీతిగా మొత్తం తెలుగు సాహిత్యాన్నే విశ్లేషించి నట్లవుతుందనేది సత్యం. కవిజనాశ్రయాన్ని విశ్లేషించడం, అథవా అర్థం చేసుకోవడంద్వార పద్యవిద్యకు ఆద్యుడైన నన్నయ ఒరవడి ఏమిటి అనేది తెలుసుకో వచ్చు. ఇలాగే ఏ కవినైనా అర్థం చేసుకోవాలంటే, అతనికి పూర్వం పొడసూపిన కావ్య సంప్రదాయాలేవి అనేదాన్ని తెలుసుకొంటే తప్ప ఆ కవియొక్క "ప్రదానం" ఏమిటి అనేది తెలియదు. ఒక కవి తరు వాత వచ్చిన లక్షణ గ్రంథాల్నిబట్టి వెనుకటి కవిని వాని కావ్యాన్ని చూడడం కొంతవరకు అవైజ్ఞానికము అనిపిస్తుంది. ఈ దిశలో ఆలోచించి సంయుక్తాక్షర వడి ఇతిహాసాన్ని ప్రత్యేకమైన వ్యాసంగా వ్రాసే ఉద్దేశమూ మాకుంది.

అధఃసూచికలు

1. ఈ వ్యాసాన్ని సిద్ధం చేయడంలో మాకు సాయపడిన డా॥ టి. కోటేశ్వరరావు, శ్రీ గడియారం రామకృష్ణశర్మ, డా॥ ఎమ్. చిదానందమూర్తి, డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి, డా॥ పి. యల్. శ్రీనివాసరెడ్డి గారలకు మా కృతజ్ఞతలు.

ఈ వ్యాసాన్ని చదివి పత్రికాముఖంగా కాని, మాతో నేరుగా ఉత్తరాలమూలకంగా గాని పరిశోధనాసక్తులు తమ ప్రతి క్రియను వ్యక్తం చేయాల్సిందిగా విన్నపం.

2. ఈ కవిజనాశ్రయాన్ని మొట్టమొదట సంపాదించి ప్రకటించిన ఘనత శ్రీ జయంతిరామయ్య పంతులుగారికి చెందుతుంది. ఈ పుస్తకం మూడుసార్లు ముద్రణను పొందింది. రెండవ ముద్రణలో "కొన్ని మార్పులు" చేయబడినవి.

నిడదవోలు వెంకటరావుగారి వంటి విద్వాంసులు పరిశోధనలో ఇలాంటి భావావేశానికి గురికావడం మాకు ఆశ్చర్యకరంగా వుంది. భావావేశం ఒక్కోసారి మనం ఏం చెబుతూ వున్నా మన్నదాన్ని, మరియు చెబుతూ వున్న అభిప్రాయాన్ని సమ ర్థించే తర్కాన్ని జోడించడాన్ని తప్పిస్తుంది. చూ. కవిజనా శ్రయము - నిడదవోలు వెంకటరావు, పు-27. పేరా-1.

4. శ్రీ నృపతుంగదేవానుమతమప్ప శ్రీ విజయకృత కవిరాజ మార్గం. సం. ఎం. వి. సీతారామయ్య 1968.

5. తిమ్మకవి : సులక్షణసారము : (సం) శ్రీ చాగంటి శేషయ్య పీఠిక.

అనంతుడు: అనంతుని ఛందస్సు(సం) శ్రీ రావూరి దొరసామి శర్మ. పీఠిక.

7. జయంతిరామయ్యగారు ఈ రెండు పద్యాల్ని అధఃసూచికలో చూపించారు.

ఎ. పరిణతుడయ్యెను. భూసురవరుడు. జ. రామయ్య

యాచకాభరణుడు. జ. రామయ్య.

8. ఆదిపురాణము, పంప మహాకవి, పు-8, సం. డా॥ ఎల్. బసవరాజు, 1-37

పడియెంబుదు తెలుగింపే
కైదెగల్లదె కన్నడక్కె పేళిదు దిల్లం
మడదినిన గరియ పేళ్వెం
కడురాగదొళాంధ్రమార్గ కాణిసిదనితం

జిహ్వాబంధన 2-18



# కానుక

## శ్రీ సి. కామేశ్వరరావు

అనంత వినీల గగనంలోంచి
భువికి దిగి వచ్చిన
పాల నురుగుల
శీతల చంద్ర చంద్రికవై –
ప్రశాంత ప్రకృతి సౌందర్యంలోంచి
ఊపిరు లూదుతున్న
పారిజాత పరిమళాల
అమృత నిష్యందినివై –
నిశాంత సంధ్యా దీధితిలోంచి
ఇలాతలం నుదుటిపై విరిసిన
కెంజాయ కెంపుల
జరీ తీవెల నికుంజానివై –
నేత్రాంచల సీమల్లోంచి
హృది గదిలో వెలిగిన
కరుణ కిరణ
భావామృత తరంగానివై –
శిల్పి ఊహల ఉలిలోంచి
శిల్పీకరించబడిన
నిత్య నూతన అతిలోక
సౌందర్య వారాశివై –
కవి కలంలోంచి
అవతరించిన అక్షర
శబ్ద చిత్రమాలికా
మంజుల భాషా వధూటివై –
రస మానస వీణానాదంలోంచి
జాలువారిన గాన సుధా
లోలిత లలిత లావణ్య
సుస్వర సంగీత రవళివై –
ఈ నిశీథమున నా యింటికేతెంచి....
వేదనా భరితమై
శకలాలుగా విడిపోయిన
నా ప్రత్యణువును పులకింపజేసిన
ఓ చైతన్యజ్యోతీ....! నీకు
కానుకగా నేనేమివ్వగలను....

అజరామరమై
ఆపాత మధురమై
ఆలోచనామృతంగా విరిసిన
ఈ కవితా పుష్పంగాక—!

# అగ్నిస్పర్శ

## శ్రీ నిఖిలేశ్వర్

ఆత్మీయతలో అనురాగ స్పందన
విద్యుత్ జలదరింపుతో
అగ్నిస్పర్శ
ఒక అంతరంగ జ్వాల
కాలడం కాల్చడం
దానికున్న ఏకైక స్వభావం.
పాపం పుణ్యం
భగ్గుమనే క్షణం,
లోలోపల రగిలిన
అపరాధ భావం – పశ్చాత్తాపం
ఆ స్పర్శ ముందూ వెనకాలే....!
స్నేహతరంగంలోని
బడబాగ్ని చుంబించగానే
ఉత్తుంగ కెరటాలతో
నీటి తుంపరల పెదాలపై
జిగేలున మెరిసే సుఖానందం
ప్రతి స్పర్శలో నిరంతరం
చలించే ఒక మానవానుభూతి!!

## వేములవాడ భీమకవి-
## మైలమ భీముడు

కవిజనాశ్రయ కర్తృత్వమును గురించి విచారణ జరుపుచు ప్రసక్తాను ప్రసక్తముగ భీమకవి కాలనిర్ణయమునకు గడంగి డా॥ శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు రవికుమార్‌గారితో వివాదమునకు దిగి, ఇతఃపూర్వము పరిశోధకులు, సాహిత్య విమర్శకులు నిర్ణయించిన 11, 12 శతాబ్దములనిగాక క్రీ॥శ॥ 1327 - 1400ల మధ్యకాలమని, అందుచే భీమకవి 14 వ 15 వ శతాబ్దములవాడని తెల్పిరి. ఇందులకు వారు బహుగ్రంథావలోకనము, గావించి, శ్రమించి, పూర్వరచనల ఖండించుచు, తగు ఉపపత్తుల జూపుచు, తమ నిర్ణయమును సమర్థించుకొన యత్నించిరి. అట్టి ప్రయత్నములలో వారు మైలమభీముని ప్రసక్త దెచ్చి మైలమభీముడు భీమకవి సమకాలీనుడగునని తెల్పిరి. అయితే మైలమభీముడు 11, 12వ శతాబ్దులవాడని, నిరూపించుచు నేను వ్రాసిన వ్యాసమింకను ప్రచురింపబడలేదు. శ్రీ శ్రీరామమూర్తిగారి నిర్ణయము 1327-1400కాగా నా నిర్ణయము క్రీ॥శ॥ 1077-1140 సంవత్సర మగుచున్నది. ఈ వ్యత్యాసమునకు మూలకారణ మన్వేషింపబడవలసి యున్నది.

భీమకవి సమకాలీనులని చెప్పబడువారిలో అనంతవర్మ చోడగంగు (రాజకళింగగంగు) ముఖ్యుడు. భీమకవి తన పేరును కళింగగంగు పేరును ఉట్టంకించుచు చెప్పిన చాటుపద్యము దీనికి తార్కాణము.

ఉ॥ వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామముమాని కోపమున సందడి దీఱిన రమ్ము పొమ్మనెన్
మోమునుజూడ దోషమిక ముప్పది రెండు దినంబులావలన్
జామున కర్థమందతని సంపద శత్రుల జేరుగావుతన్

ఈ చాటువు భీమకవిది కాదనుటకు వీలులేదు. తన పేరును, తన్నవమానించిన అవజ్ఞుని పేరును స్పష్టముగ జెప్పిన ఈ పద్య మితరులు చెప్పినదని వాదించుట వెర్రితనము. అనంతవర్మ చోడగంగుని రాజ్యకాలము క్రీ॥శ॥ 1077-1140 అని చారిత్రకుల నిర్ణయము కావున భీమకవిగూడ నా కాలమునాటివాడై యుండుట హేతుబద్ధమే!

మైలమభీమునిపై భీమకవి చెప్పెనన్న చాటుపద్యమిది :-

చ॥ గరళపు ముద్ద లోహమవ గాఢ మహాశని కొట్టు సమ్మెటల్
హరు నయనాగ్ని కొల్మి యురగాధిపు కోరలు పట్టుకార్లు, ది
క్కరటి శిరంబుదాయ, లయకాలుడు కమ్మరి, వైరి వీర సం
హరణ గుణాభిరాముడగు మైలమభీముని ఖడ్గసృష్టికిన్॥

ఇది వేములవాడ భీమకవి ప్రణీతమని గతానుగతికముగ నమ్మి, దాని నాధారముగ చరిత్రను నిర్ణయించుట అనుశ్యూతముగ వచ్చుచున్నది. చాటుధారల నమ్మి చరిత్రాంశముల నిర్ధరించు టన్నివేళల నభిలషణీయము, అనుసరణీయము గాదు. అట్టి నిర్ణయము లొక్కొక్కప్పుడు అపసిద్ధాంతములకు దారితీయును.

మైలమ భీముని వ్యక్తిత్వ నిరూపణములో నేను "ఈతడు ఏఱువ తొండయరాజులు మైలమదేవుల పుత్రత్రయములో రెండవవాడ"ని నిర్ధారణ చేసితిని. ఈతని సోదరులు ఉదయాదిత్య గోకర్ణులు. గోకర్ణుడు క్రీ॥శ॥ 1115-1118 సంవత్సరముల మధ్యవాడని, భీమ గోకర్ణులత్యంత ప్రేమాభిమానములతో నెట్టి పొరపొచ్చెములు లేక పరస్పర సుహృద్భావము వెలిబుచ్చుచు రాష్ట్రపాలనము జరిపిరని చరిత్రవలన దెలియనగుచున్నది.

గోకర్ణుని తల్లియైన మైలాంబ వ్రాయించిన పానుగల్లు శాసనములో గోకర్ణ చోడుని ప్రశంస గలదు. అటులనే ఉదయాదిత్యుడు భీమ గోకర్ణుల కగ్రజుండనియు మైలాంబ కుమారుడనియు (హై. శా. సంఖ్య 36) శాసనమున గలదు. అందుచే ఉదయాదిత్య భీమ గోకర్ణులేక గర్భజనితులని, అందు భీమునకు మైలమ భీముడను పేరు కలిగి వినుతికెక్కెనని చెప్పబడుచున్నది.

వేములవాడ భీమకవిచేగాక అమృతనాథుడను కవిగూడ ఈ మైలమ భీమునిపై నొక చాటుపద్యము చెప్పెనని కవిసర్పగారుడము"న వక్కాణింపబడియున్నది.

ఈతనిగూర్చి శ్రీ నిడదవోలు వేంకటరావుగారు భారతి సం. 13 భాణపుట 436లో "ఈ తెలుగుకవి రచించిన గ్రంథమేదియు చిక్కుటలేదు. ఈతడు మైలమ భీమునిగూర్చి చెప్పిన పద్యమొకటి "కాచన బసవన" తన కవిసర్ప గారుడమున నుదహరించినాడు. పేరునుబట్టి చూడ నీతడు జైనుడనియు- మైలమభీముని సమకాలికుడగుటచే క్రీ॥శ॥ 1050 సంవత్సర ప్రాంతమువాడని యూహించుట కవకాశము గలుగుచున్నది.

కాచన బసవన (కాచిరాజు బసవన్న) "కవిసర్ప గారుడము" అను లక్షణగ్రంథము రచించినవాడు. లక్షణ గ్రంథముల రచించిన పూర్వకవుల నెన్నుచు లక్షణసార సంగ్రహమను గ్రంథమును వ్రాసిన "చిత్రకవి పెద్దన" ఈ బసవన నిట్లు స్తుతించినాడు.

ఉ॥ త్రక్షపరప్రసాద కవితాఢ్యుని వేములవాడ భీము, న
య్యక్షత భక్తి విస్ఫురదనంతు, ననంతు గవిత్వ లక్షణా
ధ్యక్షులు గాచిరాజు బసవార్యుని, భైరవు నూత్న దండి వా
గ్వీక్షణకర్ణ నేతయగు వెల్లకి తాత బుధేంద్రు నెన్నుదున్

క్రీ॥శ॥ 1483, 1486 సంవత్సరముల కందాళ అణ్ణ పండితుని శాసనములు రెండు తిరుపతి దేవస్థానము నందున్నవి. ఈ అణ్ణ పండితుని శిష్యుడే "చిత్రకవి పెద్దన". అందుచే చిత్రకవి పెద్దన క్రీ॥శ॥ 1510-1570 నడుమనుండెనని చెప్పవచ్చును. చిత్రకవి పెద్దనచే స్మరింపబడిన లక్షణ గ్రంథకారులెల్లరు అంతకుముందున్న వారనుట యొప్పును గదా! కాచిరాజు బసవన ఆ విధిని చిత్రకవి పెద్దనకంటె పూర్వీకుడుగాన క్రీ॥శ॥ 1480-1530 ప్రాంతమువాడని చెప్పవచ్చును. ఈ కాలము ఇంకను వెనుకకుపోయిన దనుకొనిన అనుకొనవచ్చునుగాని క్రీ॥శ॥ 1530 దాటియుండనేరదు.

కాచిరాజు బసవన తన "కవిసర్ప గారుడము"న అమృతనాధుడు మైలమ భీమునిపై చెప్పిన చాటుధార నుదహరించినాడన్న అమృతనాధుడు బసవనకన్న పూర్వీకుడై యుండవలెను. ఎంతకాలము పూర్వీకుడను ప్రశ్నకు సమాధానమూ హలపై నాధారపడియుండును. గరిష్ట పరిమితి 30 సంవత్సరములు (ఒక తరము)గా నెంచిన (దానిని మించి చెప్పుటకు కవి యుదహరించిన హంశము స్మృతి పథమున నొక తరము మించియుండనేరదను నమ్మికచే నిట్లూహించుట జరిగినది. పరంపరాగతముగ ప్రాచుర్యము పొంది కవుల జిహ్వాగ్రముల నిలిచి గ్రంథస్థములయిన విషయముల మాట యేమోగాని సర్వసాధారణముగ నొక తరము క్రిందటి సంఘటనలే స్మృతిపథముల నిలిచియుండుట సాజము)నందు విప్రతిపత్తి యేమియు నుండదు.

కాచిరాజు బసవన, చిత్రకవికంటె పూర్వుడని పైన తెలిపితిని. బసవన క్రీ॥శ॥ 1480వ సంవత్సరము దాపున నున్నవాడనుకొన్న అంతకుపూర్వ మొకతరము అనగా 30 సంవత్సరములు వెనుకకుబోయిన (అది యూహ మాత్రమే) అమృతనాధుని కాలము వచ్చును. అనగా 1450 ప్రాంతమగును. ఆ కాలముననే అమృతనాధుని చాటుధార పద్యము ప్రచార మందియుండవచ్చును. అనగా తత్కాలమందే మైలమ భీమన జీవించియుండవలెను. ఈ నిర్ణయము భీమకవి కాలమున మైలమ భీముడుండె ననువాదమున కనురోధముగ నున్నది. పక్షాంతరమున కాచిరాజు బసవనకు పూర్వము గరిష్ఠ సంఖ్య కాలమున అమృతనాధుడుండెనన్న క్రీ॥శ॥ 1380 సంవత్సరమున మైలమ భీమునిపై అమృతనాధుని చాటుపద్యము వెలుపడియుండె ననుకొన్నను అది సమన్వయమగుటలేదు. 11, 12 శతాబ్దములోనున్న భీమకవి మైలమ భీములు (సమకాలీనులన్న సంగతి విశ్వసించిన) 14, 15 శతాబ్దముల వారవవలసి వచ్చుచున్నది. సమకాలీనత్వ సిద్ధాంతమును బట్టి ఇట్టి విపర్యాసములు సంభవించి "ది మౌంటెన్ షుడ్ గో టు ది మహమద్" ఆర్ ది మహమద్ షుడ్ గో టు ది మౌంటెన్" అన్న ఆంగ్లోక్తిని జ్ఞప్తికి దెచ్చుచున్నది.

అనంతవర్మ చోడగంగుని వృత్తాంతమునుబట్టి 11, 12వ శతాబ్దమువా డనుకొనవలసిన భీమకవి అవస్థాభేదముచే 14 లేక 15వ శతాబ్దమువాడని అనిపించుకొనవలసి వచ్చినది. ఔరా! ఎంత విపరీత విషయము!

ఇంతకంటె విడ్డూరమైన విషయమొకటున్నది. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు భీమకవి నన్నయకు బూర్వుడని జెప్పుచునందులకు నిదర్శనముగ మైలమభీమునిపైన వేములవాడ భీమకవి చెప్పెనని చెప్పబడు "గరళపు ముద్ద" చాటుధార నుదహరించి మైలమ భీమన శా॥శ॥ 925 (క్రీ॥శ॥ 1003) సంవత్సరమునాటివాడని నిర్ధారణ మొనర్చినారు. ఆ విధిని భీమకవి, మైలమభీములు 11వ శతాబ్దము వారగుచున్నారు. ఈ నిర్ణయము అనంతవర్మ చోడగంగుని వృత్తాంతముతోను, ఏఱువ తొండయరాజు కాలముతో నులగించుట లేదు. అదిన్నీగాక గురజాడ శ్రీరామమూర్తిగారు "ఈ మైలమ భీమన శాసనము అమరావతిలోని అమరేశ్వరుని దేవళముపై నున్నట్లును అది శా॥శ॥ 925 సంవత్సరమయినట్లును "ఇలియట్ మార్బిల్సు" అను పుస్తకమువలన గాన్పించును" అని వ్రాయుచున్నారు.

వీనినన్నింటినిబట్టి వేములవాడ భీమకవి కాలము 11 లేక 12వ శతాబ్దమైయుండవలెనని తేలుచున్నది. ఇందులకు భిన్నముగా చేయు నిర్ణయములు ప్రమాద పతితములు ప్రమాణరహితములని చెప్పక తప్పదు.

శ్రీ సూర్యదేవర రవికుమార్ శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి గారి వివాదలో శ్రీ కొల్లూరి సూర్యనారాయణగారు తలదూర్చి "చారిత్రక ప్రామాణ్యము లేని రచనల బట్టికొని, తలపట్లకు దిగి పరిశ్రమించుట నిరర్థకమంటూ "శ్రీ శ్రీరామమూర్తిగారు పేర్కొనినట్లు వేములవాడలోని రాజేశ్వరాలయము భీమేశ్వరాలయము కాదని అంగీకరించినారు. అంతటితోబోక వారు "అచటి బద్దెగేశ్వరాలయము భీమేశ్వరునిదే! అది క్రీ॥శ॥ 850 ప్రాంతమున రెండవ అరికేసరి పూర్వీకుడైన బద్దెగునిచే నిర్మితమైనట్టిది! ఆ ప్రాంత స్థలపురాణముతో బాటు భీమకవి విషయము ముడివడియున్నది. కనుక భీమకవి అచటివాడు కాడనుటకు కూడ సరసమైన కారణములు శ్రీ శ్రీరామమూర్తి గారు చెప్పాలి, చెప్పలేకపోతే విషయాన్ని పాక్షికంగా ముగించినట్లవుతుంది" అని హెచ్చరించారు (భారతి 1983 మార్చి, కలగూరగంప)

"పోయిందే!"




మేలుపరచబడిన **అమృతాంజన్** వాడడంతో,

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన **అమృతాంజన్‌తో** చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే **అతి** త్వరితంగా వుపశమింపజేయగలదు !

# మేలుపరచబడిన
# మృతా

**మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!**

1 Limited 

డా॥ శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు (భారతి 1988 మే నెల కలగూరగంప) ఏఱువ భీమ, మైలమ భీమ, ఖండన భీమ, పిడుగు భీమ మొదలగువారిని రాజ కళింగ గంగు, వేములవాడ భీమకవి చాళుక్య చొక్కనృపాలుడు మొదలగువారి వృత్తాంతములు తడుముచు పూస పాటివారి సీసమాలిక, కొఱవి గోపరాజు "సింహాసన ద్వాత్రింశిక" భీమకవి చాటుధారలు నాయూలచూడ ములుగ స్తన శల్యపరీక్ష చేసి రవికుమార్‌గారితో రేగిన సాహిత్య వివాదలో తాము చేసిన నిర్ణయమే సరియైనదని ఘంటాపథముగ ఆక్రాణించి నిలిచి వారి నిర్ణయము మార్చుకొను ఆవశ్యకత లేదను అభిప్రాయము వెల్లడించినారు.

పైన వివరించిన విషయముల నన్నింటిని సమ్యక్పరిశీలనము చేసి వారి వ్యాసమును పునర్విమర్శ చేసి సంయైన మార్గము చూపు దనుక నీ సమస్య అపరిష్కృతముగ నుండిపోవలసినదే!

''చరిత్ర విద్యాధర'' తురగా కృష్ణమూర్తి

# నన్నయ - తిక్కన - సోమనాథుడు

ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావుగారు మే నెల భారతిలో ప్రచురించిన 'అభ్యుదయ కవితానంతర ధోరణులు - భాషాశైలి' అనే వ్యాసాన్నామూలాగ్రం చదివాను. రచయితకు నా ధన్యవాదాలు.

కవితలపై చర్చ చేసేవారిలో కావ్యానికి బాహ్యశరీరమైన భాష విషయమై ఏమాత్రం శ్రద్ధ చూపకపోవటం ఈనాటి యువ రచయితల్లో మామూలు. భాషావిషయికంగా పరిశ్రమించటం అనుచిత మని తలంచినందుననో, ఆసక్తి లేనందుననో, అశక్తత వలననో ఈ విషయంలో పరిశోధన తెలుగులో చాల తక్కువ. క్రమంగా ఈ దృష్టి పరిశోధనాంశాలకు సుదూరంలో ఉన్న ఈనాటి కాలంలో భాషనుగూర్చి చర్చించిన తంగిరాలవారిని నేను మనసార అభినందిస్తు న్నాను.

వీరు గావించిన చర్చలో సారాంశం ఏమంటే నన్నయ భారత భాషలో ప్రవేశింపజేసిన సంస్కృతమయ ధోరణిపై పాల్కురికి సోమన తిరుగుబాటు చేశాడు. దేశీయ ధోరణిని సోమన తిక్కన ప్రవేశింపజేసినప్పటికీ మన కావ్యభాష నన్నయ ప్రతిపాదించిన మార్గా నికే దగ్గరగా ఉండడం గుర్తించాలి అని వారి నిర్ణయం. ఈ ధోరణికి ఆధునిక కాలంలో వచ్చిన వచన కవులు, దిగంబర కవులు, విప్లవ కవులు మొదలైనవారందరు విధేయులేనని వీరి వ్యాస సారాంశం.

ఈ సందర్భంలో వీరి వ్యాసం రెండో పుటలో 'పాల్కురికి సోమన తిక్కన మొదలుపెట్టిన దేశశైలి, అని చెప్పియుండటం గమ నించాలి. సోమన తన రచనలో జాను తెనుగుంటుందన్నాడు. మార్గ కవిత ఉరుతర గద్య పద్యోక్తుల్లతో నిండియుంటుందన్నాడు. తిక్కన గూడ జాత్యముగామి నొప్పయిన సంస్కృతమెయ్యడ జొచ్చెనన్నాడు. ఆంధ్రభాషామీన మందొరయ తన రచన సాగిస్తానన్నాడు. అందు వల్ల ఈ మహాకవులిద్దరు నన్నయ మార్గకవితకు విభిన్నంగా దేశి కవి తను రూపొందించారని తలంచటం సహజమే. కాని ఈ యుద్యమంలో వీరు కృతకృత్యులయినారా? అనేది వీరి రచనలను అందలి ప్రయోగ రీతిని పరిశీలించి చెప్పాలి. నాకు తోచినంతవరకు వీరీ యుద్యమంలో విజయవంతులు కాలేకపోయారనిపిస్తుంది. నన్నయ ప్రవేశింపజేసిన సంస్కృత విధేయ ధోరణి వీరి రచనల్లో కొట్టవచ్చినట్లుగా కనబడు తుందని పరిశీలనవల్ల సువ్యక్తమవుతుంది. సోమన తన రచనల్లో వాడిన ఈ సంస్కృత ప్రయోగాలను గమనిస్తే ఈయన రచన నన్నయ ధోరణికి విధేయంగానే ఉన్నదని తెలుస్తుంది.

సంస్కృత విధేయ రచనలో సోమన తిక్కనకన్న కొంత తక్కువ అని తలంచనగును. తిక్కన వాక్యనిర్మాణంలో సంస్కృత విధేయ ధోరణులున్నవి. అలాంటివాటికి పాల్కురికి సోమన రచనలో ప్రయోగం గనరాదు. ఈ క్రింద సోమభాషలో గల సంస్కృత విధేయ ధోరణులను వివరిస్తాను.

సంస్కృత విభక్త్యంత రూపాలను అక్కడక్కడ సోమన తన రచనలో ప్రయోగించియున్నాడు.

మకుటేష్వనంగ (పం. అ. పుట 59) ఇందులో మకుటేష అనేది మకుట శబ్దానికి సప్తమీ విభక్తి బహువచన రూపము. ఈ విభక్త్యంతానికి తెలుగుపదం పరంగాగా సంస్కృతభాషకు సహజమైన యణాదేశసంధి ప్రవర్తించింది.

తన్మేஉస్తు (పం. అ పుట 528) ఇదొక సంస్కృత వాక్యం. ఇందులో 'మే + అస్తు అని ఉండగా సంస్కృతభాషలో వచ్చే పూర్వ రూపం ఏకాదేశమయినది. బ్రహ్మత్వ, మహిపతి వర్షకాలము మొద లయిన సాధ్య సంస్కృత సమాసాలను నన్నయ ధోరణి కనుకూలంగా పాల్కురికి సోమన ప్రయోగించి ఉండటం గమనించాలి.

శివమస్తటంచు (బ.పు పుట 372) అనే ప్రయోగంలో 'అస్తు, సంస్కృతక్రియా పదానికి తెలుగుపదం పరంగా పై (మకుటేష్వ నంగ) ప్రయోగంలోవలె సంస్కృతసంధి రాలేదు. మరియునిక్కడ తెలుగు భాషలో వచ్చే ఉత్వసంధి (పరస్వరైకాదేశ) వచ్చినట్లు గుర్తించాలి.

నన్నయ తన భారతభాషలో 'అలబ్ద సన్నిధానుండు మొద లయిన బహువ్రీహి సమాసాలను వాడినట్లు చెప్పటం గలదు. సోమ నాథుని రచనలోగూడ. లోచనత్రితయుడ చంద్రచూడుడు, అంచార్ధ దేహుడు, ఉక్షవాహనుడు, ఉక్షేంద్రవాహనుడు, మృతియుతదేహుడు, జ్వలనాక్షుడు, శమితేక్షుచాపుడు, సర్పాంకుడు, (పండితారాధ్య చరిత్ర) మొదలుగా గల బహువ్రీహి సమాసాల నసంఖ్యాకంగా

ప్రయోగించి తన రచన నన్నయ ప్రతిపాదించిన రచనతో తుల్యత గలిగి ఉన్నదని నిరూపించియున్నాడు. బసవ పురాణంలో అర్ధేందు మౌళి, ఖండేందు మౌళి, ఖండేందుధరుడు, సర్పకుండలుడు మొదలుగా గల సంస్కృత బహువ్రీహి సమాసాలను ప్రయోగించి తాను తలంచినట్లుగ జానుతెనుగును గాక ప్రౌఢ సంస్కృతమయ రచనే తాను ఆదరించెననుటను ధృవీకరించియున్నాడు.

వివిధ తద్ధిత ప్రత్యయాంతాలను నిర్మించి ప్రయోగించటంలో సోమన దేశీయతాధోరణిని నిర్లక్ష్యం చేసి నన్నయ ధోరణి నాదరించాడనిపిస్తుంది. ఈ క్రింది తద్ధిత ప్రత్యయాంతాలు సోమన భాషలో ఉన్నవి. ఈ పదాలీ ప్రత్యయాంతాలు గావటం సంస్కృత వ్యాకరణ విధికి లొంగని విధానము వీటిని ప్రయోగించిన సోమన సంస్కృత ప్రత్యయాంత నిర్మాణంలో స్వతంత్రత గలవాడని తెలుస్తుంది. సంస్కృతమయముగ తన రచనను గావించ దలంపు ఈయనకు కలదనటానికి ప్రయోగాలను తార్కాణముగ గుర్తించనగును.

ఇత — వేషిత

ఇన్-కర్మి, పాపి, రోషి, కోపి, గర్వి, వేదాంతి-కుష్కర్మి మొ॥న ఈ నామాలపై ఈ ప్రత్యయాల చేరికను సంస్కృత వ్యాకరణం అంగీకరించదు. సంస్కృత నామాలను గ్రహించి ఈ ప్రత్యయాలతో జతచేసి ప్రయోగించటం సోమనకు గల సంస్కృత ప్రయోగాల ఆదరణకు ప్రత్యక్ష నిదర్శనం.

పైని పేర్కొన్న విశేష సంస్కృత పదాలేగాక తెలుగు వాక్య నిర్మాణంలో గూడ సంస్కృత వ్యాకరణ విధేయత తిక్కనకు గలదని ఈ క్రింది ప్రయోగాలు స్పష్టం గావిస్తున్నవి.

తెలుగుభాషకు ఎరువు సొమ్మయి విశేషణ విశేష్యాలకు సమాన లింగవచన విభక్తులుండటం తిక్కన నిర్మించిన వాక్యాల్లో గనగును.

వ్యాఖ్య కారిణియగు గతింబొందె
గోపురావళి నభోవ్యాపిని యగుటయు మొ॥

కర్తృ పదం తృతీయలో ఉండటం సంస్కృత ప్రభావంవల్ల తెలుగులో చోటు చేసుకుంది. జగముచేత చచ్చినవాడు మొ॥ తృతీ విభక్త్యంతాలు కర్తృపదాలుగా గల వాక్యనిర్మాణం తిక్కనలో ఉంది.

దూరార్థంలో షష్ఠీ విభక్తిని వాడుక చేయటం సంస్కృత వాక్య నిర్మాణంలో గల ప్రత్యేకత. తిక్కన దూరార్థంలో 'కు' అనే తెలుగు షష్ఠీ విభక్తి ప్రత్యంతాన్ని వాడటం గుర్తింపదగిన యంశము.

పాండునృపతి భాగంబునకుఁ చాపి
రథంబుపై నిడుకొని యనికిఁ దొలఁగఁ జనియె
తాను శయ్యంబునకుఁ దొలఁగఁజనియె.

సంస్కృతంలో షష్ఠ్యంతం దగ్గర, అనే అర్థాన్ని గూడ చెప్పగలదు. తిక్కన ఈ క్రింది ప్రయోగంలో షష్ఠీ విభక్తి ప్రత్యయమైన - కు,ను దగ్గర, అనే అర్థంలో వాడి తనకుగల సంస్కృత విధేయతను విశదీకరించి యున్నాడు.

ధర్మసుతునయుండు కుంభసంభవున దిక్కునకు రవడించె
శల్యుండు కృతవర్మని తేరిపైకి లంఘించె.

అగ్రిమే మొ॥ ఇమని జింతాలను సంస్కృత వ్యాకరణ సంప్రదాయ భిన్నంగా నిర్మించి ప్రయోగించినవాడు తిక్కన.

పాల్కురికి సోమనాథుడు తిక్కన దేశీయమైన పదాలను జానుతెనుగును వాడాలనుకున్నా వారీ యుద్యమంలో కృతకృత్యులు కాలేకపోయారని పై సంస్కృత విధేయత స్పష్టం గావిస్తుంది. వీరి కొన్ని తెలుగు పదాలను వాడినంత మాత్రాన వీరి శైలి నన్నయ శైలికి విభిన్నం అనటం సరికాదు.

వీరి వ్యాసం 14 పుటలో తెలుగు రచనలో జ్ఞానం అనేది కుదిరినట్లు ఎఱుక కుదరటం లేదనటం నిర్హేతుకం. వాడుకవల్ల ప్రసిద్ధి గలుగుతుంది పదాలకు. మనం నిత్యం జ్ఞానం, అని అంటున్నందువల్ల ఎఱుకను ఉద్దేశపూర్వకంగా నిరాకరిస్తున్నాం. ఈ విధంగా భాషలోని సహజసిద్ధాలను పరిహరించి సంస్కృతపదాల నాదరించటంవల్ల సహజ పదాలను వాడే సామాన్యునకు భాష అర్థం గాకపోవటం జరుగుతుంది. ఈనాటి బెంగాలీలో ఈ స్థితి ఏర్పడిందని భాషాశాస్త్రజ్ఞులు గుర్తించారు.

ఈ విషయంలో కన్నడంవారి కృషి ప్రశంసార్హం. వరనాటికైన సంస్కృతపదాలతో నింపుతున్నారనేది శుభసూచన.

తెలుగువారీ ప్రయత్నం చేయలేకపోగా సంస్కృతభూయిష్ఠతను ప్రౌఢశైలిగా భావించి తెలుగుదనానికి మంగళం పాడుతున్నారు.

ఈ రచయిత తన రచనలో సంస్కృత పదాలధికంగా ఉన్నవి ఇదే సహజం అని అన్నారు. నా యీ వ్యాసంలోగూడ సంస్కృత పదాలధికంగానే ఉన్నాయని నాకు తెలుసు మనం ఆ రచన కలవాటు పడ్డాం.

ఈ విధానమే మన భాషకు సహజమనటం సరిగాదు. సంస్కృత గంధం లేనివారక్షరాస్యులయినా మన ఈ రచన అగమ్యంగా మిగిలి పోతుంది. కాబట్టి ఈ భాష ప్రత్యేకించి ఒక వర్గంవారి భాష అని వాడంటున్నారు.

ఈ మాటను మనం అస్వీకరించాలంటే మనంగూడ కన్నడం వారి వలె దేశీయ పదబహుళమైన శైలిని ఆదరించక తప్పదు.

శ్రీ జె. సూర్యనారాయణ

# విద్యాతీర్థులు భారతీకృష్ణతీర్థులు & విద్యారణ్యులు

పరిశోధన కందినంతవరకు సాయణ మాధవ మాయణులు సోదరులని సాధన సంపత్తి దొరికింది. వీటిని ఆధారం చేసికొని అందరు వేదాలకు భాష్యాలు తీర్చిదిద్దినది సాయణుడనియు వారు తురీయాశ్రమం స్వీకరించి విద్యారణ్యులనే పేరుతో విలసిల్లిరనియు, ఈయనయే శృంగేరీ పీఠాధిపతులనియు నమ్ముచున్నారు. ఇట్లే అక్కన్న మాదన్నలు సోదరులనే అపోహ లోకమందు ప్రబలింది. కాని ఆనాటి ప్రభుత్వ రికార్డులను పరిశీలించి తదితర సాధన సంపత్తిని సేకరించి పరిశోధన సల్పి శ్రీ భూపాలరావుగారు "మహామంత్రి మాదన్న" అను గ్రంథమున వీరిద్దరికి ఏలాటి బంధుత్వము లేదనియు, అక్కన్న పాండిత్య ప్రతిభలను మన్నించి మాదన్న మంత్రిగా నియమించినట్లు తెలిపిరి. ఈ పరిశోధనలో పరిశోధకులు ఎందువల్లనో ఒక గ్రంథం జోలికి పోలేదు. అది శృంగేరిపీఠ ఆస్థాన కవిపండితుడైన కాశీ లక్ష్మణశాస్త్రి వ్రాసిన గ్రంథం. ఈయన శృంగేరీ పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ నరసింహతీర్థుల ఆస్థాన విద్వాంసులు. శాస్త్రి గురువు సచ్చిదానంద భారతీతీర్థులు. శాస్త్రి ఆ పీఠమందు గల గ్రంథములు సంప్రదాయ విషయములు గ్రహించి "గురువంశ కావ్యము" అను గ్రంథాన్ని వ్రాశారు. అందు సాయణ మాధవులగూర్చి చిత్రమైన అంశాలున్నవి. వాటిని ప్రస్తావించుటయే ఈ వ్యాసోద్దేశం.

ఈ గురువంశ కావ్యంలో ఆదిశంకరుల అవతరణ, ఆ మహామహుని భారత పర్యటన వామాచారముల ఖండనము అద్వైత స్థాపనలు రమ్యమైన శైలిలో వర్ణింపబడినవి. తర్వాత సురేశ్వరాచార్యులు శృంగేరియందు ప్రథమ పీఠాధిపతిగా నియమితులైన విషయముంది. వీరి తరువాతి పీఠాధిపతుల పరంపర ప్రస్తావింపబడింది. సురేశ్వరాచార్యులు విశ్వరూపులనే పేరుతో వ్యవహరింపబడ్డారు.*

విశ్వరూపులు
|
బోధఘనుడు
|
జ్ఞానఘనాచార్యులు
|
శివాచార్యులు
|
జ్ఞానగిరి
|
సింహగిరి
|
ఈశ్వర తీర్థులు
|
నృసింహ తీర్థులు
|
విద్యాతీర్థులు (13వ శతాబ్దం)
|
భారతీకృష్ణ తీర్థులు (13వ శతాబ్దం)
|
విద్యారణ్యులు (13, 14 శతాబ్దాలు).

4?.21 అత్రాంతరే సురుచిరైక శిలానగర్యాం
కస్యాపి భూసురవరస్య సుతౌ వినీతౌ।
దస్రావివ ప్రతిదిన ప్రచురాం రాగౌ
ఖ్యాతౌ గుణైశ్చ బలరామ హరీ ఇవాస్తామ్॥

* ఇంకను వీరికే పృథ్వీధరుడను నామమున్నట్లును తెలియుచున్నది.

4 22 విద్వాం స్తయోరపి విరాగభరాత్ కనీయాన్
తీర్థేక్షణోత్యుకమనాః ప్రచరన్ పృథివ్యామ్।
తీర్థాత్మకోన్నత తపస్వి వరేణ్య విద్యా
తీర్థాభిధాన ముని రాజ సమీపమాగాత్॥

5 16 శ్రేష్ఠభాజి పుర ఏకశిలాఖ్యే
శిష్టవైదిక తపోజనహోమే
కష్టదాయి భవచాలన భార
క్లిష్టహృత్ బహువయాః సమవాత్సత్॥

5 17 వర్తితౌ సహ తదీయ తనూజౌ
అధ్యగీష్వహియుతౌ బహువిద్యాః
ప్రార్థితాం సుయతితాం అథ విద్యా
తీర్థ సన్నిధిగ ఆప కనీయాన్॥

శ్రీ విద్యాతీర్థులు శృంగేరీ పీఠాన్ని అధిష్టించియుండగా ఏకశిలా నగరమందు (ఓరుగల్లు-నేటి వరంగల్లు) ఒక వైదిక కుటుంబం ఉండేది. ఆ కుటుంబంలో తండ్రి ఇద్దరు కొడుకులుండిరి. వారు అర్థ శూన్యులైనప్పటికి వేదార్థములు క్షుణ్ణముగా తెలిసిన మహాపండితులు. వారిలో చిన్న కుమారుడు వైరాగ్యవంతుడై తీర్థయాత్రలు సల్పి శృంగేరి పీఠము చేరి శ్రీ విద్యాతీర్థులవారిని దర్శించి వారిని మెప్పించి తురీయాశ్రమాన్ని స్వీకరించారు. తమ్ముని యెడబాటు భరించలేక తండ్రి అనుమతితో అవరజుని వెదుకవెళ్ళాడు పెద్ద కుమారుడు. తిరిగి తిరిగి తమ్ముడు భారతీకృష్ణ నామంతో శృంగేరీ యందుండడం చూచెను. తానూ అచ్చటనేయుండి అనేక వేద పండితుల బోధనలతో వర్థిష్టుడై వేదములకు భాష్యములు వ్రాసెను. తాను కూడ సన్యసించి విద్యారణ్యుడను పేరును గురుప్రసాదముగా గ్రహించెను. తాను వ్రాసిన భాష్యాన్ని గురువగు విద్యాతీర్థులకు వినిపింపగోరెను. విద్యాతీర్థులు "నీ భాష్యాన్ని కాశికి వెళ్ళి అచ్చట వేదవ్యాసునికి వినిపింపు" మనెను. అట్లే విద్యారణ్యులు వ్యాసుని దర్శించి వారికి తాను కూర్చిన భాష్యముల వినిపించి వారి అనుమతితో హంపి క్షేత్రము చేరి విరూపాక్ష దేవుల దర్శించి ఆ ప్రాంతంలోని మతంగ పర్వతంపై తపస్సు చేసెను. వ్యాసప్రోక్తమైన మహామంత్రమును ఇచ్చటనే జపించెను. ఈ మహామంత్ర ప్రభావం చాలా గొప్పది. పృశ్నీ మొదలగు మహర్షులు ఈ మంత్రోపాసన చేసి పదవీచ్యుతుడైన ఇంద్రునికి మరల స్వర్గాధిపత్యమును చేకూర్చి పెట్టిరి.

28 ఏవమాత్మని విభావ్య మహా శ్రీ
దేవతా భజన రీతి మృషీంద్రః
తత్ స్వరూప మఖిలం సమభాణీత్
ఉత్సుకో నిఖిల తంత్ర రహస్యమ్॥

ఇట్లు విద్యారణ్యుల ప్రఖ్యాతి ఆ పరిసర ప్రదేశమంతటా వ్యాపించినది. ఆ చేరువ రాజ్యమందుండు ఇద్దరు మంత్రులు మాధవ సాయణులు నిస్సంతుగా నుండిరి. వారు విద్యారణ్యులను దర్శించి పుత్రార్థము ప్రార్థించిరి.

5 42 తం తదా సవినయం స యయాచే
సంతతిం సుచరితైః పరితోష్య
సంతతం సకలవేద్య గదీత్రా
సంతతిర్న యువయోః భవితేతి॥

5 43 తన్నిశమ్య వచనం బహుచింతా
పన్న భిన్న మనసావ గృణీతామ్
విత్తమస్తి బహుళం తదనుష్మాత్
పుత్రిణాం గతిమవాపయ వేతి॥

విద్యారణ్యులు వారికి జన్మలో పుత్రప్రాప్తి కలుగదనిరి. వారిరువురు ఖిన్నులై "మావద్ద సంపద బహుళంగా ఉన్నది. మాకు పుత్రులను ప్రసాదించిన పుణ్యలోకప్రాప్తి కల్గు"నని ప్రార్థించిరి.

5 44 మాధవీయమితి, సాయణీయ మి
త్యా దరాత్ యతివర్యోర్థిత ఆ ఖ్యామ్
వేదశాస్త్రగకృతీః సకలాస్తాః
సాధు సంవ్యధిత తద్ద్వయనామ్నా॥

విద్యారణ్యులు వారి ప్రార్థనలు మన్నించి తాను రచించిన వేదశాస్త్రములకు సంబంధించిన భాష్యాదికృతులను 'మాధవీయ'మని. 'సాయణీయ' మని పేర్ల పెట్టెను. ఆ కృతులను వారికి దత్తము చేసెను. తన కర్తృత్వమును త్యాగము చేసెను.

5 45 కారిత్యాపి చ సన్తతి భేదాః
పూరిత్యాపి చ తయోరభిలాషా
చారుణా చిరమను గ్రహణేనో
ద్ధారయంతి వినతాన్హి మహాన్తః॥

ఈ విధముగా వారిని సంతానవంతులుగా చేసి వారి కోర్కెలను దీర్చి వారిని విద్యారణ్యులు అనుగ్రహించెను. మహనీయులు ఆశ్రయించు వారిని ఉద్ధరించు స్వభావము కలవారే కదా!

ఈ సందర్భములో సప్తసంతానముల ప్రశంస యుక్తమనిపించుచున్నది.

"పూని మహాగ్రహారపుర పుత్త్రి సమున్నతి దేవతాలయో
ద్యాన తటాక సత్కృతి నిధానము లా శశి తారకంబు సు
స్థానములై మహిం బరగ జంగమ మల్లయ పేర సప్తసం
తానము వొప్ప నిల్పుదు ముదంబునఁ దత్ప్రభునాజ్ఞ పెంపునన్."
(నన్నెచోడ కుమార సంభవము 1-46)

స ప్తసంతానములను ఇష్టాపూర్తములని వ్యవహరించుట కూడ కలదు. ఇష్టిక అనగా ఇటుక. ఇటుకలతో అమర్చిన వేదికయందు దేవతలను ఆరాధించుటకు చేయు యాగము ఇష్టి.

ఇష్టాపూర్తములు - వాపి, కూప, తటాక, దేవాయతన, అన్న ప్రదాన, ఆరామాదుల స్థాపన. (ఎఱ్ఱాప్రెగ్గడ-హరివంశము పీఠికలో) ప్రోలయవేముని ధర్మకార్యములు - "ఇష్టా పూర్తంబగు క్రియా కలాపంబు నిజ కర్తవ్యానురూపంగా తొడంగి" అగ్రహారములు, చెఱువులు, గుళ్ళు, విధులు, నల్లిండ్లు, తోటలు, సత్రములు. చరివేంద్రలు (స ప్తసంతానముల ప్రసక్తి 13-14 శాసనములలో)

1161 క్రీ.శ. (ఎస్.హెచ్ 10, 151) నాటి శాసనమున

గుడియును, జెఱువును, వనమును
నడరిన వల్లిండ్లుం, గృతియు నడ పెన్నిధియున్
గొడుకుఖను స ప్రసంతతి
నొడఁగూడగ నిలిపి సరన డొప్పెంగీర్తిన్.

క్రీ.శ. 1170 (సి.ఓ.ఆర్.టి.ఇ.ఎల్ ఐ ఎన్ ఎస్ ఎన్ ఎస్ నెం. 56 1.1.157-161) నాటి స ప్తసంతానములు.

తన పెంచిన సంతానము
దన సంతానంబుః గృతియుందన నల్లిల్లును
వనమునుం జెఱువును గుడియును
జనవినుతములైన స ప్తసంతానములు.

క్రీ.శ. 1369 (ఇ.ఐ. 14 పు. 101, 5-9) భాస్కరభవదూరుని పోరు మామిళ్ళ శాసనమున

పుత్రః కృతిస్తటాకశ్చ నిధానం శివమన్దిరమ్
వన విప్రాగ్రహారశ్చ స ప్తసంతాన ముత్తమమ్.

ఈ స ప్త సంతానములు లోకోపకారకమైన కార్యములు. ఆ, లోక సంగ్రహముల ప్రగతిని గూర్చి సంగ్రహంగా వివరించాలి. తటాకములు, కూపములు, చెఱువులు, ఇత్యాది వనరులు మానవాళికి పశుపక్ష్యాదులకు సస్యౌషధ తరు సంతతికి దోహదము చేకూర్చినవి.

వనములు, తోటలు, ఆరామములు - వీటివల్ల ఫలవృక్షములు, పరిసరములందు నైర్మల్యము వర్షప్రాప్తికి దోహదము చేకూర్చును.

కృతులు - సాంస్కృతిక వృద్ధిని, పరంపరావృద్ధిని కల్గ జేయును. తన పెంచిన సంతానముగాని, తన సంతానముగాని వంశాభి వృద్ధికి తోడ్పడును.

అగ్రహారములు, నల్లిండ్లు వేదపండితుల వేదవిజ్ఞానమును పరంపరాగతముగా లోకమున నిక్షేపించి యుండుటకు వసతి గల్పించును.

అగ్రహారమందు అన్ని వృత్తులవారు యథాశక్తితో పనిచేసి ప్రజాస్పృహతో సాంఘిక జీవనమును సుస్థిరముగ సువిస్తారముగ చేయుటకు వీలు కల్గును.

నల్లిండ్లలోను కుటీరములలోను నిత్యాగ్నిని కాపాడి హోమములు యజ్ఞములు చేయుదురు. త్రేత లేక పంచాగ్నులనుండి వెలువడిన ధూమముచే ఇండ్లు నల్లబడుటచే నల్లిండ్లనబడుచుండెను. వర్షపాతమున కును వాతావరణ కాలుష్యనివారణకు హోమధూమము పలువిధములుగ లోకోపకారి యగును. దేవాయతన నిర్మాణము - ప్రజల ఆధ్యాత్మిక పారలౌకిక శరణాగత తత్త్వములకు పరాకాష్టలు. ఈ కార్యక్రమ ములు వేద ఉపనిషత్ బ్రహ్మసూత్ర కాలములందు ఇష్టాపూర్తములని తెలుపబడినవి. ఈ కార్యములు లోకోపకారకములైనందున పుణ్య ప్రదములు. 'ఇష్టా' అనగా యాగాది పూర్వమీమాంస కార్యములు. 'పూర్తము'లనగా లేనిచోట, లేనివాటిని నిర్మించి పూర్ణము చేయుట. ఉదా: చెఱువులు, బావులు, వనములు మొదలగునవి. ఈ రెండు వేరు వేరు గణములకు చేరినవే. ఇవన్నియు సర్వజన శ్రేయస్కరములగు సాంఘిక కార్యాపథకములు.

గమనిక : 1) ఇష్టము-యజ్ఞదేవ పూజాయామ్ అను ధాతువునుండి ఏర్పడిన 'క్త' ప్రత్యయాన్తరూపము. యజ్ఞము అని యర్థము.

2) ఇష్టము = అభిమతము - ఇష = ఇచ్ఛాయాం అను ధాతువునుండి ఏర్పడినది.

ఇట స ప్తసంతానముల ప్రసక్తి ఉచితముగా ఉన్నది. విద్యారణ్యులు తన కృతి సంతానమును తాను తురీయాశ్రమ మందున్నందున కర్తృత్వమును త్యాగము చేసెను. మాధవ సాయణులును ఆ, కృతి సంతానమును దత్తతగా బడసి తాము పెంచిన సంతానముగా భావించి ఆయా కృతులయందు తమ పేర్లను నిజకర్త అనుమతితో లోకము నందు ప్రస్తావించిరి.

విద్యారణ్యులు తొలుతగా వ్రాసిన ప్రతులు కాలగతియందు లు ప్తమైపోయినవి. సాయణ మాధవులు తమ పేర్లతో వ్రాయించిన ప్రతులే లోకమున విస్తరిల్లియున్నవి.

ఇంకను ఈ అంశముపై విమర్శకులు అనేక కోణములలో పరిశోధనలు చేసి ఇంకను సాధన సంపత్తిని సేకరించి సిద్ధాంతము చేయుదురని ప్రార్థించడమైనది.

## ఉపయుక్త గ్రంథావళి

1. గురువంశ కావ్యమ్ - కాశీ లక్ష్మణశాస్త్రి
(సంస్కృతమ్) వాణీ విలాస్ ప్రెస్ శ్రీరంగం

2. శంకరకృప - శృంగేరివారి మాసపత్రిక (తెనుగు) డి; 1985......నుండి వెలువడినది.

3. మల్లంపల్లి సోమశేఖరశర్మ స్మారక సంచిక (ఆంగ్లము) ఆంధ్రప్రదేశ్ పురావస్తు శాఖవారి ప్రచురణ. ఆంధ్ర చారిత్రక పరిశోధన సంపుటం 35. 1976

4. మహామంత్రి మాదన్న - భూపాలరావు

5. నన్నెచోడుని కుమార సంభవము (డా॥ నేలటూరి వెంకటరమణయ్యగారి వ్యాఖ్య) ఆ-1-46పద్యము.

6. శంకరాచార్య ఎన్. కృష్ణస్వామిరెడ్డిగారు, భవాని బుక్ సెంటర్, మద్రాస్-33.

**నే. శ్రీ. కృష్ణమూర్తి**

## దీనదయాళ్ ఉపాధ్యాయ వ్యాసం

స్వర్గీయ దీనదయాళ్ ఉపాధ్యాయగారి రాష్ట్ర జీవనక్ కి దిశా వ్యాసాలను తెలుగు పాఠకలోకానికి అందించడానికి మీరు పూను కొనడం ఎంతో సంతోషం కలిగిస్తున్నది. హిందీలో ప్రచురింపబడి ఒకటిన్నర దశాబ్దం పైబడినా - ఇంత చక్కటి సామాజిక-ఆర్థిక-రాజకీయ విశ్లేషణ గల్గిన వ్యాసావళి తెలుగులోకి రాలేదే అని చింతి స్తున్న వారికి జూన్ నెల భారతి అమృతపుజల్లు కురిపించింది.

విషయంయొక్క లోతుపాతులకు వెళ్ళకుండానే కంపరంతో అభిప్రాయాలను ప్రకటిస్తూ ఉండే అంధవ్యతిరేకులు కొందరైనా ఈ వ్యాసపరంపరనుండి లాభం పొందగలరని ఆశిద్దాం.

ముఖ్యంగా - రష్యా చైనాలలో రక్తపాత విప్లవం పునాదుల పైన నిర్మించుకున్న వ్యవస్థలను సాకల్యంగా పునఃపరిశీలించు కుంటున్న తరుణంలో సమగ్ర మానవ వికాసానికి భారతీయ దృక్కోణంలో ప్రతిపాదింపబడుతున్న ఈ ప్రత్యామ్నాయం - ఈ సందర్భంగా మీ చొరవ-ప్రశంసను పొందుతాయనటంలో సందేహం లేదు.

**డా॥ వడ్డి విజయసారధి**
రాజమండ్రి

## రమణ సన్నిధిలో...

'పరిచయము' అనే శీర్షికలో గ్రంథకర్త వ్రాసినది నిదానంగా చదివి అర్థం చేసుకోవలసిందని మిత్రులు శ్రీ రామచంద్రయ్యగారిని కోరుతున్నాను.

**శ్రీ యామిజాల పద్మనాభస్వామి**

# గ్రంథ విమర్శలు

## 'భవభూతి'

[ భారతీయ సాహిత్య నిర్మాతలు. ఆంగ్లమూలం:- జి. కే. భట్. ఆంధ్రానువాదం : పుల్లెల శ్రీరామచంద్రుడు. వెల : 5/రూ. సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ, రవీంద్రభవన్-110 001.]

ఇందులో-ఈక్రింది విషయాలు చర్చింపబడినవి. 1) కవిని గూర్చి, 2) భవభూతి రచనలు – అతని సాహిత్య సంబంధాలు, 3) భవభూతి కాలము - పరిస్థితులు, 4) భవభూతి రూపకాలు, 5) భవభూతి కావ్యశిల్పం, 6) భవభూతి మనస్సు-అతని ఆలోచనాపద్ధతి.

గ్రంథం చివర – ఉపయుక్త గ్రంథాలు – వివరాలతో 40 పేర్కొనబడ్డాయి. మూల గ్రంథాలు మహావీర చరితానికి 4, మాలతీ మాధవానికి 6, ఉత్తర రామచరితానికి 7, సంస్కృత వ్యాఖ్యాన భూమికలతో, ఆంగ్లానువాద పీఠికలతో, సూచింపబడ్డాయి. ఇవికాక-ఆంగ్లంలో భవభూతిని గురించిన సాధారణ గ్రంథాలు 10, విశిష్ట గ్రంథాలూ, వ్యాసాలూ, 6, సంస్కృతంలో 1, మరాఠీలో 2, హిందీలో 4, వెరశి 40 గ్రంథాలు పరిశీలనా పరిధిలో ఉన్నట్లు స్పష్టపడుతున్నది. వీనిలో సుప్రసిద్ధమైన ద్విజేంద్ర లాల్‌రాయ్ వ్రాసిన 'కాళిదాస-భవభూతులు' అనే గ్రంథం లేదు.

ఇన్ని గ్రంథాలు చదివి చిరకాలానుభవంతో వ్రాసిన యీ గ్రంథం భవభూతిని గూర్చిన సమగ్ర గ్రంథమై ఉండవలసింది. కాని – ఆ సంతృప్తిని కలిగించటం లేదనే చెప్పవలసివస్తున్నది. ఈయన మూలగ్రంథాలకంటె - ఉపయుక్త గ్రంథాలనే ఎక్కువ శ్రద్ధగా చదివినట్లు కనిపిస్తున్నది. 1950 తరువాత వస్తున్న పూర్వ గ్రంథాల విమర్శలో స్పష్టంగా కనిపించే యీలోపం ఒక్క ఆంధ్ర భాషలోనే కాదనీ – మొత్తం భారతీయభాష లన్నింటిలోనూ-ఇలాగే ఉన్నదనీ - ఈ పుస్తకాన్నిపట్టి తెలుస్తున్నది. ఉత్తరరామచరితం తృతీయాంకంలో సీతాపర్యవేక్షణకు తమసానదీ దేవతను లోపాముద్ర నియోగించినట్లు - ఈ పుస్తకం 46వ పేజీలో 30వ పంక్తిలో ఉన్నది. ఇది మూలవిరుద్ధం. తమసను నియోగించినది భాగీరథి కాని-లోపాముద్రకాదు. పోనీ-ఇటువంటి నీహారవేశాలని సరిపెట్టుకున్నా-భవభూతి రూపకాలు, భవభూతి కావ్యశిల్పం, మొదలైన శీర్షికలలోని కావ్యస్వరూప స్వభావ నివేచన నేలబారుగా ఉన్నది. ఉండవలసినంత లోతుగాలేదు. భవభూతియొక్క అంతస్తత్త్వాన్ని పట్టియిచ్చేదిగా లేదు. ఉ. రా. చ. నాందీశ్లోకంలోని 'అమృతామాత్మనఃకళాం' అన్న దానికి అతని కావ్యశిల్పంతో సమన్వయం నిరూపితం కాలేదు. 'ఉత్తరేరామచరితే భవభూతిర్విశిష్యతే' అనే సుప్రసిద్ధమైన అభియుక్తోక్తి యొక్క వివేచన ఎక్కడా స్పృశింపబడలేదు. మొత్తం మీద భావుకులకు భవభూతిని గూర్చిన యీ గ్రంథం ఆశాభంగాన్నే కల్పిస్తున్నదని చెప్పవలసివస్తున్నది.

ఇంక అనువాదం మాట:—

నేటి కాలంలో యింగ్లీషు పండితులు వేఱు-సంస్కృతాంధ్ర పండితులు వేఱుగా లేరు. వారే వీరు – వీరేవారుగా ఉన్నారు. కాబట్టి సర్వసాధారణంగా యింగ్లీషులో ఆలోచించి తెలుఁగులో వ్రాయటమే జరుగుతున్నది కాని – తెలుఁగులో ఆలోచించి వ్రాయటం జరగటం లేదు. అందులో – ఈ పుస్తకం ఇంగ్లీషుకు అనువాదం కాబట్టి - యీ తెలుఁగు వాక్య నిర్మాణంలో యింగ్లీషువాసనే ఎక్కువచోట్ల వేస్తున్నది. అదీకాక-కొన్ని యింగ్లీషు పదాలకు సంస తీకరణం సరిగ్గా కుదిరినట్లులేదు. ఉదా:- సస్పెన్స్-సాంశయికత్వం, టెన్షన్-ఆవేశం, బాక్-గ్రౌండ్ పృష్ఠభూమిక, ఐరనీ – వైపరీత్యం... ప్రసిద్ధమైన యింగ్లీషు మాటలవల్లనే తెలియవలసింది సూటిగా తెలుస్తున్నప్పుడు ఈ సంస్కృతీకరణం వృథాశ్రమ అనిపిస్తుంది.

లవ, చంద్రకేతువులకు మొదట జరిగినవి సౌహార్ద వాక్యాలు కాని 'ఉపచార' వాక్యాలు కావు. (49 పేజీ.)

కౌసల్యతో జనకునికి జరిగింది 'సమాగమం' అనరాదు. సమావేశం అనవలసి ఉంటుంది. (47 పేజీ.)

మొత్తంమీద వెనుకంటె యిప్పుడు పుస్తకాలు విరివిగానే వస్తున్నాయి కాని నికరమైనవి తక్కువ.

—మల్లంపల్లి శరభయ్య

## ఇస్లామిక్ హెరిటేజ్ ఆఫ్ ది డక్కన్

[సంపాదకుడు: జార్జ్ మిచిల్. వెల : రు. 250/- ప్రతులకు: మార్గ్ పబ్లికేషన్స్, ఆర్మీ అండ్ నేవీ బిల్డింగ్స్, మహాత్మాగాంధీ రోడ్, బొంబాయి-400 023]

మానవులు మతాన్ని సృష్టిస్తారు. తిరిగి మతం మానవుల్ని సృష్టిస్తుంది. ఇస్లాం మతప్రవక్తకూడ ఒక మహావ్యక్తి, గొప్పశక్తివంతుడు. అంతఃకలహాలతో ఛిన్నాభిన్నమైన తన అనాగరిక ప్రజలు మానవత్వపు విలువలు గుర్తించేటట్లు చేసి, వారిలో సామ్రాజ్యాలు

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి చేసినది, వాసన లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

Amrutanjan Limited 

75!

నిర్మించాలనే కాంక్షనూ, సంఘటిత శక్తిని ఆయన కలిగించాడు. వారు వివిధ శాస్త్రాల్నీ, కళల్నీ సృష్టించారు. అందుకే అవి ఇస్లాం సంస్కృతిని ప్రతిబింబించే కళారూపాలుగా ప్రచారంలోకి వచ్చాయి.

వారి కళారూపాల్లో ఆలోచనా సౌందర్యం రూప సౌందర్యం మిళితమై ఇప్పటికీ రసజ్ఞులను వుర్రూతలూగిస్తున్నాయి. భారత మధ్య యుగ ఇస్లాం కళారూపాలనగానే 16వ శతాబ్దంలో ప్రారంభమైన మొగలాయి కళారూపాల్నే పేర్కొనవలసివుంటది. నిజానికి మొగలాయి కళారూపాలు వికసించినంత గొప్పగా ఇస్లాం కళారూపాలు వికసించలేదు. మధ్యయుగపు ముస్లిం చక్రవర్తులు గజనీ, ఘోరీ, కుతుబుద్దీన్ ఖిల్జీ, తుగ్లక్, ఫిరోజ్, తైమూర్ మొదలయిన వారికి అస్తవ్యస్తంగా, అరాచకతతో నిండిపోయిన తమ రాజ్యాలను చక్కదిద్దుకోవటంతోనే సరిపోయిందే తప్ప కళావ్యాసంగాలకు తగినంత సమయాన్ని కేటాయించలేక పోయారు. అయినా వీరి హయాంలో వాస్తుకళ బాగానే అభివృద్ధి చెందింది.

ఇక దక్కన్‌లోని బహమనీ సుల్తానుల కాలంలో, ఆ తర్వాతి పాలకుల హయాంలో చిత్రకళ మినహా అన్ని కళారూపాలకు మంచి ఆదరణ లభించింది. దక్కన్ సుల్తానులు పారిపాలించిన సల్తనతులు అయిదు; అవి గోల్కొండ, బీజాపూర్, అహ్మద్‌నగర్, బీరార్, బీదర్. ఈ సల్తనతులు 16, 17 శతాబ్దాలకు చెందినవి. ఇంచుమించు మొగలాయి పాలనకు దక్కన్ సల్తనతులు సమకాలికమే కాగా దక్కన్ కళారీతులమీద విజయనగర కళారూపాల ప్రభావం కొంతమేరకు వుంది దక్కన్ సల్తనతులు ఒకటై 1556లో విజయనగర సామ్రాజ్యాన్ని ఛిన్నాభిన్నం చేశాయి. దాంతో అక్కడి శిల్పాలనీ, మరికొన్ని కళారూపాలనూ, కళాకారులను తమవెంట సుల్తానులు తీసికొచ్చారు. ఈ కారణంగా దక్కనీ కళారీతులపై పర్షియన్‌తోపాటు విజయనగర కళా ప్రభావం కూడ బాగా పడింది.

ఈ విషయాలన్నీ ఈపుస్తకంలో వివరించబడినాయి. బహమనీల కాలంనాటి నాణెములగూర్చి, దక్కన్ చిత్రకళారీతుల గురించీ, బిద్రీసాంప్రదాయపు లోహకళగూర్చి, చేనేత కళారీతులగూర్చి క్లుప్తంగా వివరించే వ్యాసాలు ఇందులో వున్నాయి. వ్యాసాలకు తోడుగా అందమైన రంగుల చిత్రాలు పొందుపరిచారీ పుస్తకంలో.

జాన్‌బర్టన్ దౌలతాబాద్, బీజాపూర్‌లగూర్చి, జార్జ్‌మిచిల్ బీదర్, గోల్కొండ-హైదరాబాద్‌లగూర్చి, ఎలిజెబెత్ మెర్క్‌లింగర్ గుల్బర్గాగూర్చి ఇందులో వ్యాసాలు రాశారు. పోతే ఆ కాలంనాటి చిత్రకళారీతులను వివరించే వ్యాసాలను వరుసగా మార్క్ జెబ్రోస్కీ, సుసాన్, స్టీవెన్ కోహెన్ రాశారు.

ముఖ్యంగా చిత్రకళకు సంబంధించి ఇందులో వున్న వ్యాసం అస్పష్టంగా కనపడ్తుంది. విజయనగర చిత్రణలో కనబడే తీవ్ర వర్ణాలు మొగలాయి ప్రభావం కారణంగా దక్కన్ చిత్రకళలో కొంత మేరకు సరళం చేయబడినాయి. నీలం, ఆకుపచ్చ లేత గోధుమ వర్ణం, బంగారు రంగు, తెలుపు, కావి ఎరుపు రంగుల విన్యాసాలకి తోడుగా రమణీయమయిన తీగలవలె రేఖల్ని గీయటం దక్కన్ చిత్రకళలో కనిపిస్తోంది.

రాణి ఖాన్ జాదాహుమయూన్ బేగం అహమద్‌నగర్‌ను పరిపాలిస్తున్న సమయంలో ఆమెభర్త మొదటి హుసేన్ నిజాంషాకు సంబంధించిన సచిత్ర ప్రశంసా కావ్యం 'తారీఫ్-ఇ-హుసేన్ షాహి' వెలువడింది. హైందవ చిత్రరీతులు కూడ ఈ పుస్తకంలో కనిపిస్తాయి.

దక్కన్ చిత్రకళారీతుల్లో అహ్మద్ నగర్‌లో చిత్రించబడిన 'హిందోళరాగం' చాలా ప్రసిద్ధిచెందిన చిత్రం. రంగుల సొంపుల్లో రేఖావిన్యాసంలో ఈ చిత్రం చాలా గొప్పపేరు పొందింది. ఇది చిత్రం కాదు, రసరమ్య కవిత అనవొచ్చు. వసంతరుతువులో పూచిన మామిడిచెట్టుకు వేసిన ఉయ్యాలలో, బంగారు రంగు ఆకాశం కింద తన ప్రియురాలితో ఒక రాజకుమారుడు సరాగాలాడుతుంటాడు. ఈ చిత్రం నయనానందం కలిగించటమే కాదు, నిజంగా హిందోళరాగాన్ని వింటున్నట్లే అనిపిస్తోంది. ఈ చిత్రాన్ని 96వ పుటలో చూడవచ్చు.

దక్కన్ చిత్రకళను అహమద్‌నగర్ సుల్తానులకంటే బీజాపూర్ సుల్తానులు, బీజాపూర్ సుల్తానులకంటే గోల్కొండ సుల్తానులు ఎక్కువగా ఆదరించి అభివృద్ధి పరిచారు. గోల్కొండ చిత్రకళలో ఇంచుమించుగా విజయనగర సాంప్రదాయమే అగపడుతుంది. 1580 నుంచి 1691 దాకాపాలించిన మహ్మద్ కులీకుతుబ్ షా గొప్ప కళాపోషకుడు, చార్మినార్ నిర్మాత. పృష్ఠభూమిపై బంగారు రంగును ఉపయోగించటం, పర్షియన్ రీతిలో కొండలు మొదలైనవి చిత్రించటం, చెట్లు మొగలాయి తీరులో చిత్రించటం గోల్కొండ సాంప్రదాయంగా కనపడ్తుంది.

గోల్కొండ చిత్రకళను సంపూర్ణంగా అవలోకనం చేసుకునే చిత్రం ఒకటి సాలార్ జంగ్ మ్యూజియంలో వుంది. 'మైనాతోవున్న అందమైన పడుచు' అనే ఈ చిత్రం కులీకుతుబ్ షా కాలం నాటిదే! ఈ చిత్రాన్ని ఈ పుస్తకంలో పొందుపరిచివుంటే బాగుండేది.

ఖరీదయిన కాగితాల్లో అందంగా అచ్చయిన, మంచి మంచి చిత్రాలు పొందుపరచబడిన ఈ పుస్తకంలో ఇవ్వబడిన వివరాలు కొన్నిచోట్ల క్లుప్తంగా, మరికొన్నిచోట్ల మరీసాగదీసినట్లుగావున్నాయి. పాఠకులు దీన్ని చదివేముందు ఒకవేళ అందుబాటులోవుంటే అబ్దుల్ మజీద్‌సిద్దికీ రాసిన "హిస్టరీ ఆఫ్ గోల్కొండ", హెచ్. కె. షెర్వానీ రాసిన "ది బహమనీస్ ఆఫ్ ది దక్కన్" అనే పుస్తకాలను చదివితే

బాగుంటుంది. ఈ పుస్తకాలు ప్రస్తుతం దొరకటం కూడ కష్టమనుకుంటాను. అయినప్పటికీ దక్కన్ గూర్చి క్లుప్తంగా నయినా తెలుసుకోవాలంటే ఈ పుస్తన్ని చదవ్వొచ్చు.

—విద్యారణ్య

# స్మృతి ధార

[రామా చంద్రమౌళి, వెల : రు. 5-00 లు. ప్రతులకు : 1) విశాలాంధ్ర బుక్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-520 004. 2) విశాలాంధ్ర బుక్ హౌస్, హనుమకొండ; హైదరాబాద్; విశాఖపట్నం; తిరుపతి; గుంటూరు; అనంతపురం. 3) ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, 3237 రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్ - 500 003. 4) మాధురీ బుక్స్; బ్రాంచ్. నెం. 10-10-88/1, గిర్మాజీపేట, వరంగల్-506 002.]

రామా చంద్రమౌళి ఈ తరం కవులలో ప్రత్యేకమైన కవితా వ్యక్తిత్వం కలిగిన కవి. ఆయన కవిత్వం ఆలోచనాత్మకమైనది. శేషేంద్ర శర్మగారి ప్రభావం వీరిమీద కొంచెం ఎక్కువగానే ఉంది. ఆ ప్రభావం తగ్గే కొద్దీ ఈయన మరింత స్వతంత్రుడైన కవిగా నిలబడ గలడు. ఒక మంచి కవి ప్రభావం ఆతరం కవులమీద పడటంలో దోషం లేదుగాని 'స్టాంపుడు' కవులుగా మిగిలిపోకూడదు. చంద్రమౌళి గారి కవితా ఖండికలను చదివేటప్పుడు అక్కడక్కడ పాదాలు, వాటిలోని భావుకత శేషేంద్రశర్మ గారిని జ్ఞప్తికి తెస్తై. ఈయన ఉత్త అనుభూతికి చెందిన వ్యక్తి వాదికాడు. తనలో ఉన్న సృష్టిని, సమిష్టిని తెలుసుకునే ఈయనలో కవిత్వంగా పరిణమించింది.

నేను నీ నిర్భాగ్య జనవాహినిని నావెంట తోడ్కొని
సముద్రాన్ని సృష్టించిన నదిలా
నిరంతర ఘోషతో శ్రమిస్తాను ఎడతెగని దీక్షతో
అయితే విజయం నీదా నాదా అన్నది మీమాంసకాదు
ఈ దేశం యంత్రంలో వో భాగాన్నయిన నేను
నేనుగా వేరే లేనేలేను - నేనేనువ్వు.

ఈ పాదాల్లో కవి దృక్పథం స్పష్టమే. ఎంత గొప్ప కవిత్వమైనా దానికోసమే అదే అయితే చదుపరులకు దాంతో ఏ నిమిత్తం ఉండదు. కవిత్వం చదువుతున్నప్పుడు పాఠకుడు, తన్ని, తనచుట్టూ ఉన్నటువంటిదాన్ని కొత్తరూపంలో చూస్తున్నట్టు అనుభూతి చెందాలి. అట్లాంటి అనుభూతిని కలిగించటంలో రామా చంద్రమౌళి గారి కవిత్వం సమర్థవంతమైనదేనని నేను భావిస్తున్నాను.

ఈ పక్షికి 'రేపు' లేదు
ఈ చెట్లకు ఈ గట్లకు రేపులేదు
ఉన్నదల్లా ఆనంద మహాసముద్రంలో
స్పందించే నే డొకటే
కానీ నీకూ నాకూ రేపు కోసం
ఓ అనంత తపన కళ్ళపై కూర్చుంది గుడ్లగూబలా
అందుకే ఎన్ని విషవృక్షాలు విస్తరిస్తున్నాయె గుండెలపై
యుగ యుగాల ఆత్మవికాసాంతర యానం తరువాత
ఎదిగి ఎదిగి ఈ తీరం చేరుకుంటే
'నా' అనే లంగరు మిగిలింది

ఈ పాదాలు ప్రతిమనిషీ ఆత్మశోధకు చెందినవే.

చెవిటివాడికి శంఖం, గుడ్డివాడికి వెలుగువల్లా ప్రయోజనం లేదు. చెవులు ఉండీ వినకపోవటం, కళ్ళు ఉండీ చూడకపోవటం, ఆత్మహత్య కన్నా పాపం. ఈ సంఘంలో కన్ను, చెవి, నోరు సక్రమంగా పనిచెయ్యటానికి జ్ఞానం అవసరం. ఎట్లాంటి జ్ఞానమో తెలుసుకొనటానికి ఇట్లాంటి కవితా సంకలనాలు బాగా ఉపకరిస్తై.

—టి. యల్. కాంతారావు

# సాక్ష్యం మానవాళి సమక్షంలో

[మూలం : మౌలానా సయ్యిద్ అబుల్ ఆలామౌదూది (రహ్మాలై) ; అనువాదం : ఎస్సెమ్ ఖాద్రి ; ప్రకాశకులు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్ కోట్, ఛత్తా బజార్, హైదరాబాద్-500 002; పేజీలు : 46; వెల : రు. 3-00 లు, సైజు : డెమ్మీ.]

ప్రళయ దినంనాడు ప్రజలను దేవుడు వారుచేసిన పాపాలను గూర్చి ప్రశ్నించినపుడు, వారు తమ అజ్ఞానాన్ని ప్రదర్శించకుండా, ప్రవక్తలు ముందుగానే వారికి "పాపం చేయకు, మంచినే చేస్తూ ఉండు!" అని హితం చెప్పారు. - రచయిత చెప్పదల్చుకున్న విషయం ఇది.

రచయితలో భావనకంటె ఆవేశం ఎక్కువగా కన్పిస్తుంది. సమాజాన్ని మతం పేరుతో దుయ్యబట్టారు - "మన న్యాయవాదులు, న్యాయాధిపతులు ఇస్లామ్‌లోని శాసనాలన్నీ లోపభూయిష్టమయినవే అని, ఇస్లామియ చట్టంయొక్క మౌలిక సిద్ధాంతమే ఒప్పుకోతగింది కాదు అని, కేవలం మానవులు నిర్మించుకున్న చట్టాలే సరి అయినవి అని చెప్పకనే చెబుతున్నారు. పాశ్చాత్య నాస్తిక బోధనలనుండి గ్రహించిన తత్త్వ విజ్ఞాన శాస్త్రాలు....సిద్ధాంతాలే సత్యమయినవని మన అధ్యాపకులు, ప్రొఫెసర్లు; విద్యాలయాలు సాక్ష్యం పలుకుతూ, ఈ విషయాల్లో ఇస్లామియా దృక్పథం ఏమాత్రము పరిశీలించ దగ్గది కూడా కాదని నిరూపిస్తున్నారు." — ఇలాగే పత్రికలను, వాణిజ్య వేత్తలను, పారిశ్రామిక వేత్తలను రచయిత తప్పు పట్టాడు. కాని వారంతా ఏమేమి పొరపాట్లు చేశారో, ఏమిచేయకూడదో, ఏమి చేసి యుండవలసిందో సవివరంగా నిర్దుష్టంగా చెప్పాలి.

అక్కడక్కడ ఇతర మతావలంబులను తక్కువగా భావించడం జరిగింది. "ఇస్లాం అంటే ఏమిటి? ముస్లిం అవడం అంటే ఏమిటి?" అని ప్రశ్నించి తిరిగి సరి అయిన సమాధానం ఇవ్వలేకపోయాడు రచయిత. "మీ జమా అత్ లీడర్‌ని 'అమీర్' అని ఎందుకు అంటున్నారు?" అని ప్రశ్నించాడు. అలా ఎవరిని ప్రశించాడో అర్థం కావటం లేదు. తిరిగి రచయిత జకాత్ వసూలుచేయటంపై విరుచుకు పడ్డాడు. ఆయన వేసే ప్రశ్నలు ముస్లిములనా, ముస్లిమేతరులనా

లేక ఇద్దరినీ కలిపా - అర్థం కావటం లేదు. "జమా అత్ లేకుండా ఇస్లాం లేదు! అనే వాక్యం మాత్రం బాగుంది.

ఈ పుస్తకంలో ఉపాసనకంటె పటాటోపం ఎక్కువగా కన్పిస్తుంది. రాజకీయ శైలి బాగా చోటుచేసుకుంది. ఈ పుస్తకంలో ధార్మిక గ్రంథ లక్షణములకంటె రాజకీయ కరపత్ర లక్షణములు ఎక్కువగా ఉన్నాయి.

# కబీరు

## ( దోహాల స్వేచ్ఛానువాదమాల )

[అనువాదం : దేవరకొండ సుబ్రహ్మణ్యశాస్త్రి, క్రౌను సైజు, పేజీలు 43, వెల : రు. 12-00లు, ప్రతులకు: 1) శ్రీ కళాభారతి, బొబ్బిలి. 2) శ్రీమతి దేవరకొండ అన్నపూర్ణ భవాని, C/o. శ్రీ డి. ఎస్. శాస్త్రి, సబ్ జడ్జి, అనకాపల్లి-531 001.]

'కవయః క్రాంతదర్శి' అని ఆర్యానుడి. 'కవి' శబ్దానికి 'బ్రహ్మ' అని అర్థం. చతుర్ముఖ బ్రహ్మ ఈ చరాచర జగత్తును సృష్టిస్తే, కవి అనబడే బ్రహ్మ ఈ జగత్తుకు ప్రతిజగత్తును సృష్టిస్తూ రసమయ కావ్యరచన చేస్తాడు. అంటే బ్రహ్మత్వసిద్ధి కలుగనిది ఎవ్వరూ కావ్యరచన చేయలేరు. అందుకనే 'నానృషిః కురుతేకావ్యం. అని శృతి వచనం.

కబీరు బ్రహ్మవేత్త. రామానందుని వైష్ణవ సంప్రదాయం, శంకరుని అద్వైతం కలిసి ఆయనలో రహస్యవాదంగ భాసించింది. కబీరు భావాలను అర్థంచేసుకోవటం ఆత్మధర్మావలంబులకే సాధ్యం. మరి ఆ భావాలకు భాషాంతరీకరణ చేయటమంటే శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు గొప్ప తత్త్వవేత్త అన్నమాట!

"దేవుడుండు నీ మనసునందు పుష్పమందున వాసనట్టుల; కష్టకాలమందు - కమలాక్షు నర్చింతురిలను సుఖదినాల - తలప రెవరు; కుంకుమరేఖ దిద్దలేదు-కళ్ళ కాటుక బెట్టలేదు, కళ్ళయందున ప్రభువు గలడు - కాటుకకు చోటేదియందు; దేవుని అంగగలవాని - దునుమగలేరెవ్వరునూ; కంటిలోని పాపయటుల తనువులోనె దేవుడుండు; కంటియందున నీవెయుంటివి-నిద్దురకును చోటేది చెపుమ; గాలి లాగి వదలు తోలుతిత్తి పగిది మమతలేని తనువు పట్టి రుద్ర భూమి; మూగవాడు చెప్పగల్గునె తినిన కలకండ మధురిమను, ఆత్మ సాక్షాత్కార విధిని ప్రశ్నవేసియు తెలియనగునె!" అంటూ 'కబీరు తెలుగుగడ్డపై పుట్టి తిరిగి రచన సాగించాడా!' అన్నట్లుంది శ్రీశాస్త్రి గారి కావ్యశైలి.

—కేప్టెన్ షేక్ మౌలాలి

# ఆధునిక చిత్రకళ

[రచన : చలసాని ప్రసాదరావు, ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్ హైదరాబాద్-500 001, వెల: రూ. 15/-లు, పేజీలు : 169.]

ఇది వివిధ పత్రికల్లో వచ్చిన 31 వ్యాసాల సంపుటి. రచయిత ఈ వ్యాసాల్లో ఆధునిక చిత్రకళ గురించి సమగ్రంగా చర్చించారనే చెప్పవచ్చు. ఆధునిక చిత్రకళ గురించిగానీ, ప్రాచీన చిత్రకళ గురించిగానీ ఈమధ్యకాలంలో మనపత్రికల్లో చోటులేకుండాపోయింది. ఇది ఇప్పటి పాఠకుల అభిరుచి అని అనుకోటానికి వీలుకల్పిస్తున్నది. ఇంతకి ముందుకూడా దాదాపు ఇదే పరిస్థితి కొనసాగింది. తారల చిత్రాలు తప్ప ఆధునిక రీతులతో వచ్చిన చిత్రకళను ప్రచురించిన పత్రికలు శూన్యం. ప్రాచీన రీతుల్లో వచ్చే చిత్రాలకు కూడా ప్రోత్సాహం అంతంత మాత్రం. ఇలాంటి పరిస్థితుల్లో చిత్రకళ మీద వ్యాసాలు, పరిచయాలు ఎట్లా వూహించగలం. కొన్ని పత్రికల్లో ఉత్తమ సాహిత్యం అందించినా, గొప్ప శిల్పకళ, చిత్రకళగురించి చెప్పినా ఆదరించే పాఠకుల కొరత ఎక్కువగా వుంది.

ఇలాంటి వాతావరణంలో కొద్దిగావుండే చిత్రకళాభిమానులకు, చిత్రకళ గురించి తెలుసుకోవాలన్న తపన వున్నవారికి ఈ పుస్తకం ఉపయోగకరంగా వుంటుంది. గ్రాఫిక్స్, కార్టూన్స్, శిల్పకళ, కలంకారీ, బతిక్ చిత్రకళల గురించి చర్చింటంతోపాటు రాజా రవివర్మ, ఆర్. కె. లక్ష్మణ్, ఎస్వీ రామారావు, మొక్కపాటి కృష్ణమూర్తి లాంటి తరతరాల చిత్రకారుల గురించి పరిచయాలువున్న ఈపుస్తకం అచ్చులో అందంగా వుంది. మంచి రిఫరెన్స్ బుక్.

—బాబు

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247

